

అందమైన అమ్మాయి కట్టింది అమ్మవేషం!
విరబూసెనులే చిరునవ్వుల పారిజాతం!!
ఇది తెలుగువారి చీరకట్టు!
పసి పిల్లలనూ ఆకట్టు!!

ఫొటో: వి. నర్సయ్య

నవ్యనవలా వేదిక

# చతుర

సంపుటి: 28 సంచిక: 2

మార్చి 2005 326వ సంచిక

## ఈ సంచికలో...!



ఇలస్ట్రేషన్స్: శివాజీ

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: మధు మోడల్: మధుశర్మ

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (4)

"వినదగునెవ్వరు చెప్పిన" అన్నారు పెద్దలు. మపాసా (1850-1893) అంతటి వాడు చెప్పిన సలహాలు నిత్యం మననం చేసుకోవాలి కూడాను. 1888లో "పియర్ అండ్ జాం"కు రాసిన ఉపోద్ఘాతాన్ని చదివి హెన్రీజేమ్స్, "ఇంత అద్భుతమైన విశ్లేషణ చేసినందుకు పాఠకలోకం మపాసాకు సదా రుణపడి ఉంటుంది" అన్నాడు.

"రచయిత లక్ష్యం కథ చెప్పటమూ, పాఠకులకు వినోదం కల్గించటమూ కాదు. లోకం కప్పుకున్న ముసుగుల్ని తీసి చూడగలగాలి రచయిత. తప్పనిసరిగా ఇది వయ్యక్తిక అనుభవమే. వ్యక్తులు, పరిస్థితులు, సంఘటనలు అన్నీ రచయిత అర్థం చేసుకున్న దృష్టికోణం నుండి మాత్రమే రాయగలడు. తనలో కలిగిన స్పందననే పాఠకులకూ కలుగచేయటానికి ప్రయత్నిస్తాడు. రచయిత ప్రయత్నం పాఠకుడికి కనిపించకూడదు. అప్రయత్నంగా, సులభంగా, కబుర్లు చెప్పినట్టుగా ఉంటే కథ పండిందన్నమాట.

పాత్రలను ఎన్నుకోవటంలోనే రచనా ప్రయోజనం తెలిసిపోతుంది. సంఘటనల్ని మలిచిన పద్ధతిలోనే అతని లౌకిక దృష్టి అవగాహన అవుతుంది. మన ప్రేమలు, ద్వేషాలు, ఆరాటాలు, పోరాటాలు పరస్పరం సంఘర్షించుకుంటాయి. సామాజిక, ఆర్థిక, రాజకీయ, వ్యక్తిగత ప్రయోజనాలు అనుక్షణం ఒకదానితో ఒకటి పోటీ పడుతుంటాయి.

సెంటిమెంటల్, ఎమోషనల్ నాటకీయతతో, స్వీట్ నథింగ్స్‌తో ప్లాటు తయారుచెయ్యటమంటే ఆత్మద్రోహమే. వాస్తవాలు తెలియజెప్పని రచనల వల్ల పాఠకులకు ఒరిగేదేమీ ఉండదు.

ఇక్కడే వస్తుంది చిక్కు. రచయిత విచక్షణతకు పరీక్ష. తెలిసిందంతా, చూసిందంతా రాస్తామా? "ఏది రాయాలి?" అనేదానికన్నా, ఏది రాయకూడదో తెలుసుకోవటం ముఖ్యం. నిత్యానుభవంలోనే ఉన్నా జనం గమనించని విషయాలుంటాయి కొన్ని. వాటిని రచయిత పట్టుకోగలగాలి. కథకు విలక్షణత కలిగించేది ఈ సుగుణమే.

మపాసా

ఏకరువు పెట్టటం, జరిగింది, జరిగినట్టు యథాతథంగా రాయటం కథ కాదనుకున్నాం. కొన్ని విషయాలను మాత్రం ఎంపిక చేసుకొని రాస్తే మరి "వాస్తవికత సంగతేమిటి?

పైగా, జీవితంలో ఊహించని సంఘటనలు, పరస్పర విరుద్ధమైన సంఘటనలు, నిర్హేతుకమైన విషయాలు, ఒకదానితో ఒకటి పొంతన లేని విషయాలు ఎన్నో జరుగుతుంటాయి.

అందువల్ల రచయిత ఈ గందరగోళం లోంచి తన కథకవసరమైన అంశాలు మాత్రం ఎంచుకోక తప్పదు.

ఒక చిన్న ఉదాహరణ: ప్రమాదాల్లో రోజూ వందలమంది మరణిస్తున్నారని చదువుతూనే ఉన్నాం గదా. అంతమాత్రం చేత మన ప్రధాన పాత్ర కారు కింద పడి చచ్చాడని కథ ముగిస్తామా?

అర్థంలేని, అర్థంకాని విషయాలెన్నో జరుగుతాయి జీవితంలో. కథలో ప్రతి సంఘటనకూ, పాత్రలు చేసే ప్రతి పనికీ ఓ కారణం, ఓ లక్ష్యం ఉంటుంది. రోడ్డు మీది శబ్దాలకూ, ఆర్కెస్ట్రా వాయిద్యాలకూ తేడా ఉంది. జీవితానికీ, కథకూ ఉన్న తేడా కూడా అదే. జీవితంలో మన ప్రమేయం లేకుండానే అనేక విషయాలు తెలుసుకుంటాం. కథ చదివితే రచయిత చెప్పదలచుకున్నది మాత్రమే తెలుస్తుంది.

అందువలన, కథ వాస్తవికంగా ఉన్నదీ అంటే రచయిత మనకు వాస్తవికత అనే భ్రమ కలిగిస్తున్నాడన్నమాట. విప్లవ వాస్తవికత, సామ్యవాద వాస్తవికత, పెట్టుబడిదారీ వాస్తవికత అంతా రచయితలు సృష్టిస్తున్న మాయాజాలమే. "నేను వాస్తవికంగా రాస్తున్నాను" అనే నైతిక హక్కు ఏ కాల్పనిక రచయితకూ లేదు.

సార్వజనీనమైన వాస్తవికత అనేది అసలున్నదా? ఇంద్రియ గ్రహణశక్తి మన అనుభవానికి పరిమితులు విధించటం లేదూ? సముద్రంలో దిగినా దోసిలితో మాత్రమే నీళ్లు పట్టుకోగలం. ఈ విశాల విశ్వంలో ఇన్ని కోట్లమంది ఉన్నా, ప్రతి వ్యక్తీ తాను సృష్టించుకున్న చిన్నలోకంలోనే బతుకుతాడు. ఎవరి భ్రమలు వాళ్లవే. ఈ భ్రమల్ని నిజాయితీగా కాగితం మీద పెట్టటమే (సో కాల్డ్) వాస్తవిక రచయితలు చెయ్యవలసినవి.

... ... ...

ప్రతి వ్యక్తీ జీవితంలో తనకు తానే ఒక హీరో. కాని కథల్లో మాత్రం కొందరు హీరోలు కావటానికి అనర్హులు. కేవలం స్వంత సమస్యలతో సతమతమయ్యేవాడు, స్వంత జీవితంతో తృప్తిపడి "నాకెవ్వరితో ఏలాంటి సంబంధం వద్దు" అనుకునే మనిషి హీరోగా రాణిస్తాడా? ముఖ్యంగా. కోపం వస్తే ఆడవాళ్ల మీద చేయి చేసుకునే బలహీనులు హీరోలు కారు. వీరు విలన్లు. పిరికి పందలు.

పిరికివాళ్ల గురించే రాయాలనుకుంటే, పిరికితనానికి కారణమైన పరిస్థితుల్ని విశ్లేషించి చూపగలగాలి.

– ముక్తవరం పార్థసారథి

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)**

★

జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్ గారి సందేశం

# ఆచరించి చూడు!

అందరికీ ప్రియంగా ఉండేందుకు ప్రయత్నించటం కూడా మంచిదికాదు. అందరినీ ప్రసన్నం చేసుకోవాలనుకునే వారు అర్థరహిత పొగడ్తలతో వ్యవహరించి పనులు సాధించుకుంటారు. అది నీచకర్మ.



మహర్షి దాతాదయాల్
శివవ్రత్‌లాల్ వర్మన్

స్వతంత్రుడూ, నిష్కామకర్మ చేసేవాడిలా, హృదయ వైశాల్యం వున్న వాడూ, సదా సర్వదా చిత్తాన్ని ప్రసన్నంగా ఉంచేవాడే సత్యమైన సర్వప్రియుడు.

ముఖంపై చిరునవ్వును చెదరనియ్యకు. సదా ప్రసన్నంగా వుండేందుకు ప్రయత్నించు. నీ దుఃఖాన్నీ, బాధల్నీ, వ్యథల్నీ ఎవరితోనూ చెప్పుకోకు. ప్రపంచంలోని ప్రతి మనిషిపైనా ఏదో ఒకరకమైన దుఃఖభారం ఉంది. అతనికి తన దుఃఖాల్ని, దూరం చేసుకోవటమే చేతగాదు. ఇక నీ వ్యథల్నీ, నీ భారాన్నీ తలకెత్తుకునే సమయం, ఓర్పు ఎక్కడున్నాయి?

ప్రపంచంలో బ్రతికినన్నాళ్లూ నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ రోజులు గడుపు. చింతలతో దిగులుపడటం మానుకో. (1) భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసం సడలనీయకు. (2) ఏదో ఒక రోజు మరణించటం తప్పదని మరువకు. ఇక సుఖ దుఃఖాలెక్కడివి?

ఇతరులతో వ్యవహరించేటప్పుడు స్వార్థపు ఆలోచనలు మానుకో. నిష్కామకర్మ ఆచరిస్తే హృదయం విశాలమవుతుంది. యువకుడివైతే సహనశీలతతోనూ, వృద్ధుడివైతే ప్రేమతోనూ వ్యవహరించు. ఇవే మనిషికి ఆభరణాలు.

ధనవంతుడిననీ, విద్యావంతుడిననీ, బలవంతుడిననీ గర్వించకు. గర్విస్తే ఇతరుల మనస్సుల్లో నీకు స్థానం ఉండదు. వృద్ధాప్యంలో బలహీనతలో కూడా తన గొప్పలు చెప్పుకునే మనిషి నవ్వులపాలవుతాడు. ధనవంతుడు పరిస్థితుల కారణంగా దరిద్రుడైతే తన పాత వైభవాన్నీ, సిరిసంపదల్నీ తల్చుకుని ప్రగల్భాలు పలుకుతుంటే అవమానాలు

6 మార్చి 2005 ఆంధ్రజ్యోతి

ఎదురవుతాయి.

నా జీవనంలో అయిదు నియమాలేర్పరచుకున్నాను.

(1) మనోవాక్కాయ కర్మలతో ఎవరికీ దుఃఖం, బాధ కలిగించకూడదు. (2) సమయాన్ని వ్యర్థ ప్రసంగాలతో నష్టపర్చకుండా పనిచేయటంలో మనసుని నిమగ్నం చేయాలి (3) మనిషికి తన మీద తనకు విశ్వాసం వుండాలి. ఎవరి సాయమూ అర్థించరాదు. (4) ఏ పనీ లేని సమయంలో పరమాత్ముని ధ్యానించాలి. (5) ఏకాంతాన్ని వంటరితనాన్ని పరమాత్ముని దయగా భావించాలి. దానిని ఆయన సేవలో స్మరణ, ధ్యానం, భజనలలో వినియోగించాలి.

లోకంలోకి తను వచ్చిన పని పూర్తిచేసుకుని వెళ్ళాలనుకునే వ్యక్తి సజ్జన సాంగత్యం చేయాలి. దుర్జన సాంగత్యం మనిషిని చెడు మార్గంలో నడిపిస్తుంది గనుక దుష్టుల స్నేహం చేయరాదు.

పనిచేస్తున్నా, ఏకాంతంగా ఉన్నా సర్వకాల సర్వావస్థల్లోనూ దైవధ్యానం చేస్తూ ఉండు. ఆ దైవమే అన్ని పనులూ నీతో చేయిస్తున్నాడన్న విశ్వాసం పెంచుకో.

## సూక్ష్మత

సూక్ష్మ విచారాలుగల మనిషి పనులు నియమానుకూలంగా స్వచ్ఛమై, సుందరమై ఉంటాయి.

మెరుపే రత్నానికి విలువ పెంచుతుంది. తామరాకుపై నీటి బిందువుకు మెరుపే వింత అందాన్నిస్తుంది. సూక్ష్మత మనిషి పవిత్రతనూ, స్వచ్ఛతనూ, న్యాయశీలతనూ పెంచుతుంది.

ఇలాంటివారి ఇల్లు, శరీరం, మనసు అన్నీ పవిత్రంగానే ఉంటాయి. వారి మాటలు రసవంతమై ఆహ్లాదభరితంగా ఉంటాయి. ఇతరులను నొప్పించే శబ్దం వారి నోటి నుండి ఎప్పుడూ వెలువడదు.

ప్రపంచంలో మంచి, చెడు రెండూ ఉంటాయి. సున్నితమైన మనసు గలవారు పూలలోని సుగంధం లాంటివారు.

మాట తీరులో, నడవడిలో, పరమార్థ వ్యవహారంలో, కర్మలలో, ధర్మాలలో, చదవటంలో, రాయటంలో, జీవనంలోని సర్వకాల సర్వావస్థల్లో పరిశుద్ధతను మనిషి పాటించాలి. దీనివల్ల వ్యక్తి హృదయం విశాలమూ, బుద్ధి తీవ్రమూ అవుతుంది.

## భోజనం

వ్యక్తిగత ప్రకృతి మేరకు శరీర తత్వాన్ని బట్టి ఆహార నియమాలు పాటించాలి. దేహానికి సరిపడని భోజనం తీసుకోగూడదు. భుజించే ఆహారం సమతులంగా ఉండేలా చూసుకోవాలి.

ఉత్తరాదివారు పుష్టికరమైన ఆహారం గోధుమలు, పెసరపప్పు, పాలు, నెయ్యి వంటివి అధికంగ తీసుకుంటారు. దక్షిణాదివారు ఉప్పు, కారం అధిక పాళ్లలో ఉన్న భోజనం తినటం చూస్తుంటాం. ఏ ఆహారం తీసుకున్నా అది అప్పు చేసి తెచ్చిందో, దొంగతనం చేసి తెచ్చిందో కాకుండా కష్టించి సంపాదించినదై ఉండటం తప్పనిసరి. న్యాయార్జితమే మేలు చేస్తుంది. వృద్ధులు నేతితో కూడిన భోజనాన్ని రోజుకు ఒకేసారి తినటం మంచిది. సాయంకాలం సులభంగా జీర్ణమయ్యే పాలువంటి ద్రవ పదార్థాలు తీసుకోవాలి. యువకులు సాధ్యమైనంతవరకు సూర్యాస్తమయానికి ముందే రాత్రి భోజనం ముగించాలి. దీనివల్ల భోజనం సులభంగా జీర్ణమవుతుంది. నిద్రకు ఉపక్రమించే ముందు భోజనం చేస్తే స్వప్నాలు బాధిస్తాయి. ఆరోగ్యం పాడయ్యే ప్రమాదం ఉంది. జీర్ణ ప్రక్రియ సంబంధం సూర్యుడితో ఉంటుంది గనుక సూర్యరశ్మి ఉన్నప్పుడు చేసే భోజనం లాభదాయకమవుతుంది.

సేకరణ, అనువాదం – జ్యోతిరాణి

★

# మీరూ చతురులే!

## మీ ప్రశ్నలకు శంకరనారాయణ సరదా సమాధానాలు

ఎం. మల్లికార్జున్, విజయవాడ

**ప్ర:** *నేను తలెత్తుకు తిరగాలంటే ఏం చేయాలి?*

జ: మీకన్నా తక్కువ ఎత్తు ఉన్న అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలి

వి. శారద, తాడిపత్రి

**ప్ర:** *ఫ్యాక్షన్ లీడర్‌నవ్వాలంటే...*

జ: గిట్టనివాడు ఏడ్వాలి

కె. అనంత్, కడప

**ప్ర:** *గుడ్డి ఎద్దు చేలో పడ్డట్టు అని సామెత మరి మెల్ల ఎద్దు చేలో పడితే ఏమవుతుంది?*

జ: 'ష్! మెల్లగా' అనండి... ఎద్దులకు కూడా చెవులుంటాయి కదా!

ఎస్. వి. నారాయణ, ప్రొద్దుటూరు

**ప్ర:** *మూడో ప్రపంచయుద్ధం ఎప్పుడు వస్తుంది?*

జ: మా ఆవిడ పుట్టింటికి వెళ్లింది. ఆమె వస్తేగానీ చెప్పలేను

ఎం. సుజన, తాడేపల్లిగూడెం

**ప్ర:** *అత్తలేని కోడలుత్తమురాలు. మరి మామలేని అల్లుడు?*

జ: ఆస్తులు కలిసి వచ్చి ధనవంతుడు కావచ్చు

వి. సుబ్బారాయ, కరీంనగర్

**ప్ర:** *పిచ్చి ముదిరితే*

జ: హై'పిచ్చి'లో కవిత్వం

ఎం. వి. నారాయణ, ఆముదాలవలస

**ప్ర:** *తప్పుమీద తప్పుచేస్తే*

జ: 'బ్లండర్‌ఫుల్' తప్పించుకోవడానికి పాలిటిక్స్‌లో చేరితే సరి

పి. సుబ్రహ్మణ్యం, నెల్లూరు

**ప్ర:** *పిల్లలు చేష్టలు చేసేవాళ్లను ఏం చేయాలి?*

జ: 'ఏ'సర్టిఫికెట్ సినిమా చూపించాలి

వి. వెంకటేశ్వరరావు, ఒంగోలు

**ప్ర:** *కబాడీ ఆడాలని ఉంది. ముందు జాగ్రత్తలు చెబుతారా?*

జ: 'ఓడిపోయినా ఫర్వాలేదు కానీ బాడీ జాగ్రత్త' అన్నదే.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసే వారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యం కాదు.

**★ నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం**

**కూపన్**

మార్చి చతుర నవల **సత్తికొండ**

చిరునామా: ______________________________

______________________________

______________________________

______________________________

# ఛాందసుల్ని నిలదీసిన 'మూణ్ణాళ్లముచ్చట'

కథ వెనుక కథ

సాహిత్యాన్ని ఆస్వాదించే మనం ఎన్నో కథలు చదువుతాం. కొన్ని చదవగానే మర్చిపోతాం. కొన్ని కొంతకాలం గుర్తుంటాయి. కొన్ని మాత్రం ఎప్పటికీ మర్చిపోలేం. వాటి తాలూకు పాత్రలు, సంఘటనలు మనకు తరచూ గుర్తొస్తూనే ఉంటాయి. కేవలం చదివితేనే మనకంతలా గుర్తుండిపోయిన కథను... కథగా మలచాలన్న ఆలోచన రచయితకు ఎందుకు వచ్చిందో... అలా మలచడానికి పడ్డ తపనేమిటో... ఆ ప్రయత్నంలో పడ్డ పాట్లేమిటో... తెలుసుకోవడం ఎవరికైనా ఆసక్తికరం. దీన్ని దృష్టిలో పెట్టుకునే 'చతుర' ఈ 'కథ వెనుక కథ'... శీర్షిక ప్రవేశపెడుతోంది. ఈ శీర్షిక కింద ఈనెల మనం ప్రముఖ రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి 'మూణ్ణాళ్ల ముచ్చట' కథ వెనక కథ ఏమిటో తెలుసుకుందాం.



అబ్బూరి ఛాయాదేవి

గంగిగోవు పాలలా... తక్కువ రాసి ఎక్కువ పేరు తెచ్చుకున్న కొద్దిమంది రచయితల్లో అబ్బూరి ఛాయాదేవి ఒకరు. 1933లో రాజమండ్రిలో పుట్టిన ఛాయాదేవి ఎం.ఎ. చదివారు. న్యూఢిల్లీలో ఇండియన్ స్కూల్ ఆఫ్ ఇంటర్నేషనల్ స్టడీస్ లైబ్రరీ, జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ లైబ్రరీల్లో లైబ్రేరియన్‌గా పనిచేశారు. 1982లో స్వచ్ఛంద పదవీవిరమణ చేసి హైదరాబాదులో స్థిరపడ్డారు. దాదాపు యాభై వరకు కథలు రాసిన ఛాయాదేవి పలు సంకలనాలకు సంపాదకురాలిగా వ్యవహరించారు. జిడ్డు కృష్ణమూర్తి రచనలను అనువదించారు. పలు అవార్డులూ అందుకున్నారు. సనాతన ఛాందసవాద కుటుంబ నేపథ్యం నుంచి వచ్చిన ఛాయాదేవి అలనాటి ఆ ఆచారాలను పాటించలేక... ఎదిరించలేక... రెంటి మధ్య నలిగిపోతూనే తన ఆలోచనలకు అక్షరరూపమివ్వడం ద్వారా సేదతీరారంటే అతిశయోక్తి కాదు. అటువంటి ఓ ఆచారం తనను మానసికంగా ఎంత బాధించిందో తెలియచేస్తూ రాసిన కథే 'మూణ్ణాళ్ల ముచ్చట'. సుమారు మూడు దశాబ్దాల క్రితం వచ్చిన ఈ కథ ఆనాటి ఛాందసవాద సమాజంలో సంచలనం సృష్టించింది.

స్త్రీలు నెలకు మూడురోజులపాటు బయట కూర్చునే ఆచారం ఆధునిక వాతావరణంలో, మారుతున్న జీవనశైలిలో ఎంత



ఇబ్బంది కలిగిస్తుందో చాలా సున్నితంగా చిత్రించారు ఈ కథలో. ఉత్తమ పురుషలో సాగిన ఈ కథలో కథానాయిక తల్లికి విపరీతమైన చాదస్తం. ఎక్కడ, ఏ పరిస్థితుల్లో ఉన్నా మడీ, ఆచారం పాటించాల్సిందేనంటుంది. కూతురు ఉన్నత చదువులకు కాలేజీకి వెళ్తున్నా, పెళ్లయ్యాక ఉద్యోగానికి వెళ్తున్నా అంటూ సొంటూ అంటూ గొడవ చేస్తుంది. అత్తగారి ఆచారం అల్లుడికి నచ్చదు. భార్యమీద విసుక్కుంటాడు. తల్లికి తెలియనంతవరకు స్వేచ్ఛగా మసలడం, ఆమె ఎదురుగా ఆచారాలను పాటిస్తున్నట్లు అబద్ధాలు చెప్పడం కథానాయికకు తప్పనిసరవుతుంది. దాంతో విపరీతమైన మానసిక ఒత్తిడికి గురవడం, రహస్యం తల్లికి తెలిసిపోయినట్లు పీడకలలు కనడం జరుగుతుంది. కూతురింట్లో నాలుగు రోజులుందామని వచ్చిన తల్లిని వెళ్లిపొమ్మని చెప్పలేక, తనంతటతాను వెళ్లేలా చేయలేక కథానాయిక నిస్సహాయంగా నిట్టూర్చడం... ఈ కథాంశం. ఈ కథ నేపథ్యాన్నీ, పర్యవసానాన్ని రచయిత్రి ఛాయాదేవి ఇలా వివరించారు.

అది ముచ్చట కాదు

నేను 1973లో రాసిన 'మూడునాళ్ల ముచ్చట' అనే కథ ఒక ప్రముఖ వారపత్రికలో ప్రచురితమైంది. దాన్ని ప్రచురణకు స్వీకరిస్తారన్న ఆశ అంతగా లేకపోయినా పంపించాను. దాని కథావస్తువు అటువంటిది. ఫలానా విషయం మీద కథ రాశానని మావారికి చెప్పగానే... 'లాభం లేదు' అన్నారు నవ్వుతూ. 1960లో ఒక వారపత్రిక స్త్రీల ప్రధాన సమస్య ఏమిటి అనే విషయం మీద వ్యాసరచన పోటీ పెట్టింది. నేను ఊరికే మావారిని అడిగాను. ఆయన ఉద్దేశంలో స్త్రీల సమస్య ఏమిటని? ఠక్కున సమాధానం చెప్పారు.... నెలనెలా పడే బాధని. ఛీ అన్నాను వెంటనే. కానీ ఆలోచించగా నిజమే కదా అనిపించింది. కానీ అటువంటి విషయం మీద వ్యాసం రాస్తే ఏం బావుంటుంది? రాసినా ఎవరు స్వీకరిస్తారు... అనుకున్నాను.

నేను ఛాందస కుటుంబంలో పుట్టి పెరి

గాను. మా అమ్మ చాలా మడీ, ఆచారం పాటించేది. మొదట్లో మా నాన్నగారికీ ఉన్నా, తరవాతి కాలంలోకొంత సడలించారు. కానీ నాకు నెలనెలా బయట కూర్చోవడం తప్పేది కాదు. నాకు ఆ అనుభవం లోలోపలికి కుంచించుకుపోతు న్నట్లుండేది. నెలకు మూడు రోజులు కాలే జీకి వెళ్లడం మానేస్తే నష్టం. వెళ్తే నానా ఇబ్బందులూ. ఈ రోజుల్లో ఉన్న సౌక ర్యాలు అప్పుడు లేవు. ఇంట్లో అమ్మ పొద్దున్నే మడి కట్టుకు కూర్చుంటే నాకు కావాల్సినవి అందించడానికి చాలా ఇబ్బంద య్యేది. ఇంకా ఇతరత్రా ఇబ్బందులెన్నో ఎదుర్కోవాల్సి వచ్చేది. మా నాన్నగారి భయానికి, మా అమ్మ విసుక్కుంటూనే నన్ను కాలేజీకి వెళ్లనిచ్చేది. పై చదువు కోసం హైదరాబాదులో అన్నయ్య వాళ్లింట్లో ఉన్నప్పుడు నాకు స్వేచ్ఛ లభించింది. అన్న య్యవి ఆధునిక భావాలు. ఇంట్లో మామూ లుగా ఉండమనేవాడు. అమ్మ దగ్గరకు వెళ్లి నప్పుడు మాత్రం నాకిష్టం లేకపోయినా ఆచారం పాటించక తప్పేది కాదు. పెళ్ల య్యాక ఈ విషయంలో నా స్వేచ్ఛ కొనసా గింది. అమ్మ దగ్గరకు వెళ్లినపుడు మాత్రం తప్పేది కాదు. పెళ్లయ్యాక మా అత్తగా రింట్లో అంత ఛాందసత్వం లేదు. అయితే ఇరుగుపొరుగు సైతం నా వ్యవహారంలో తలదూర్చడంవల్ల అప్పుడప్పుడు ఇబ్బందిపడే దాన్ని.

ఉద్యోగరీత్యా ఢిల్లీ వెళ్లడం ప్రాణానికి హాయిగా ఉండేది. కానీ అక్కడున్నప్పుడు ఓసారి మా అమ్మ వచ్చింది. వచ్చింది నాలుగురోజులుండి వెళ్లక అంటూసొంటూ లేకుండా కలిపేస్తున్నావా... అంటూ నాకు క్లాసు. కాదని అబద్ధం చెప్పాల్సివచ్చేది. ఉద్యోగం చేస్తున్న నన్ను పట్టుకుని మూడు రోజులూ బయటకూర్చోమనేది. మావారికి కోపం. తెలియకుండా వ్యవహరించాలంటే ఇల్లు చిన్నది. ఆ అవస్థ పడలేక అమ్మ ఎప్పుడు వెళ్లిపోతుందా అని ఎదురుచూసే దాన్ని.

ఒకసారి అమ్మ దగ్గరనుంచీ ఉత్తరం వచ్చింది. 'నువ్వు నెలనెలా బయట కూర్చో వడం లేదని ఇంట్లో కలిపేస్తున్నావనీ మీ వదిన చెప్పింది. నిజమేనా? నీ మంగళసూ త్రాలమీద ఒట్టేసి చెప్పు'. అన్నది ఆ లేఖ సారాంశం. కారణమేంటంటే వదినని ఆ మూడు రోజులూ సంగీతం క్లాసులు మాన




మంటే మాననందిట. సంగీతం నోట్సుకి బట్టతో బైండింగ్ ఉంది. దాన్ని కడిగితే పాడ వుతుంది కాబట్టి క్లాసులకెళ్లడం మానెయ్యమ న్నది అమ్మ వాదన. మీ అమ్మాయి ఉద్యోగా నికి వెళ్లడం లేదా... కావాలంటే కను క్కోండి... అన్నది వదిన సమాధానం. మా అమ్మాయి అలాంటి తప్పుడు పని చేయ దంటూ నాకు ఉత్తరం రాసింది అమ్మ. నేను ఆచారం పాటిస్తున్నట్లు తెలిస్తే చెవి తెగ్గోయిం చుకుంటానని విసిగిపోయి ఉందేమో వదిన సవాలు చేసిందట. అత్తాకోడళ్ల తగువులో

నేను ఇరుక్కున్నాను. అమ్మకు సమాధానం రాయలేదు. కొన్నాళ్ల పోతే వేడి తగ్గుతుంది లెమ్మని. కానీ నా బుర్రలో వేడి పెరిగిపోతూ ఉంది. ఎలాగైనా సమస్య పరిష్కరించాలని. ఎదుటివారిని గట్టిగా ఖండిస్తూ దబాయించి మాట్లాడలేను.. అది నా బలహీనత. అందు కని ఒక ఉపాయం కనిపెట్టాను. కథలో చెప్పడం. కనిపించని పాఠకులకు నా సమస్యలు చెప్పుకునేదాన్ని. కథలు అచ్చయ్యాక నన్నెవరూ నిలదీయలేదు. మా నాన్నగారైనా సరే. (నా మొదటికథ ఆయన నియంతృత్వ ధోరణి గురించే. ఆయనది చూశారు. కొంత మార్పూ వచ్చింది.)

అయితే చెప్పదలుచుకున్నదాన్ని సరదాగా చెప్పినట్లు రాస్తే సులభంగా మింగుడుపడుతుంది. ధైర్యం తెచ్చుకుని 'మూడునాళ్ల ముచ్చట' కథ రాసి వారపత్రిక్కి పంపించాను. వేస్తారో వేయరోనన్న అనుమానంతోనే. నెల్లాళ్ల తర్వాత అచ్చయింది.

కథ చదివి ఎవరో పాఠకుడు పత్రికాఫీసుకు ఉత్తరం రాశాడు- ఛాయాదేవిగారి కథ అని ఆత్రుతగా చదవబోయి... ఇలా రాశారేమిటని తెల్లబోయానంటూ. నవ్వుకున్నాను. మా అక్కయ్య వాళ్లు చదివి తిట్టుకున్నారట. కథ రాయడానికి ఇంతకన్నా మంచి విషయం దొరకలేదా... అన్నీ బట్టబయలు చేసుకోవాలా.. అని. మా అమ్మకి ఆ విషయం చేరే ఉంటుంది. మళ్లీ నన్ను నిలదీయలేదు. కొన్నాళ్లకు క్రమంగా మా బంధువుల ఇళ్లలో ఆచారాల పట్టింపు తగ్గుతూ వచ్చింది. అయినా ఇప్పటికీ ఆ మూడురోజులూ దేవుడున్న గదిలోకి, ఆ ఛాయల్లోకి వెళ్లకూడదన్న నియమాన్ని పాటిస్తూనే ఉన్నారు. దేవుడు కేవలం ఆ గదిలోనే ఉంటాడా... దేవుడే కదా ఇది సృష్టించిందీ... మూడురోజులుంటే సరిపోతుందా... కొనసాగింపు మాటేమిటి? మనం మామూలుగా ఉన్నప్పుడు అందరూ తగులుతుంటారు కదా... ఇలాంటి నా వాదనలేవీ నిలబడేవి కావు. అది కూడా జలుబులాంటిదేనని తేలిగ్గా తీసుకోరెందుకో. దాన్నొక అంటువ్యాధిలా చూస్తారెందుకో అర్థం కాదు. పరిశుభ్రత కోసం కాదు... విశ్రాంతి కోసం కాదు.. అదొక మూఢాచారం... అంతే.

దాదాపు దశాబ్దం తర్వాత నా కథ చదివి స్త్రీవాద రచయిత్రులు కొందరు ఆ రోజుల్లోనే ధైర్యం చేసి రాసినందుకు మెచ్చుకున్నారు. నిజమే, స్త్రీ స్వేచ్ఛకోసం పోరాటంలో అదీ ఒక భాగమే కదా అనిపించింది. ముఖ్యంగా ఆ సమస్య తీరిపోయాక నాకు శారీరకంగానూ, మానసికంగానూ, సామాజికంగానూ ఎంత స్వేచ్ఛగా అనిపించిందో చెప్పలేను. దాదాపు నాలుగు దశాబ్దాల బాధ. (ద్రౌపది ఏకవస్త్రగా ఉన్నానని గోలపెట్టినా ఆమెని రాజసభలోకి ఈడ్చి వివస్త్రను చేయడానికి ప్రయత్నించారు కౌరవవీరులు. తలచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది).

పూర్వం బయట కూర్చోవాలంటే సిగ్గుగా ఉండేది. బహిరంగంగా చర్చించడం ఇష్టం ఉండేది కాదు. ఇప్పుడు టీవీలో రోజూ పదే పదే ఆ వస్తువుల ప్రకటనల్ని చూస్తూంటే సిగ్గుతో తలవంచుకోవాల్సివస్తోంది. పిల్లలు వాటిని చూసి కుతూహలంతో అడుగుతుంటే సమాధానం చెప్పడం తల్లులకు కష్టమైపోతోంది. చిన్న పిల్లలకు కూడా జ్ఞానం పెరిగిపోయి తొమ్మిదేళ్లకే కొందరు ఆ బాధకి గురవుతున్నారు. ఇటువంటి రోజుల్లో కూడా ఇంకా దేవుడి పేరు చెప్పి ఆనాటి ఆచారాలను పాటిస్తూనే ఉన్నారు కొందరు. ఇన్నాళ్లూ అగ్రకులాల సమస్యగా ఉన్నా ఈ పూజల వంకతో అన్ని కులాలకూ పాకిందీ ఆచారం.

అందుకే నా 'మూడునాళ్ల ముచ్చట' కథ ఈ నాటికీ వర్తిస్తుందన్న ఉద్దేశంతోనే దాన్ని 2002లో వచ్చిన నా కొత్త సంకలనంలో చేర్చాను.

సేకరణ: - పద్మశ్రీ యలమంచిలి

★

# చతుర

## సత్తికొండ నవలా పరిచయం

ఉన్నత శిఖరాలధిరోహించాలనే ఉన్నతాశయంతో మధ్యతరగతి ఉద్యోగులు కొందరు శిక్షణార్థం ఓ కొత్త ఊరికి వచ్చారు. తెలంగాణ, రాయలసీమ, కోస్తా మూడు ప్రాంతాల నుండీ వచ్చినవారి మాండలిక పదజాలంతో తెలుగు నుడికారం అక్కడ గుబాళించింది. అయినవారిని వదిలి ఇంత దూరం వచ్చామన్న దిగులును, విద్యార్థి జీవితంలోని ఆనందం కొంత తొలగించగా వారికి కొండంత అండగా నిలిచి వెన్ను తట్టింది 'సత్తికొండ'. స్నేహాన్నీ, ఆత్మీయతనూ, అభిమానాన్నీ పంచిన సత్తికొండ తదనంతర కాలంలో ఓ తీపి జ్ఞాపకంగా మారిన వైనాన్ని వివరించిన **ఐతా చంద్రయ్య** నవల **'సత్తికొండ'** ఈ నెల 'చతుర' సమర్పణ.

---

### రచయిత పరిచయం

ఐతా చంద్రయ్య నవలలు, కథా సంపుటాలు, కవితా కావ్యాలు, రంగస్థల నాటికలు, అనువాదాలు లోగడ ప్రచురించారు. ఇతర భాషల్లోకి వీరి కథలు కొన్ని అనువదించబడ్డాయి. వివిధ సాహితీ పురస్కారాలు లభించాయి.




రచయిత చిరునామా:

ఐతా చంద్రయ్య

ఇం. నె. 4-4-11, శేర్‌పురా

సిద్దిపేట-502103

మెదక్ జిల్లా

బాల భాస్కరుని పసిడి కిరణాల కుంచెతో బంగారు పూతలు పూయించుకున్న తూరుపు ఆకాశం, మోజు తీరిందేమో అప్పుడే వెండి కోటింగు వేయించు కుంటోంది. 'అన్నీ బాగున్నాయి గాని అల్లుని నోట్లో శని ఉందన్నట్టు' పైలా పచ్చీసు ప్రాయంలో ఆశల ఆరాటంతో ఆశయాల పోరాటం కారణంగా ఆరోగ్యం నిక్షేపంలా గున్నా ఆకలి తీర్చేందుకు అన్నం సరిగా దొర కదు. అష్టకష్టాలనెదిరించి అంచెలంచెలుగా అష్టైశ్వర్యాలు సమకూర్చుకునేసరికి వయసు మీరిపోతుంది. ఆరోగ్యం అటకెక్కి కూచుం టుంది. అన్నం అరగనంటుంది. సుష్టుగా భోంచేస్తే సుస్తీ మంచమెక్కిస్తుంది.

పైవాడి లీలలను పరాకుగా నెమరేసు కుంటూ పూజాగదిలోంచి బయటకొస్తు న్నాను.

"తాతయ్యా! బూచాడొచ్చిండదో!" మూడేళ్ల ముద్దుల మనుమడు రామబాణంలా పరుగె త్తుకొచ్చి చేతులు చాచాడు.

అది భయమో, దొంగాటకమో అర్థం కాలేదు. మనసు పొరల్లో మలయమారుతం వీచింది. పై ఎత్తుకు ఆస్కారం లేదిహ. గబు క్కున ఎత్తుకున్నాను.

"బూచాడెవర్రా? " నున్నటి చెంపల్ని సన్నగా నిమురుతూ చూపులు గుమ్మంవైపు తిప్పాను.

గడపలో యువకుడు. కొత్త మనిషి. చామ నఛాయ. పెరిగిన గడ్డం. తుమ్మెద రెక్కల కింద మల్లెరేకుల్లా- తెల్లని చిరునవ్వు... నల్లని మీసంకట్టుకింద మెరుస్తోంది.

"నమస్కారమండీ! మీరూ!" ఆగిపోయాడు.

"నేను రిటైర్డ్ పోస్టల్ ఉద్యోగిని. వీడు నా మనవడు". నా దృక్కులు ఆగంతకుణ్ణి ఆపాద మస్తకం తడుముతున్నాయి. చంకలున్న మనవడు భయం భయంగా చూస్తున్నాడు.

"ఐతే కృష్ణమూర్తిగారు మీరేనన్నమాట!"

"అన్నమాటేంటీ! ఉన్నమాటనే బాబూ!"

"థాంక్స్. నా పేరు గూడా మీ పేరే. కాకి నాడ నుండి వచ్చాను. నాన్‌లోకల్ కోటాలో ఈ జిల్లాలో టీచర్ జాబ్ దొరికింది. పోస్టిం గేమో ఈ ఊళ్లోనేనండీ!"

అడుగు ముందుకెయ్యబోయి ఏదో గుర్తుకొ చ్చినట్టు ఆగిపోయాడు. నా చూపులు నిలబ డిపోయాయి.

కాలి అందియల శబ్దం కమ్మగా వినబడు తోంది.

"పాపం! ఆయనెవరో! అక్కడే నుంచు న్నారు మావయ్యా" నా ఒడిలోంచి తన కొడుకునందుకుంటూ కోడలు గుర్తుచేసింది.

కాకినాడ పేరు వినగానే మనసు తెరమీద గతం జ్ఞాపకాలు కదిలాయి. ఇంగితజ్ఞానం ఇర్రుకైపోయింది.

"అరెరే... లోపలికి రావయ్యా బాబూ! కూచో" కళ్లతో కుర్చీ చూపించాను. ఇతనెవ రబ్బా... ఏమో!

సూటుకేసందుకుని అటూ ఇటూ చూస్తూ వచ్చి కూచున్నాడు. నేనూ కూచున్నాను. ఇంత చిన్న వయసులో అంత గడ్డమెందుకో అనుకుంటూ తల్లి ఒడిలో ఉన్న మనవడితో "బూచాడు కాదు తాతయ్యా!" అన్నాను. వాని కేమర్థమైందో! కిసుక్కున నవ్వాడు. ఓరి భడవా!

"మా అమ్మ గిరిజ. అమ్మమ్మ సత్తికొండ, నాన్న పైడితల్లి" మా మనవడిని చూస్తూ యువకుడు నవ్వాడు.

"అట్లానా!" జ్ఞాపకాలు పూవుమీది తేనెటీగ రెక్కల్లా ఝుమ్మన్నాయి. మతిమరుపు పొరల్ని చీల్చిపారేస్తున్నాయి.

"ఓహో.. నువ్వు సత్తికొండ మనవడివా!"

"అవునండీ. నమస్కారం" వినయంగా చేతులు జోడించాడు. "మీరీ మధ్య ఉత్తరాలు రాయడం లేదని అమ్మ గుర్తుచేసిందండీ" సూటిగా చూస్తున్నాడు.

నిజమే. ఉద్యోగ ప్రయాణంలో చివరి మజిలీ ఖాళీ చేస్తుంటే వ్యాపకాలు జ్ఞాపకా లను కప్పేశాయి.

"అవును బాబూ! మీ అమ్మమ్మ మరణవా

ర్తను మీ అమ్మ నాకు ఆలస్యంగా అందించింది. ద్వాదశదినకర్మ ముగిశాక మాత్రమే నేను గుర్తుకొచ్చానన్నమాట" ఎద పొద అల జడి బలం పుంజుకుంది.

"ఆయ్! కాని... అమ్మ ఎప్పుడూ మిమ్మల్ని గుర్తుచేస్తూ మీ గురించి చాలా చెబుతుందండీ" వాలకం గంభీరమైంది. "నాన్నగారు పోయాక అమ్మ మనసు మన సులో లేదండీ" గొంతు మెత్తబడింది.

అలజడి అల్లకల్లోలంగా మారింది. అల్లక ల్లోలం మధ్యన సత్తికొండ, పైడితల్లి రూపాలు ప్రత్యక్షమైనాయి. సత్తికొండ విరగబడి నవ్వు తోంది. పైడితల్లి చేతులు కట్టుకునుంచు న్నాడు. గుండె పీచుపీచుమంది.

"అయ్యో పాపం! పైడితల్లి చనిపోయాడా! ఎప్పుడు?"

"ఆయ్. తుపాను ప్రమాదమప్పుడండీ"

అమాయకత్వానికి ఆనవాలు గిరిజ. ఆమె భర్త పైడితల్లి గూడా పైలోకాలకెళ్లాడంటే ఎలా తట్టుకుందో.? పాపం! ఎంత కష్టమొచ్చిందీ!

"మీ అమ్మ అదే గిరిజ ఎలాగుంది బాబూ?"

"ఫరవాలేదండీ!" అతని చూపులు సీలింగు ఫ్యాను మీదున్నాయి. "అమ్మమ్మను తలుచుకుంటూ, నాన్న ఫోటోకు పూజ చేస్తూ రోజూ బాధపడ్తుందండీ" నిట్టూర్చాడు.

అరెరే! ఎంత ఘోరం జరిగిపోయింది! ప్చ్ భగవంతుడా! ఏమిటయ్యా నీ లీల! ప్రాణం పోసిన నీకు ప్రాణం తీసుకునే హక్కు ఉంది. అలాగని మనుషులను ఆటబొమ్మలుగా మార్చి ఆడించడమే నీకు సరదానా! రెండు నిముషాల మౌనం గుండెలతో గుసగుసలాడింది. జగమేమాయ... బ్రతుకేమాయ...

"మీ ఇంట్లో గది అద్దెకూ" సిగ్గుపడుతు న్నాడు.

"తప్పకుండా బాబూ! మా గిరిజ కొడుకు నా ఇంట్లో కాక ఇంకెక్కడుంటాడు. ఆం నీకు పెళ్లయిందా?"

"కాలేదండీ! అమ్మను తీసుకువచ్చేస్తానండీ"

వెరీగుడ్! మళ్లీ గిరిజను చూడొచ్చు మనసు విప్పి మాట్లాడుకోవచ్చు కులాసాగా ఉండొచ్చు

గ్రాట్యుటీ డబ్బులతో కట్టించిన మేడమీది గది అతనికి కేటాయిస్తే సరి. వాళ్లమ్మతో కాలక్షేపం.

"నాన్నా!" చాయి గ్లాసులతో వచ్చిన రెండో కూతురు శైలజ చెరో గ్లాసు అందించింది. పరిచయాలు, నమస్కారాలు పూర్తయ్యాక "మేడమీది గది ఈ కృష్ణమూర్తికి చూపించమ్మా" పురమాయించాను. "సరేనాన్నా" అంది ముభావంగా.

పెద్దకూతురు పెళ్లి చేసుకుని అత్తారింట్లో హాయిగా ఉంది. పండగలకు కుటుంబ సమేతంగా వచ్చిపోతుంది.

ఒకరినొకరు ముభావంగా చూసుకుంటూ పైకెళ్లిన వారిద్దరూ ముసిముసి నవ్వులతో దిగివచ్చారు. హుషారుగా మాట్లాడుకుంటు న్నారు. మనోభావాల మార్పిడితో మనసులకు సాన్నిహిత్యమేర్పడుతుంది గదా! విపరీతంగా పెరిగిన కట్నాల మార్కెట్ నా గారాల కూతురు శైలజ పెళ్లికి ఆటంకమైపోయింది. రిటైర్మెంట్స్ బెనిఫిట్స్‌లోంచి లక్షణంగా ఓ లక్ష శైలజ పెళ్లికోసం కేటాయించాలనుకు న్నాను. కాని లక్ష ఉంటే లక్ష్యంగా లేని రోజు లొచ్చాయని తెలిసి మేడ గదికే ప్రాధాన్యత ఇచ్చాను. డిగ్రీ పాసైనా మూడు ముళ్లకు నోచుకోని కూతురు పరిస్థితి అప్పుడప్పుడు కల వరపెడుతోంది. ఆలోచనాలోచనాలను నలు దిక్కులా తిప్పేస్తుంది.

"గది నాకు బాగా నచ్చిందండీ!" శైలజనే చూస్తున్నాడు.

అవాక్కయ్యాను. అతన్నే చూస్తున్నాను.

"ఆయనకు బాగా నచ్చిందట నాన్నా" శైలజ మొహం విచ్చుకుంది. అంత ఆనందం చాలా రోజుల తర్వాత కనబడింది.

"అయితే ఇంకేం నీదే ఆలస్యం బాబూ"



"ఈ రోజు డ్యూటీలో జాయినైపోతాను" అతనింకా పూర్తిచేయలేదు శైలజ అందు కుంది.

"ఎల్లుండి సెకండ్ సాటర్‌డే కాబట్టి రేపు బస్సెక్కుతారటా. సోమవారం ఉదయానికల్లా వాళ్లమ్మతో సహా ఇక్కడుంటారటా" గడగడా చెప్పేస్తోంది.

ఈ వాగుడుపిట్ట తన సహజ గుణాన్ని బయట పెట్టుకుందే. దీనికెవరి గుణమొచ్చిం దబ్బా!

"సెంట్ పర్సెంట్ కరెక్ట్" అంటూంటే అల సిపోయాడనుకున్న అతని కళ్లల్లో కాంతిపుం జము పురివిప్పింది. చూపులు శైలజనే... తడుముతున్నాయి.

"శైలా! ఈ రోజు, రేపు మనింట్లోనే ఇతని భోజనం".

"సరే నాన్నా. వదినకు చెప్తా"నని లోపలికి తుర్రుమంది. "వదినా చుట్టాలొచ్చారు వదినా"

"సార్ అమ్మగారు లోపలున్నారా? " అడి గాడు వినయంగా.

"అంటే నా భార్యనా? "

"అయ్. ఓ నమస్కారం పెట్టుకుంటాను"

"మా అబ్బాయి జహీరాబాదులో టీచర్‌గా పనిజేశాడు. ఈమధ్యనే ఇక్కడికి ట్రాన్స్‌ఫర యాడు. అక్కడి అద్దె గది ఖాళీచేసి లగేజి తీసుకొచ్చేందుకు వాడూ, ఆవిడా వెళ్లారయ్యా"

అతని కళ్లు దేనికోసమో వెతుకుతున్నాయి. సూటుకేసందుకుని "నేనెళ్తానండీ" అంటూ కదిలాడు. గెడ్డం తడుముకుంటూ "ఉద్యోగం దొరికేదాకా గెడ్డం తియ్యనని సత్యనారాయణ స్వామికి మొక్కుకున్నానండీ" మెట్లు ఎక్కుతు న్నాడు.

మనిషి మనుగడను మనీ శాసిస్తున్నంతకా లము ఉద్యోగం కోసం ఉన్న ఊరినీ, కన్నవా రినీ వదలి తిరగడం ఎవ్వరికైనా తప్పదు. నిట్టూర్పు తోసుకొచ్చింది.

పాతికేళ్ల క్రితం నా మనసనే బృందావన ములో రంగుల పూలు పూయించి, మరపు రాని అనుభవాలను రుచి చూపిస్తున్న కాల మది. కోయిల పాటలా జలపాతం సవ్వ డిలా కాకినాడ జీవితం!

★ ★ ★

అపజయాలను ఆత్మవిశ్వాసంతో ఎదిరిస్తూ ఉన్నత శిఖరాన్నధిరోహించాలనే ఉన్నతాశ యంతో ఉద్యోగ పథములో పయనిస్తున్న రోజులవి. బతుకు పుస్తకములో నూతనా ధ్యాయం మొదలైపోతుందని అప్పుడనిపించ లేదు. ఊహించలేదుగూడా.

ఆఫీసులో ఆ రోజు... సంయమనం ఆస రాతో సేవింగ్స్ బాంకు కౌంటర్లో పనిచేస్తు న్నాను. ఏకాగ్రత సడలిపోతే ఏకంగా జేబు నుండి డబ్బులు వేయాల్సి వస్తుంది. అందుకే సీనియర్స్ అంటుంటారు- దురదృష్టం గుఱ్ఱా న్నావహిస్తే టాంగా లాగిస్తుంది, నిరుద్యోగి నావహిస్తే పోస్టల్ ఉద్యోగానికి లాక్కెళ్తుంది అని.

"కంగ్రాట్స్ మూర్తీ!" నవ్వుతూ నావద్దకొచ్చి ఆర్డర్ కాగితం చేతికందించాడు. ఆర్డర్ సారాంశం- టెలిగ్రాఫ్ ట్రైనింగ్‌కు మా డివిజన్ నుండి నేనొక్కడినే ఎంపికయ్యాను. ఆర్నెల్ల ట్రైనింగ్ కోసం కాకినాడకెళ్లాలి. ఆర్నెల్ల తర్వాత మరో మూన్నెళ్ల ప్రాక్టికల్ ట్రయి నింగ్... ఆ తర్వాత అడ్వాన్స్ ఇంక్రిమెంటు. అంతేకాదు టెలిగ్రాఫ్ లేట్‌ఫీ డ్యూటీలో ఇన్సెం టివ్ అదనము. పది రూపాయల ఆదాయం పెరిగితే పండగ చేసుకునే ఉద్యోగికి ఇంత కంటే మంచి వార్త ఇంకేముంటుంది?

"థ్యాంక్యూ సర్" అంటూంటే మానసవీణ తియ్యని రాగం పలికింది. లోపలి నుండి ఎగదన్నుకొస్తున్న ఆనందాన్ని గొంతులో అది మిపెట్టి కోవర్కర్స్ అభినందనలందుకు న్నాను. అప్పటికప్పుడే టీ తెప్పించి శాంతి కార్యక్రమం జరిపించాను.

సోమరిగా ఉండకండి. ఉపయోగకరమైన పనులను చేయలేనపుడు మన సును మంచి పనులను చేయడం వైపు మళ్లించండి. – ఫ్రాన్సిస్ థాంప్సన్

సాయంత్రం ఇంటివద్ద సంతోషాల విరి జల్లు కురిసింది. శుభవార్త విని శ్రీమతి పొంగిపోయింది. అయిదేళ్ల కొడుకును ముద్దాడుతుంటే కళ్లు మొగిలిరేకుల్లా విచ్చుకున్నాయి.

"ఒరేయ్ నానీ! మీనాన్న టెలిగ్రాఫ్ మాస్టారు కాబోతున్నాడురా" గొప్పగా చెప్పేసింది. పాపం! పసివాడు వాళ్లమ్మనూ, నన్ను మార్చిమార్చి చూసి నవ్వాడు. మర్నాడు మా నాన్నకు కబురెళ్లింది. సాయంత్రం టి.ఎ. అడ్వాన్సు పుచ్చుకుని రిలీవైపోయాను. మళ్లీ ఈ ఆఫీసుకొస్తే... టెలిగ్రాఫ్ మాస్టారుగానే! ఎదలో గిలిగింత. మిత్రుల అభినందన మందారమాలతోపాటు పోస్టల్ రిక్రియేషన్ క్లబ్ తరపున యస్కేసి (స్వీటు, కారా, కాఫీ)తో సెండాఫ్ పార్టీ జరిగింది. మనసు ఆనంద డోలికలూగింది.

ఇంటికెళ్లేసరికి నాన్న రెడీ. ముగ్గురమూ ముచ్చట్లాడుతూ సామానులు ప్యాక్ చేశాము. అర్ధాంగినీ, ఆత్మీయ పుత్రుడినీ నాన్నవెంట మా ఊరు పంపించి బరువెక్కిన గుండెతో హైదరాబాద్ బస్సెక్కాను. బస్సు ముందుకు పరుగెడుతూంటే బుర్రలో ఏవేవో ఆలోచనలు, ఊహలు ఊరేగుతున్నాయి.

అభివృద్ధికి అల్లంతదూరములో నుంచున్న మెదకు జిల్లా మారుమూల పల్లెటూళ్లో కళ్లు తెరిచాను. పదిమందితో ఆడుతూ పాడుతూ పట్టణం ఒడిలో పాఠాలు చదువుతూ ఉద్యోగము సాధించాను. అప్పులకుప్పల ఆనవాళ్లు లేకుండా చేసి పెళ్లి చేసుకున్నాను. సొంత ఇల్లు లేకున్నా ఇల్లాలితో భేష్ అన్పించుకున్నాను. ఇహ ట్రెయినింగ్‌లో కష్టపడి విజయం సాధించాలి. చేతినిండా జీతముతో పూలబాటలో పయనించాలి. కాకినాడ ఎక్కడుంది? ఐదొందల కిలోమీటర్ల అవతల. చాలా దూరం కాని దూరాన్ని కాలం లొంగదీసుకుంటుంది. కాలాన్ని డబ్బు లొంగదీసుకుంటుంది. మరి మనిషో! ఆశలు రెక్కలు విప్పుకుని ఆకాశానికెగిరాయి.

ఏది ఏమైనా... జీవన పోరాటములో ఆశల ఆరాటం ప్రతి మనిషికీ సహజమే. ఆశలన్నింటినీ కాకున్నా కొన్నింటినైనా తీర్చుకునే సదవకాశం లభించింది. కానీ... కాకినాడలో ఆరు నెలలు గడపాలి. ఎలా గడుస్తుందో ఏమో! ట్రెయినింగ్ సెంటర్లో క్లాసులు చాలా స్ట్రిక్ట్ అని తెలిసింది. ఫ్రీ గది ఎక్కడ దొరుకుతుందో... ఎలాంటి గది దొరుకుతుందో తిండీ తిప్పలెలాగో! ఒకవేళ గది దొరక్కపోతే! అయ్యబాబోయ్! అన్ని రోజులు లాడ్జింగ్ అంటే మాటలా. డబ్బుల మూటలు కావాలి. ఆ ప్రాంతము నుండి ఉద్యోగరీత్యా వచ్చిన కోవర్కర్స్ కాకినాడ గురించి చెప్పిన మాటలు.

"ఎక్కడున్నా ఫరవాలేదుగాని బుడంపేటలో మాత్రం కాలుబెట్టకు" అన్నాడు రాజమండ్రి మిత్రుడు.

"ఎందుకటా!" అడిగాను.

"అక్కడ అంగడిబొమ్మలుంటాయండీ. చీకటిపడగానే అరుగులమీద నుంచుంటాయి. జీరో బల్బు వెలుతుర్లో పైట జార్చి కన్నుగీటుతాయి."

మనసు మందుపాతరలా తయారైంది. ఎన్నో సంశయాలు, సందేహాలు... ఏది ఏమైనా కాకినాడ వెళ్లక తప్పదు. గుండె రాయి చేసుకుని హైదరాబాద్‌లో దిగాను. రాత్రికి కాకినాడ బస్సెక్కి దర్జాగా కూచున్నాను.

ఎవరిని పలుకరిస్తే ఏమంటారో! జనాలతో బస్సు కిటకిటలాడ్తోంది. నేనుమాత్రం జనారణ్యంలో ఒంటరి తపస్విని. నిద్ర ఆవహించింది కానీ కలత నిద్ర. అబ్బో కాకినాడ సిటీయే. అటు కడలికెరటాలు, ఇటు జనసందోహం. తారురోడ్డుమీద రిక్షాలు, టాంగాలు, కారు, ద్విచక్ర వాహనాలు అదేపనిగా పరుగెడుతున్నాయి.

ఉదయం తొమ్మిదింటికి ఆవులిస్తూ బస్సు దిగాను. ఆరాటాన్ని అణచుకుని రిక్షా ఎక్కాను. అటూ, ఇటూ ఆబగా చూస్తున్నాను. మనిషి ఆశల్లాగా రోడ్లు విశాలంగా

ఉన్నాయి. వెడల్పాటి రోడ్డు మీదుగా పయ నించి మలుపు తిరిగింది రిక్షా. బ్రిడ్జి దాటు తోంది. అటూఇటూ చూస్తున్నాను.

అమ్మో వాసన! దుర్వాసన. చేపలకంపు ముక్కుపుటాలనదరగొడుతోంది. ఎడమవైపు తీరని కోరికల్లా పెరిగిపోయిన ఆకాశహ ర్మ్యాలు. కుడివైపు కాలువ. ఒడ్డున ఆరబో సిన చేపలు. ధాన్యం ఎండబోసిన కల్లము లాగుంది.

"ఇదేమిటబ్బా! ఇంత దుర్వాసనా? " ముక్కు మూసుకున్నాను. వాంతి వచ్చేస్తుం దేమో... వికారంగా ఉంది.

"అయ్. సముద్రపు ఒడ్డుగదండీ." రిక్షా వాలా యాస గమ్మత్తుగా ఉంది. "ఇదో ఈ కాలువ గుండా వెళ్లి గోదావరి సముద్రంలో కలుస్తుందండీ".

"మరీ ఈ చేపల కంపో!"

"అదాండీ!" అదోలా నవ్వేశాడు. "అది చేపల యాపారమండి. మా జోరుగుంట దండీ. కష్టజీవులు రోజంతా నాటుపడవల మీద యాటకెల్తారండి. సముద్రాన్ని గాలించి చేపలు పట్టుకొచ్చి ఒడ్డున ఆరబోస్తారు. వాటిని దళారీలు కొని ఎండబెడ్తారండి. ఎండిన చాపల్ని ప్యాక్ చేసి అమ్మకానికి ఎక్క డెక్కడికో పంపిత్తారండి". రిక్షావాలా చెమట బిందువుల్లో నిజాయితీ మెరిసింది.

మాటల్లోనే వచ్చేసింది- సర్కిల్ టెలిగ్రాఫ్ ట్రైనింగ్ సెంటర్. కంపు వాసనలు ముక్కును ముక్కలు చేస్తూనే ఉన్నాయి. ట్రైనింగ్ సెంటర్ లోపలికెళ్తుంటే అండర్‌గ్రౌండ్ డ్రైనే జీలో నడుస్తున్నట్టుంది. గుండె లబ్‌డ బ్‌లు... గడియారం లోలకంలా కొట్టుకుం టోంది.

నాలాంటి వాళ్లు చాలామంది ఉన్నారు. అందరితోపాటు జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చేశా ను. లగేజితో సహా క్లాసులో ప్రవేశించాను. అన్ని జిల్లాల నుండి వచ్చినవాళ్లము. అన్ని ప్రాంతాల తెలుగుభాష వినబడుతోంది. పొట్టకూటికోసం పలు ప్రాంతాల నుండి వచ్చాము. అందరిలాగే నేనుగూడా లగేజి క్లాసులో ఉంచి కాలకృత్యాలు, స్నానాదులు ముగించుకున్నాను. కాంటీన్లో టిఫిన్ చేస్తున్నాం.

ఒకరికొకరం పరిచయమవుతున్నాం. వాళ్లు కూడా నాలాగే ఫీలవుతున్నారేమో- మొహాల మీద కళలేదు.

వెనకనుండి నాభుజమ్మీదొచెయ్యి పడింది.

"హలో సిద్ధయ్యా! బాగున్నావా!" షేక్ హాండ్ కోసం చెయ్యి ముందుకొచ్చింది. జ్ఞాన చక్షువులను పూర్తిగా తెరిచి జ్ఞాపకాల పొరల్లో వెతికాను. ఈ శాల్తీ నెక్కడా చూసినట్టు లేదు. ఒకరినొకరం తేరిపార చూసుకున్నాం.

"సారీసర్! మా ఫ్రెండు సిద్ధయ్య అనుకు న్నాను" అనేసి నా పక్కనున్నాయన చెయ్యం దుకున్నాడు. "హలో సిద్ధయ్యా! నువ్వూ ఈ సారు ఒకేలాగున్నారు సుమా" నావైపు చూపిస్తూ నవ్వేశాడు. వాళ్లు కాస్సేపు మాట్లా డుకున్నారు.

"మీ పేరేందిసార్? " సిద్ధయ్య నావైపు తిరి గాడు.

"కృష్ణమూర్తి ఫ్రం మెదక్ డివిజన్!" నవ్వా లని ప్రయత్నించాను.

"చాలా సంతోషం. నా పేరు సిద్ధయ్య. ఫ్రం నల్లగొండ జిల్లా. మా ఊరు మిర్యాల గూడ". ఊహించని ఆప్యాయత కరచాలనం చేయించింది. మనసులో ఉత్సాహం మొగ్గతొ డిగింది. ధైర్యమొచ్చింది.

"వెరీనైస్" నా పూర్తి అడ్రసు చెప్పేశాను. అనుకోకుండా అతని భుజమ్మీద నా చెయ్యి పడింది. అతని చిరునవ్వు ఆమోదం తెలి పింది. మరింత ధైర్యమొచ్చింది.

కలుపుగోలుతనములో సిద్ధయ్య సిద్ధహ స్తుడు. క్లాసులో ఇద్దరం పక్కపక్కన కూచున్నాం. ఇన్‌స్ట్రక్టర్ క్లాసులోకి రాగానే మర్యాదగా లేచినుంచున్నాము. పరిచయ కార్యక్రమం ప్రారంభమైంది. పాతగూడు విడిచి కొత్తగూటికోసం వెతుకులాడుతున్న పక్షిరెక్కల చప్పుళ్లు మా గొంతుల్లో వినిపిస్తు

న్నాయి.

"వెరీగుడ్ ఫ్రెండ్స్!" ఇన్‌స్ట్రక్టర్ అందుకున్నాడు. "మీకందరికీ స్వాగతం. ట్రైనింగ్ క్లాసంటే కాలేజి క్లాసు రూము కాదు. మీరంతా గవర్నమెంట్ సర్వెంట్స్. ఇది జాబ్ ఓరియెంటెడ్ ట్రైనింగ్. ఇక్కడ బెదిరింపులు, అదిరింపులు కుదరవు. డిసిప్లిన్ చాలా ముఖ్యం. డిసిప్లిన్‌కు దూరమవుతే డిసిప్లినరీ ఆక్షన్ దగ్గరవుతుంది.

ట్రైనింగ్ క్లాసు ఉదయం ఏడింటికి ఠంచన్‌గా ప్రారంభమవుతుంది. మధ్యాహ్నం ఒంటిగంట వరకుంటుంది. పదింటికి అరగంట ఇంటర్వెల్. క్యాంటీన్‌కెళ్లాలన్నా, రెస్టు తీసుకోవాలన్నా అదే సమయం. ఈరోజు శనివారం గదా. మధ్యాహ్నం నుండి అద్దెగదుల వేట ప్రారంభించండి లేదా లాడ్జింగుల్లో అడ్జెస్టవండి." రోటీన్ సూచనలతో ఉపన్యాసం గంభీరంగా సాగిపోయింది.

ఇలాంటి బ్యాచులనెన్నో చూసి ఉంటాడాయన. మాలాంటి బచ్చాగాళ్లు ఆయన ముందర ఎందరో! ఆరునెలల పాటు ఆయన మా గురువు. సాంకేతిక విద్య నేర్పి సాగనంపుతాడు.

ట్రైనింగ్ కాలంలో ఏయే పీరియడ్స్‌లో ఏమేం చెబుతారో, నెలవారీ పరీక్షలెలా ఉంటాయో వివరణ సాగింది.

ఆ రోజుకు క్లాసు ఐపోయింది. ఊపిరి పీల్చుకున్నాం.

ఎక్కడెక్కడినుండో ఎగిరొచ్చిన వారు గుంపులుగా మారి వెళ్తున్నారు. అంతా వెళ్లిపోయారు. మిగిలిన కొద్దిమందిలో నేనూ సిద్ధయ్యా ఉన్నాం. ఎరగని ఊళ్లో మొరగని కుక్కల్లా మొహాలు చూసుకున్నాం. మా పక్కన ఆనందం, ఆదిలాబాదు నుండి వచ్చాడు. సన్నగా పొడుగ్గా ఉన్నాడు. "గీ గలీజు వాసనతోని ఆర్నెల్లు గడిపితే మనం పర్మినెంట్ పేషెంట్లమైపోతామేమో!" అనేశాడు.

"గిట్లైతే ఇంగమనం బతికి బట్టగట్టినట్టే" నల్లగా బలిష్ఠంగా ఉన్న గట్టయ్య ముక్కుమూసుకున్నాడు. ఆయన వరంగల్ నివాసి.

"పర్లేదండీ. 'తినగతినగవేము తియ్యనుండు' అన్నారుగదా. ఈ దుర్వాసనే కొద్దిరోజుల తర్వాత సువాసనైపోతుంది. మనం అలవాటు పడిపోతాం బ్రదర్!" సత్యనారాయణ సన్నగా నవ్వాడు. ఆయన విశాఖ జిల్లా అనకాపల్లి నుండొచ్చాడు.

"నిజమే. చూడగా చూడగా గబ్బువాసన సబ్బు వాసన కావచ్చు" కరీంనగర్ రాజయ్యకు ధైర్యమొచ్చినట్టుంది. జోకు పేలలేదు. అయినా పేలవంగా నవ్వాం. "ఇప్పుడేం జేద్దాం? ఎటు పోదాం? " ఆయనే అడిగాడు మావైపు చూస్తూ.

"చె..చె.. చెప్పండ్రి. మిగిలింది మనమే" నిజామాబాదు కాశీనాథ్ బెరుకుదనమింకా తగ్గలేదు. "రూం... రూములకోసం గల్లీలల్ల తిరుగుదామా!"

"తప్పదు గదా!" నేను స్పందించాను. "కూడు, గుడ్డ, గూడులో గుడ్డలు వెంట తెచ్చుకున్నాం. కూడు హోటల్లో తినొచ్చు గూడు కోసం తిరగక తప్పదు".

"మరి గీ లగేజి ఎట్లా? నెత్తిమీద పెట్టుకొని తిరుగుతమా? " సిద్ధయ్య గుర్తుజేశాడు. "అట్ల దిరుగుతుంటే మనల్ని హమాలీలో, కూలీలో అనుకుంటరంతో"

అందరం హాయిగా నవ్వేశాం.

నవ్వు మనిషికి మాత్రమే దేవుడిచ్చిన వరం. అది ఎన్నో రుగ్మతలకు మందు. బలహీనుని చైతన్యకేతనం.

చౌకీదారు చేతిలో పదిరూపాయల కాగితముంచి సామానులు చూస్తుండుమని చెప్పి బయటపడ్డాం.

ఆకలికేకలు అందరినీ కలవరపెడుతున్నాయి. ముందు హోటల్ సిద్ధార్థలో

అభిప్రాయభేదం అన్నది ద్వేషానికి దారి తీయకూడదు. – బెర్నార్డ్‌షా

సుష్టుగా భోంచేసి ఆత్మారాముణ్ని శాంతపరిచాం. ఆ తర్వాత గుంపుగా బయలుదేరి గృహాన్వేషణకు శ్రీకారం చుట్టాం.

కాకినాడ పోర్టు నుండి కొండాయ పాలెం దాకా ఎన్నో గల్లీలు సర్వే చేశాం. వినయవిధేయతలను, సంతోష రేఖలను ముఖాల కతికించుకుని ఎవ రెవరినో అడిగాం. ఒక్క గదిగూడా దొరకలేదు. వెతికి వెతికివేసారి బ్యాక్ టుది పెవిలియన్ అనుకుంటూ ట్రెయినింగ్ సెంటర్ చేరుకున్నాం.

చౌకీదారు డ్యూటీ మారిపోయింది. నైట్ వాచ్‌మెన్ ముందు- కొత్తగా దొంగతనంచేసి పట్టుబడిన దోషుల్లా నుంచున్నాం. అతడు మమ్మల్ని ఎగా దిగా చూసి

"రిచ్చాలొచ్చాయాండీ? " అధికారిలా అడిగాడు.

"ఎందుకూ? " ఆనందమడిగాడు.

"మీరు లగేజీ తీసుకెళ్లాలి గదండీ"

కాళ్లకిందినేల కదిలిపోతున్నట్లు భయం భయంగా మొహాలు చూసుకున్నాం. ఏం జవాబివ్వాలి? ఈ సముద్రపు టొడ్డున ఎటు పరుగెత్తాలి? లాడ్జింగ్‌లో ఉంటే వామ్మో!

ముప్పై రోజుల డబ్బులు మూడు రోజుల్లో ఖర్చైపోవడం ఖాయం.

"ఏంటండీ! అలా మొహాలు చూసుకుం టారేంటీ? బేగెళ్లి రిచ్చాలు తీసుకురండీ!!" రిమైండర్. నైట్ వాచ్‌మెన్ ముందు మేము నాటు మనుషులమైనాం. నీళ్లు నములు తున్నాం.

అనువుగాని చోట అధికులమనరాదు... గుర్తుకొచ్చింది.

"అయ్యా బాబోయ్! లాడ్జింగే శరణ్యమా? " నా చెవిలో అడిగాడు సత్యనారాయణ. "ఏదన్నా ఉపాయమాలోచించండి"

"ఏం చేద్దాం? "కళ్లతో అడిగాను సిద్ధ య్యను.

"చూడు వాచ్‌మెన్ బాబూ!" భుజాలెగ రేసి గొంతు సవరించుకున్నాడు సిద్ధయ్య. "మాకింకా రూము దొరకలేదు బ్రదర్. ఈ రాత్రికిక్కడే ఉండాలనుకున్నాం. విధి లేదు..."

"అయ బాబోయ్!" వాచ్‌మెన్ గుండెలు బాదుకున్నాడు.

"ప్రిన్స్‌పాల్ గారు చూశారంటే నా ఉజ్జోగం హూష్కాకైపోతుందండి. సూట్ కేసులు తొరగా తీసుకెళ్లండి బాబూ..." శివతాండవం చెయ్యబోయాడు.

"అది కాదు సోదరా!" సముదాయింపు వినా మరో మార్గం కానరాలేదు. రాత్ర యింది. లాడ్జింగుల్లో రూములు దొరకవు. భార్యాపిల్లల్ని, సొంత బంగళాలను వదిలి చాలా దూరం నుండి వచ్చాం. మనలాంటి



**నాకో పావురం కావాలి**

శ్రీశ్రీ ఓసారి బార్‌కు వెళ్లి "నాకో పావురం కావాలి? " అని అడిగారు.

అక్కడి వెయిటర్ తెల్లబోయాడు.

సర్.. పావురాలు ఇక్కడెందుకు ఉంటాయి? అన్నాడు వినయంగా.

"అబ్బే నువ్వనుకునే పావురం కాదయ్యా.. నాకు పావు రమ్ కావాలి" అన్నారు కొంటెగా. వెయిటర్ ఎలా నవ్వుకుని ఉంటాడో వేరే చెప్పాలా?

చిరుద్యోగులకిలాంటి అవస్థలు తప్పవు గదా! నీకు తెలియనిదేముంది? ఈ ఒక్క రాత్రి ఆశ్రయమిచ్చి పుణ్యం కట్టుకో. రేపాదివారమే గదా. ఊరంతా తిరిగి అద్దెగదులు సంపాదించుకుంటాం. మా కోసం కొంచెం రిస్క్ తీసుకో. నీ కష్టం మేము ఉంచుకోం"

"అంటే..." బుర్ర గోక్కున్నాడు. నిప్పుల మీది కోతిలాగున్నవాడు చప్పున చల్లారిపోయాడు. కళ్లల్లో ఆశారేఖలు తచ్చాడుతున్నాయి.

"తలా ఓ పది రూపాయలిస్తాం. తలదాచుకోనివ్వు" సిద్దయ్య కుండబద్దలు కొట్టేశాడు.

"పిల్లా జెల్లా ఉన్నవాళ్లకీ మాత్రం పైఆదాయం లేకపోతే బతుకుదెరువు కష్టం గదా!" మెట్టయ్య ద్వారా మరో అస్త్రం.

వాచ్‌మెన్ నోరు తెరవలేదు గానీ చెయ్యి ముందుకొచ్చి పిడికిలి విచ్చుకుంది. అరచెయ్యి ఆకాశాన్ని చూస్తోంది. దక్షిణ సమర్పించుకుని దర్జాగా భోంచేసి వచ్చాం. డ్రెస్సులు మార్చుకుని బెంచీలనాశ్రయించాం.





భారత స్వాతంత్ర్య సమరములో అష్టకష్టాలనుభవించిన సమరయోధులు "చెరసాలలు మా పాలిట చంద్రశాలలౌతాయి కటిక నేల మా పాలిట పూలపాన్పు అవుతుంది" అనుకుంటూ దేశ సౌభాగ్యం కోసం ఉరికొయ్యలకు ఉయ్యాలలూగిన వైనం మనసులో మెదిలింది. మనోధైర్యం బలం పుంజుకుంది.

సిద్దయ్య నా పక్క బెంచీ మీద పడుకున్నాడు.

నా భార్య, కొడుకు ఏం చేస్తున్నారో! అమ్మా నాన్నలెట్లా ఫీలవుతున్నారో! ఆరు నెలల అజ్ఞాతవాసమెట్లా గడుస్తుందో! రేపు గది దొరుకుతుందో లేదో! దొరక్కపోతే!?

అందరి బుర్రల్లో ఇవే ఆలోచనలు గిర్రుమంటున్నాయేమో పావుగంట మౌనం రాజ్యమేలింది. మౌనాన్ని చీల్చిపారేస్తూ

"అరె నీయవ్వ! ఇంటి కాడ పరుపుల హాయిగ పడుకొంటి. ఇప్పుడీ బెంచీ గతైపోయింది" ఆదిలాబాదు ఆనందం దోమల్ని వేటాడుతూ పెదాలు చప్పరించాడు.

"కాల మహిమ" నిజామాబాదు కాశీనాథ్ పడుకునే దోమల్ని వేటాడే ప్రక్రియలో చప్పట్లు చరుస్తున్నాడు. 'శ్రీకృష్ణుని కన్నతండ్రి వసుదేవుడంతటివాడే గాడిద కాళ్లు పట్టుకున్నాడట. ప్చ్.. వాచ్‌మెన్ అప్పారావు ముందు తల వంచాల్సి వచ్చింది"

ఎవరెంత వేటాడినా లాభంలేదు. దోమల సంగీతం, రక్త సేకరణ కార్యక్రమం సాగిపోతూనే ఉంది.

"ఏదోలెండి. ఆ రోజుల్లో పంచ పాండవులు అజ్ఞాత వాసంలో అష్టకష్టాలనుభవించలేదా. ఇప్పుడు మనమూ అలాగే అనుకుందాం. ఈ రాత్రి గడిచిందంటే రేపు మన రూములో మనముంటాము" అనకాపల్లి సత్యనారాయణ ఆవులిస్తూ మాట్లాడుతున్నాడు. అదృష్టమే... నిద్ర వస్తున్నట్టుంది.

ఏవేవో కబుర్లు. దేశ రాజకీయాలు, ట్రైనింగ్ కాలంలో ఎదురయ్యే ఇబ్బందులు, ఆ తర్వాత లాభాలు చర్చలో అందరమూ భాగస్తులమయ్యాం. నాకైతే అదే నయమనిపించింది. ఎందుకంటే కొత్తచోటు నాకు నిద్ర రాదు. పైగా మశిక పురాణం. పన్నెండుకల్లా అంతా నిద్రలోకి జారుకున్నారు. నేనేమో

జీరోబల్బు చూస్తూ లేచి కూచున్నాను.

"ఏందన్నా, ఏమైందీ?" సిద్ధయ్య గూడా లేచి కూచున్నాడు. అతని పరిస్థితి గూడా అదేనట. ఓ గంటసేపు మా వ్యక్తిగత జీవితాల గురించి మాట్లాడుకున్నాం. అప్పుడొచ్చినై ఆవలింతలు. నిద్ర ఎప్పుడు పట్టిందో?

"సార్... సార్" తలుపు మీద టకటకలు.

గబుక్కున లేచి కూచుంటూ పడబోయి నిలదొక్కుకున్నాను. కళ్లు నులుముకుని చూద్దునుగదా కిటికీ లోంచి చొచ్చుకొచ్చిన సూర్యకిరణాలు మిత్రుల్ని తడుముతున్నాయి. అయినా ఎవరూ స్పందించడం లేదు. లేచి తలుపు తెరిచాను.

"అదేటండీ!" నైట్ వాచ్‌మెన్ కాదు... డే చౌకీదారు డబాయింపు కొచ్చినట్టుంది. "రూములు దొరకలేదా? మా అప్పారావు గాడు వెళ్తూ చెప్పాడనుకోండీ... కానీ ఎప్పుడు ఖాళీ చేత్తారటా" యాస భాష లాగింపు వినసొంపుగా ఉంది. అతన్నలాగే చూస్తూ నుంచున్నాను.

"ఆయ బాబోయ్! నన్నట్లా చూత్తారేటండీ? నేనేమన్నా దెయ్యాన్నా, భూతాన్నా?"

గుండె పీచుపీచుమంది.

"అదికాదు బ్రదర్!" మావాళ్లను కళ్లతో చూపించాను "వాళ్లంతా నిద్రలేవాలి. దోమల పుణ్యమాని రాత్రంతా నిద్రలేదు. వాళ్లు లేచిం తర్వాత కాలకృత్యాలు ముగించుకుని ఊరు మీద పడాలి. సాయంత్రానికల్లా వెళ్లిపోతాంలే" భరోసా ఇచ్చాను. ఈలోగా మిత్రులు లేచి కూచున్నారు. సిద్ధయ్య నేరుగా వచ్చి నా పక్కన నుంచున్నాడు.

కానీ చౌకీదారు మొహంలో రంగులు మారాయి. "ప్రిన్సిపాల్ గారు చూశారంటే"... చేతులు పిసుక్కుంటున్నాడు.

"నీ ఉద్యోగం ఊడిపోతుంది గదా!" సిద్దయ్య పూర్తిచేశాడు. చౌకీదారు ఆరాటం మాకర్థమైంది.

"ఆయ్. కరెక్ట్‌గా చెప్పారండీ" మొహం విప్పారింది.

"వెళ్లేప్పుడు ఎంతో కొంత సమర్పించుకుంటాంలేవయ్యా" సత్యనారాయణ లేచొచ్చాడు.

"మరిప్పుడు... కాఫీ డబ్బులో" బుర్ర గోక్కున్నాడు. నా జేబులోంచి రెక్కలు విప్పుకుని బయటి కొచ్చిన ఐదు రూపాయల కాగితం అతని దోసిట్లో వాలింది.

"సరే. వత్తానండీ"

అద్దె గదుల వేట కొండాయపాలెంలో ఆరంభమైంది. టులెట్ బోర్డు కనిపించిన ప్రతి ఇంటా మా బాధలు వెళ్లబోసుకుంటున్నాం. జాలిగుండె కోసం గాలిస్తున్నాం.

"ఆఫ్టరాల్ ఆర్నెల్ల కోసం అద్దెగది ఎవరిస్తారండీ?" మొహమ్మీద అడిగేస్తున్నారు ఓనర్లు.

"మరి మా ట్రైనింగ్ ఆరునెలలే గదా!" అంటే

"ఆ మాత్రానికి లాడ్జింగ్‌లో అడ్జెస్టవ్వాలి" ఉచిత సలహా పారేసి భళ్లున తలుపు మూసేసుకోవడం.

మరో వీధికెళ్లాం. ఓ ఇంటి ఓనరు... ఇల్లాలు

"అద్దెకు దిగినవారు ఆర్నెల్లకే ఖాళీచేసి వెళ్లిపోతే వీధి జనాలేమనుకుంటారో తెల్సా?" బుగ్గలు నొక్కుకుంది.

"ఇంటి ఓనర్లు రాక్షసులనుకుంటారు" ఆమె భర్త సమాధానమిచ్చి అసలే కుదరదన్నాడు. ఇంటి ఓనర్లులో దయామయులుండరా! అంతా దెయ్యాలేనా? తిరిగిన వీధి తిరగకుండా తిరుగుతున్నాం. మధ్యాహ్నం సూర్యుడు నడినెత్తి మీదున్నాడు. కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి. ఆవురావురుమంటూ అక్కడికి దగ్గరున్న హోటల్లో దూరాం.

దాపురించిన గ్రహచారాన్ని తిట్టుకుంటూ, నిరాశా నిస్పృహలతో టేబుల్ ముందు కూచున్నాం.

"ఏం కావాలి సార్?" సూటుబూటేసుకుని

టై కట్టుకున్న జంటిల్‌మెన్ అడిగాడు.
"సర్వర్ కావాలి" సిద్దయ్య సర్దుక్కూచున్నాడు.
"ఏంటండీ. జోకా? " ముసిముసి నవ్వులు రువ్వాడు.
"జోకుడు లేదు, నాకుడు కాదు గానీ ప్లీజ్ సర్వర్‌ను రానివ్వండి" సిద్ధయ్య గొంతులో చిరాకు.
"అసలే ఆకలితో నకనకలాడిపోతుంటే వీడొహడు" నా చెవిలో గొణిగాడు ఆనందం.
"నేను సర్వర్‌నేనండీ" చేతులు కట్టుకుని నిటారుగా నించున్నాడు. అప్పటిదాకా చేతులు వెనక కట్టుకున్నాడు.
ఈయన ఓనరు కాదు, మేనేజరు కాదు. కళ్లతో మాట్లాడుకున్నాం.
"అట్లనా. అయితే బువ్వ ఏడుప్లేట్లు జల్దితే..." ఆనందం ఆర్డరిచ్చాడు.
సర్వర్ కళ్లు చికిలిస్తూ మా వైపు విచిత్రంగా చూస్తున్నాడు.
"ఏందీ వినబడలేదా? " గుర్రుమన్నాడు ఆనందం.
"బువ్వంటే పువ్వా? " గడ్డం గోక్కుంటున్నాడు.
"నఖ్రాల్ జేస్తున్నావా? " ఆనందానికి కోపమొచ్చినట్టుంది.
"ఆయబాబోయ్, ఆయబాబోయ్, అలా తిడుతున్నారెందుకండీ? " గుండెలు బాదుకుంటున్నాడు.
హోటల్లోని జనాలంతా మా వైపే చూస్తున్నారు. హైక్లాసు హోటల్ కాబట్టి క్లాసు జనాలున్నారంతా.
"హౌలాగానివా, పాగల్‌గానివా? " లేచినుంచోబోయాడు ఆనందం. భుజమ్మీద చెయ్యేసి ఆపేశాడు సిద్ధయ్య. ఆకలికి తట్టుకోలేక అప్పటికే అల్లాడిపోతున్నాం.
'వామ్మో వామ్మో ఏదో భాష యెదవ భాషలో అన్ని తిట్లు తిడుతున్నారెందుకండీ? పొద్దున్నే ఎవరి మొహం చూశానో ఏమో" సర్వర్ గోల. అందులో రోషం, బాధ రెండూ ఉన్నాయి. గుండెలు బాదుకోలేక, మమ్మల్ని తిట్టలేక సతమతమై సన్నాయి నొక్కులు నొక్కుతున్నాడు.
మేనేజర్ హడావుడిగా పరుగెత్తుకొచ్చాడు. "యామైందయ్యా? " సర్వర్‌నడిగాడు గాబరాగా.
"చూడండి సార్" అవమాన దుఃఖాన్నాపుకుంటున్నట్టుంది సర్వర్. "ఏం కావాలని అడిగితే ఏదేదో తిడుతున్నారు"
"అయ్యయ్యో తిట్టడమెందుకు సార్" అంటూ మావైపు తిరిగాడు మేనేజర్ "మీకేం కావాలో ఆర్డరివ్వండి సార్"
"నీ యవ్వ! బువ్వ కావాలని ఆర్డరిస్తే" మళ్లీ లేవబోయాడు ఆనందం. అతన్నాపడం సమస్యై కూచుంది.
"బువ్వనా? అంటే యేవిటి సార్? " మేనేజర్ నోరు మానేరు డామ్ గేటులా తెరుచుకుంది.
"నేనూ అలాగే అడిగానండీ. అంతే. నఖ్రాలనీ, పాగలనీ ఏదో భాషలో బూతులు తిడుతున్నారు సార్!" సర్వర్ నెత్తికొట్టుకుంటున్నాడు.
నా పక్క కూచున్న సత్యనారాయణ "బువ్వంటే ఏమిటి సార్? " చెవిలో అడిగాడు. నాకంతా అర్థమైంది.
"ఆనందం! మనమున్నది కాకినాడలో. ఇది వరంగల్లో, కరీంనగరో కాదు. కోస్తా ప్రాంతం. మన ప్రాంతీయ భాష వీళ్లకర్థమవ్వాలి గదా! మేనేజర్ వైపు తిరిగాను. "చూడండి బువ్వంటే అన్నం. నఖ్రాలు చేస్తున్నావంటే వేషాలు వేస్తున్నావా అన్నమాట. పాగల్ అంటే పిచ్చివాడు అంతేనండీ!!"
"ఓసోస్ అంతేనా!" సర్వర్ మొహం వెలిగింది. "అయితే ఏడు ప్లేట్ల మీల్స్ అన్నమాటా" కర్తవ్యం గుర్తుకొచ్చి తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.
"సారీ సార్" మేనేజర్ నవ్వుతూ వెళ్లిపోయాడు.
భాష... భావవ్యక్తీకరణకే. కాని భాషలోని

యాస, మాండలిక పదాలు అర్థం కాకపోతే అనర్థమేనని ప్రాక్టికల్‌గా తెలిసొచ్చింది.

"హమ్మయ్య! థ్యాంక్యూ గురూ గారూ!" సత్యనారాయణ మళ్లీ చెవిలో ఊదాడు. అంతా నవ్వుకున్నాం.

భోజనం ముగించి బయటికొస్తుంటే మా క్లాసుమేట్స్ ఐదారుగురు గుంపుగా లోపలికొస్తున్నారు. ఠక్కున ఆగిపోయాం. సిటీ సెంటర్‌లోని రామరాజ్ భవన్‌లో వారికి గదులు దొరికాయని చెప్పారు.

అక్కడిదాకా మేమెందుకు వెళ్లలేదు? మా మొహాలు పాలిపోయినై.

"మాగ్గూడా దొరుకుతాయా? " మెట్టయ్య ఆశ.

"దొరకవు. కాని ఒకే ఒక బ్యాచులర్‌కు అవకాశముంది. మా రూములో నేనొక్కడినే ఉన్నాను. ఇంకొకరుండొచ్చు" ఓ మిత్రుడలా అన్నాడో లేదో"నేనొస్తా. ఒక్కడినే" అంటూ మెట్టయ్య ఆ గుంపులో చేరిపోయాడు. సిద్దయ్య నేను నవ్వుకున్నాము. ఫ్యామిలీస్‌ను తెచ్చే అవకాశం మా ఇద్దరికీ లేదు. మాతో మిగిలిన మరో నలుగురికి గదులు కావాలి.

ఆరుగురం హతాశులమై ముందుకు కదిలాం.

నాకా క్షణాన మెట్టయ్య నిస్సంకోచంగా, నిరాడంబరంగా, నిర్లజ్జగా పట్టపగలే పార్టీ మార్చిన రాజకీయనాయకుడిలా కన్పించాడు.

గల్లీ గల్లీ తిరుగుతున్నాం. కనీసం ఒక్క గది దొరికినా ప్రస్తుతానికి ఆరుగురం సర్దుకోవచ్చు ఆ తర్వాత చూసుకోవచ్చనుకున్నాం. వెతికి వేసారిపోతున్నాం.

భూమి గుండ్రంగా ఉన్నది అన్నట్టుగా తిరిగి తిరిగి ట్రయినింగ్ సెంటర్ సమీపములో ఓ వీధిలో చొరబడ్డాం. పెరిగిన పట్టుదల ఇంకా తిరగాలంటుంది. అలసిన శరీరం అంతవరకు తిరిగింది చాలదా? అంటుంది. కానీ ఖాళీగా వెళ్తే చౌకీదారు సూటుకేసులు బయటికి విసిరేసి ట్రెయినింగ్ సెంటర్‌నుండి నిర్దాక్షిణ్యంగా ఖాళీ చేయిస్తాడు. లాడ్జింగ్‌లో గూడా గది దొరక్కపోతే ఢిల్లీలో కాశ్మీర్ కాందిశీకుల్లా పేవ్‌మెంటే శరణ్యం.

పట్టు వదలని విక్రమార్కుడిలా వేట మానలేదు.

"మా ఇంట్లో గదులున్నాయి. వచ్చి చూత్తారేటి" మా ముందుకొచ్చి అడిగిందొకావిడ.

వెతకబోయిన తీగ ఎదురొచ్చి వేలికి చుట్టుకుంటానంటే వద్దంటామా! మొదట ఆశ్చర్యం, తర్వాత గంభీర్యం, ఆ తర్వాత ఆబగా వెళ్లి చూశాము.

ఐదు ఖాళీ పోర్షన్లు. ఆ పక్క మరో చిన్న పోర్షను. అందులో ఆవిడే ఉంటుందట. కరెంటుంది. కంట్రీ లెట్రిన్, కుళాయి వసతి. ఇంకేం కావాలి! అదో ఇంద్రభవనంలా కనబడింది. అందరి తరపున మాట్లాడుమని అనకాపల్లి సత్యనారాయణను ఆవిడ ముందుకు తోశాం.

"మేము ఆరునెలల టెలిగ్రాఫ్ ట్రైనింగ్ కోసమొచ్చాం. ఈ ఐదు పోర్షన్లూ మాక్కావాలి. నలుగురం ఫ్యామిలీస్‌తో ఇద్దరు సింగిల్‌గా" మా చరిత్ర పుటల్ని తిరగేస్తూ మొత్తం చెప్పేశాడతడు. మేము బుద్ధిమంతుల్లా నిల్చున్నాం. ఆర్నెల్లంటే.. అదే చరిత్ర పునరావృతమవుతుందేమో! అనుమానం పీడిస్తోంది. అందరిలో ఆతృత.

'ఆయ్... బావుందండి" అతిశయం మేళవించిన ఆనందంతో ఆవిడ బుగ్గలు నొక్కుకుంది. కళ్లు తిప్పుతూ

"ఫ్యామిలీస్ వాళ్లకు ఆ మొదటి నాల్గు పోర్షన్లు. ఒంటి బ్రామ్మన్లకు నా గది పక్క గది. బాగుంటుంది గదా!" నడుముకు చేతులుంచి నిటారుగా నుంచుంది.

"బావుంటుందండీ" సంతోషంగా మావైపు చూశాడు.

" మా ఇంట్లో ఎప్పుడూ టెలిగ్రాఫ్ ట్రెయి

చట్టాలు ఎక్కువయ్యే కొద్దీ నేరస్థులు కూడా ఎక్కువవుతారు. -థామస్ ఫుల్లర్

నింగ్‌కొచ్చిన వాళ్లే ఉంటారు. ప్రతి బ్యాచికి మా ఇల్లు మంచి ఆశ్రయం. ఈసారి ఎవరూ రాలేదెందుకోనని చూత్తున్నా. సరే ఈ బ్యాచి గూడా వచ్చింద"ని... మురిసిపోతోంది.

ఓహో అదా సంగతి! అద్దె, కండిషన్లు అన్నీ మాట్లాడుకున్నాం. మాట్లాడుకోవడమేమిటీ శుకమహర్షిలా ఆవిడ చెప్పడం, శౌనకాది మునుల్లా మేము తలలూపడం అంతే. అడ్వాన్స్ కోసం చెయ్యి చాచింది.

"చూడండి బాబులూ! నేనా మొగుడు చచ్చిన ముండమోపిని. ఒంటరి నిరుపేదను. గదుల అద్దెలతోనే బతుకుదెరువు. గోడలకు మేకులు కొట్టొద్దు సుమా!" హెచ్చరిస్తూ మరి కొన్ని కండిషన్లు ఏకరువు పెట్టింది.

ఒలింపిక్‌లో గోల్డ్ మెడల్ సాధించినట్టు చకచకా అడ్వాన్సులిచ్చేశాం. వరుసగా మా పేర్లు చెప్పేశాం.

"మరి... తమరి పేరేమిటి? " సిద్దయ్య అడిగాడు.

"నా పేరా!" నల్లని పెదాల మీద తెల్లని చిరునవ్వు చిందులేసింది. డబ్బులు బొడ్లో దోపుకుని సిపాయిలా నుంచుంది. ఛాతీ విరిచి, చేతులు నడుమ్మీదుంచి "నా పేరు సత్తికొండ" సగర్వంగా చెప్పేసింది.

"అదేం పేరటా" సిద్ధయ్య మొహం ప్రశ్నార్థకమైంది

"సత్తికొండ అంటే అన్నవరం కొండ మీదున్న ఆ సచ్చన్నారాయణస్వామి. ఆయన మా కులదైవం. ఆ సామి కొండ పేరే నా పేరు. అంతే! రండి చేరిపోండి గదుల్లో" అంటూ ఓ సినీభామ ఫోజిచ్చి వయ్యారంగా అడుగులేస్తూ తన గదిలోకెళ్లిపోయింది.

మసక చీకటి కాదు గాని... మామూలు చీకటిలో కలిసిపోయే దేహఛాయ. పూర్ణం బూరెల్లా పొంగుకొచ్చిన బుగ్గలు, కుంగిపోయిన కళ్లు, ఐదడుగుల ఎత్తు. వయస్సు నలభై దాటొచ్చు సత్తికొండ అంటే సత్యనారాయణస్వామి కొండ అన్నమాట. నలుగురి మధ్య నాలుగైదు నిమిషాల తర్జనభర్జనతో ఎవరికే గది కావాలో తేలిపోయింది. మిగిలింది సత్తికొండ గది పక్కనున్నది గది బాగానే ఉంది.

విజయగర్వంతో ట్రైనింగ్ సెంటర్‌కెళ్లి లగేజి తెచ్చి సర్దుకునేసరికి రాత్రి తొమ్మిదైంది.

"సారూ క్రిష్ణమూర్తీ" మా గది ముందు ప్రత్యక్షమైంది సత్తికొండ. నలభై నెంబరు బల్బు వెలుతురులో పండుబారిన నేరేడు పండులా కన్పించింది ఆమె ముక్కు.

"ఓసారిలా వస్తే బాగుంటుంది" తానే పిలిచింది.

"నేను రావద్దా? " సిద్ధయ్య పేచీ.

"రావయ్యా మొగుడా, రా" చేతులు నడుమ్మీదున్నై, మాటిమాటికలా చేతుల్ని నడుమ్మీదుంచుకోవడం ఆమెకలవాటుకావొచ్చు నల్లసరపు గుండులాంటి మొహమ్మీద తెల్లని ఒంటి రాయి ముక్కుపుడక తళుక్కుమంది. వెలుతురులో ముఖారవిందం మెరిసిపోతోంది.

ఇద్దరమూ కలిసి బయటికొచ్చాం.

"ఏంది సత్తికొండమ్మా!" సిద్ధయ్య గొంతులో అతివినయం.

"ఏంటయ్యోయ్ ఏటీ నేను అమ్మమ్మలాగా కనబడుతున్నానా? " ధుమధుమలాడుతోంది.

"అయ్యయ్యో అదేం లేదు" నా వెన్నుపూసలో భయం.

"అలాగంటారేటీ? ఈ అబ్బాయి చూడు-సత్తికొండ'మ్మా' అంటాడేవిటీ? 'మ్మా'ను ఒత్తి పలికింది.

తెల్లబోయి చేతులు జారేసుకున్నాం.

"మరేమని పిలవాలె? " సిద్ధయ్య అడిగేశాడు.

"నా పేరు సత్తికొండ" కోపం మాయమైనట్టుంది. బుగ్గల మీద సిగ్గుల ఛాయలున్నాయి. "సత్తికొండా అని పిలిస్తే చాలు గదా!" మెలికలు తిరుగుతున్నట్టుంది ఒళ్లు.

"సరే అలానే పిలుస్తాం" ఊపిరి పీల్చుకుని సర్దుకోవడం నావంతయింది. సిద్ధయ్య ఆమెను ఎగాదిగా చూశాడు.

"సరే గానీ పక్క వీధిలో మాంచి హోట

లుంది. ముందు ఫోం చేసి రండి. పాపం! ఎప్పుడు తిన్నారో, ఎన్ని వీధులు తిరిగారో కాళ్లు నొప్పులు పుట్టొచ్చు ఆ వచ్చేదేదో నేరుగా ఈ ఇంటికే వస్తే బావుండేది గదా" బాధపడుతోంది.

అరెరే అప్పుడే ఆత్మీయత ఒలకబోస్తుందే.

"మీ ఇల్లు ఫలానా చోట ఉందనీ, మీ ఇంట్లో గదులు అద్దెకు దొరుకుతాయని కలలో కొచ్చి చెబితే అట్లానే చేసే వాళ్లం" సిద్ధయ్య గొణిగాడు. సత్తికొండకేం వినబడిందో

"ఏటేటీ నేను కలలో కొస్తానా!" ముదురు బుగ్గల మీద నునులేత సిగ్గు పడుచుపిల్లలా మురిసిపోతోంది.

సందిగ్ధంలో పడిపోయాను.

"ఓహో బొగ్గుల్లో రామచిలకా!" గొణుక్కుం టూనే రెచ్చిపోతున్నాడు సిద్ధయ్య నువ్వో పద హారేళ్ల బాలాకుమారివి గదూ! దివి నుండి భువికి దిగివచ్చిన అప్సరస్సువు గదూ!"

అయ్యయ్యో ఎటుపోయి ఎటొస్తుందో! కను సైగతో అతన్నాపేశాను. "దొరక్క దొరక్క దొరికిన గది మాటలు జాగ్రత్త!" చెవిలో హెచ్చరించాను. సత్తికొండ మాత్రం మారు మాట్లాడకుండా తన గదిలో కెళ్లిపోయింది. దీని పర్యవసానమేముంటుందో!

అందరం కలిసి భోజనానికెళ్లి వచ్చాం. సామానులు సర్దుకుంటూ సిద్ధయ్యతో బాత ఖానీకి దిగాను. మా పోస్టల్ డివిజన్ల అధికా రుల గురించీ, యూనియన్ లీడర్ల పనితీరు గురించి వగైరా వగైరాలు నిద్రాదేవి కౌగిట్లో ఎప్పుడు ఒదిగిపోయామో!

"సిద్ధయ్యా క్రిష్ణమూర్తీ" ముదురు కోయిల బెదురు గొంతులాగుంది. పిలుపుతోపాటు తలుపు మీద టకటకలు. ఆదరాబాదరాగా లేచి కూచున్నాం. కిటికీలోంచి సూర్యదర్శన మైంది.

"అరెరే! తెల్లన తెల్లారిపోయిందబ్బా" సిద్ధ య్యను కదిపాను.

గబుక్కున వెళ్లి తలుపు తెరిచాడు సిద్ధయ్య.

"వామ్మో!" సత్తికొండ గావుకేక. అరచేతుల్తో కళ్లు మూసుకుంది గూడా. "ఏమైందబ్బా?" అంటూ అటు చూద్దును గదా సిద్ధయ్య ఒంటి మీద కట్‌డ్రాయర్ తప్ప ఇంకేమీ లేదు. నల్ల జీడిగింజలా నున్నగా ఉన్నాడు. అతడు నీల మేఘశ్యాముడు కాదు. నిద్రమబ్బు పారిపో యింది. ఊడి నాపక్కనే పడున్న లుంగీ తీసు కెళ్లి అతని నడుముకు చుట్టేశాను. అప్పుడర్థ మైంది అతనికి- తన అసలు రూపం. లుంగీ సరిగా చుట్టుకుని.

"ఆ మాత్రానికే! అంత జడుసుకోవాల్నా!" సత్తికొండ చేతుల్ని కళ్లమీంచి తొలగించాడు.

"బాగానే ఉంది సంబడం. లెగండి. ఆరు న్నరైంది. క్లాసు ఏడింటికే గదా!" బుగ్గమీద వేలేసుకుని గుర్తు చేసింది.

"అమ్మనాయనోయ్. ఇదేందన్నా? పద పదా?" నన్ను పురమాయించి తాను టాయ్ లెట్‌లో దూరాడు. నాకంటే వయసులో చిన్న వాడు. డిపార్టుమెంటులో జూనియర్. అలా అన్నా అంటేనే బాగుంటుంది అనుకున్నాను.

ఇరవై నిమిషాల్లో ఇద్దరమూ తయా రయాం. ఆ లోగానే మా నలుగురు మిత్రులు మాకోసం ఎదిరి చూస్తున్నారు. అంటే వాళ్లె ప్పుడో నిద్రలేచారన్నమాట.

నిద్ర అనేది లేకపోతే మనిషి రాక్షసుడిగా మారేవాడేమో!

"ఏం గురూ! రాత్రికి నిద్రపట్టలేదా?" దారిలో అడిగాడు సత్యనారాయణ. అతడు సత్యకాలం మనిషిలా కన్పించాడు.

"అవును. ఏదో మాటల్లో పడిపోయాం. అర్ధరాత్రి దాటాక గాని నిద్రాదేవి కరుణించ లేదు".

అంతా కలిసి పక్కనున్న గుడిసె కం-టిన్స్ షెడ్ హోటల్లో టీ తాగాం. డెకోలాం టేబుల్స్, కుర్చీలు మాస్ కోసం తెరిచినా శుచీ శుభ్రతలో అది క్లాస్ హోటల్లాగుంది. వేడి టీ వడివడిగా లోపలికెళ్లేసరికి శరీరానికి కొత్త శక్తి వచ్చింది. ఉత్తేజం ఉబికొచ్చింది.

క్లాసులో అడుగు పెట్టేసరికి ఏడుంబావైంది.

"ఆగండి!" ఇన్‌స్ట్రక్టర్‌కు దయ్యం పట్టిన

ట్టుంది.

పరుగెత్తే సైకిల్‌కు బ్రేకులు పడినట్టు వెంటనే ఆగిపోయాం. మా మొహాలు చూసుకుని ఆ తర్వాత ఇన్‌స్ట్రక్టర్‌ను చూశాం. గంభీరంగా ఉంది వాలకం.

"యావండోయ్, ఇది కాలేజి క్లాసనుకున్నారా లేదా కిండర్ గార్డెన్ స్కూలనుకున్నారా? ఏడంటే... ఠంచన్‌గా ఏడింటికే క్లాసులో ఉండాలి తెలుసా? " ఉరిమాడు.

కొద్దిపాటి ఆలస్యానికి కొంపలు మునిగినట్టు... ఇదేమిటీ, తల తీసేసినట్టనిపించింది. నేలచూపులు తప్ప ఇంకేమీ తోచలేదు.

"సారీ సర్! ఈ రోజు కొత్తగదా!" నాగొంతులో పచ్చివెలక్కాయ ఇరుకున్నట్టుంది. ఇంకేమనాలో అర్థం కాలేదు.

"అబ్బో! కొత్తేమిటీ? అంతా శనివారం నాడే పాతబడిపోయారు గదా!" చింతబరిగెల్లాంటి పెదాల మీద నునులేత సూర్యకిరణాల్లాంటి చిరునవ్వు.

"చాల్లేవోయ్... బోడిపెత్తనం" సిద్దయ్య గొణుగుడు నాకు మాత్రమే వినబడింది. ఆ మాట అక్కడి దాకా వినబడితే ఇన్‌స్ట్రక్టర్ కల్లుదాగి ఇల్లెక్కిన కోతిలా చిందులేసే వాడే.

"ఊరుకో!" సిద్దయ్య చెయ్యి గిల్లాను.

"సరే.రండి. రేపటి నుండి ఇలాగైతే ఒప్పుకోను." వార్నింగొచ్చింది. మా వెనక వచ్చిన వారి పరిస్థితి మరీ అధ్వాన్నం. దొంగతనం చేస్తూ పట్టుబడినట్టు తలలు నేలకు వేళ్లాడాయి. అందరూ వచ్చేసరికి ఎనిమిదైంది. సణుగుడు, గొణుగుళ్లతో అటెండెన్స్ పూర్తి చేసి అల్మైరా తలుపు తెరిచాడు ఇన్‌స్ట్రక్టర్. మాయల ఫకీరు గౌనులోంచి మంత్రదండం బయటికొచ్చినట్టు అల్మారాలోంచి ఓ కాపీల కట్ట బయటికొచ్చి టేబుల్ మీదపడింది. అందులోంచి ఒక కాపీ తెరచి అందరికీ చూపిస్తూ చెప్పుకుపోతున్నాడు.

"ఇదిగో... ఇది ఓర్ రూల్‌డ్ నోట్‌బుక్కు. అంటే ఇంగ్లీషు చూచిరాత కాపి"

"కొంపదీసి మా చేత చూచిరాత రాయించరు గదా!"

సిద్ధయ్య అనేశాడు నిస్సంకోచంగా.

ఇన్‌స్ట్రక్టర్ పెదాల మీద మెరిసీ మెరియని చిరునవ్వు.

"కొంపతియ్యకుండానే చూచిరాత కాపీ రాయాలి. మీరు టెలిగ్రాములు రిసీవ్ చేసుకుని రాస్తారు. మీ చేతిరాత స్పష్టంగా లేకపోతే, గండు చీమలు పారినట్టుగా ఉంటే ప్రమాదం. అది ప్రజల పాలిట శాపమంటే నమ్మండి"

"ఓర్నియవ్వ!" ఎడమ పక్క కూచున్న ఆనందం. "గింత బతుకు బతికి బడిపోరగాండ్ల లెక్క చూచిరాత రాయాలెనటా" మాకు మాత్రమే వినబడేట్టుగా అన్నాడు.

"భలే తమాషాగా ఉందే!" అనంతపురం నుంచి వచ్చిన వేణుగోపాల్ నోరుతెరిచాడు. "నమ్మితాంగానీ అదెలాగో చెప్పండి సార్."

శ్రీకృష్ణదేవరాయల సుపరిపాలనలో తెలుగు తేజము పరిఢవిల్లిన రతనాలసీమ-రాయలసీమ నివాసి గదా! నిర్భయంగా అడిగేశాడు.

"చెబుతా... అదే చెబుతా...." కుర్చీలోంచి లేచొచ్చి టేబుల్ అంచున కూచున్నాడు ఇన్‌స్ట్రక్టర్ . "యువర్ సన్ అడ్మిటెడ్ ఇన్ హాస్పిటల్" అని టెలిగ్రాం వచ్చింది. పెద్ద చదువుల కోసం కొడుకును పెద్దపట్నం పంపించిన తండ్రి పాపం! ఆఘమేఘాలమీద హైదరాబాద్ చేరుకున్నాడు. కొడుకున్నది హాస్టల్ బెడ్‌మీద - హాస్పిటల్లో కాదు. ఇక్కడ జరిగిందేమిటి? టెలిగ్రాం రిసీవ్ చేసుకున్నాయన.. అదే మనలాంటి సామాన్యుడే.... హాస్టల్‌కు బదులుగా హాస్పిటల్ అని రిసీవ్ చేసుకొన్నాడనుకున్నారేమో! కాదు. మోర్స్ సౌండ్ సరిగినే విన్నాడు కాని చేతిరాతలో గజిబిజి కారణంగా హాస్టల్ హాస్పిటల్‌గా కనబడింది అంతే అంటూ అలాంటి ఉదాహరణలు మరికొన్ని చెప్పి "ఇప్పుడే తలా ఓ కాపీ కొనుక్కుని హాండ్ రైటింగ్ ప్రాక్టీసు చెయ్యండి. ఇంట

ర్వెల్ తర్వాత అందరి కాపీలు చూస్తాను" అని ఐదు రూపాయలకో కాపీ హాట్‌కేకుల్లా అమ్మేశాడు. నలభై పేజీల నోట్‌బుక్ అది.

"దీని వెల ఒక్క రూపాయే కాని మన సారువారు మంచి వ్యాపారిలా గున్నారు"

"ఈ యాపారం బాగుంది."

"సొమ్ముల బోణీ బాగానే ఉందే!"

"పాపం! ఈ మాత్రం లాభముండక పోతే ఎట్లా? "

నలుగురు నాలుగురకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. వీటిని ఈ చెవితో విని ఆచెవి ద్వారా వదిలేస్తున్నట్టుంది పెద్దాయన.

ఈ వయసులో చూచిరాత నేర్చుకోవడం ప్చ్ మా తలరాత కాకపోతే ఇంకేమిటి అనుకొంటూ నవ్వుకున్నాం. 'హాండ్ రైటింగ్‌లో మెలకువల' అంశమ్మీద అరగంటసేపు సూచనలు సాగాయి. ఆ తర్వాత చూచిరాత అభ్యాసం . కడుపులో పేగులు నకనకలాడుతున్నాయి. అల్పాహారం కోసం అలమటిస్తున్నాయి. కాని మెలకువలను దృష్టిలో ఉంచుకుని చూచిరాత రాస్తుంటే అక్షరాలు ముత్యాల్లాగొస్తున్నాయి. ఇదీ మన మంచికే అనుకుంటూ తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాము.

పద్దైంది. ఇంటర్వెల్‌లో క్యాంటిన్ నిండా మా క్లాసుమేట్స్. రాయలసీమ దీర్ఘాలు, కళింగాంధ్ర కమ్మని యాస, కోస్తా తియ్యదనం, తెలంగాణా వీణానాదం కలగలిపిన తెలుగు భాషకు అదొక సంగమ స్థానం. గదుల గురించిన ముచ్చట్లతో టిఫిన్ ముగిసింది. కబుర్లు చప్పరిస్తూ టీ లాగించాం. ఆత్మారాముని అల్లరి సద్దుమణిగింది.

ఆ రోజు చూచి రాత కాపీలతో గడిచిపోయింది. రూము కొచ్చేసరికి ఒకటిన్నరైంది. ఆకలికేకలు ఆకాశాన్నంటుతున్నాయి. కాపీలు లోపల పడేసి గదులకు తాళాలు వేస్తున్నాం. అత్తారింటికి... కొత్తగా వచ్చిన కోడలు లాగుంది పరిస్థితి.

"యావండోయ్!" చిరునవ్వుతో వచ్చింది సత్తికొండ. "చూచి రాతలు రాశారా!" చూపులతో సిద్ధయ్యను ప్రత్యేకంగా తడుముతోంది. సిద్ధయ్య మొహం చిట్లించి.

"ఆc చూచిరాతనా? మేమేమన్నా ప్రైమరీ స్కూలు పోరగాండ్లమా? " బుకాయించబోయాడు.

"నాకన్నీ తెలుసు లేవాయ్. ఈ వారమంతా చూచి రాతనే" గలగలా నవ్వింది. ఆనవ్వు నిర్మలంగా, గంగాప్రవాహం సవ్వడిలాగుంది.

"అమ్మోయ్! సత్తికొండకన్నీ తెలుసునే!" ఆశ్చర్యపోయాను.

" ఆయ్. సరేగానీ... కాస్త మంచి హోటల్ కెళ్లండేం. సినీస్ట్రీట్ మనింటికి దగ్గరే. అది దాటి మెయిన్‌రోడ్డుంది. అక్కడున్నాయి. క్లాసు హోటళ్లు" హోటళ్ల పేర్లు, అనవాళ్లు గలగలా చెప్పేసింది. "చీప్ హోటల్లో తింటే ఒళ్లు గుల్లయి పోతుందబ్బాయా. జాగ్రత్త!" హెచ్చరించింది.

వెడల్పాటి రోడ్లు, ఎన్నో అంతస్తుల భవనాలు, నవనాగరికులు నడుస్తున్న తీరుతెన్నులు కంటికి ఇంపుగా ఉంది. సత్తికొండ సూచనల ననుసరించి మెయిన్‌రోడ్డులోని క్లాసు హోటల్లో భోజనాలు ముగించాం.

కాకినాడ ప్రత్యేకతల్లో సినీస్ట్రీట్ మొదటిది. చిత్రసీమ చిదానందాన్ని, రంగుల లోకం హంగుల్ని అందరికీ పంచేందుకు ఒకే వీధిలో పద్నాలుగు థియేటర్లు, కొత్తగా రిలీజైన సినిమాలు, పంచరంగుల పోస్టర్ల పటాటోపాలు... ప్రాణం ఊరుకుంటుందా? రిలీజైన సినిమా చూడలనే కోరిక అంతవరకు అణిగి మణిగి ఉంది. కారణం... అందుబాటులో లేక. ఆ కోరిక పురివిప్పి నాట్యం చేసింది. ఏసి థియేటర్లో ఎకాఎకిన దూరిపోయాం. ఆ సినిమా విడుదలై వారం కూడా కాలేదట. అదొక థ్రిల్లు.

ఒక పనిని తప్పుగా ఎందుకు చేస్తామో వివరించడానికి పట్టే సమయం కంటే ఆ పనిని సరిగ్గా చేయడానికి తక్కువ సమయం పడుతుంది. - లాంగ్‌ఫెలో

రాత్రి భోజనం కూడా ముగించి గదికెళ్లాం. ఇంటికి ఉత్తరం రాయాలి. మేమున్న అడ్రసు మా కుటుంబానికి తెలపాలి. ఇల్లు గలావిడనే అడుగుదామనుకున్నాం.

"సత్తికొండా!" సిద్ధయ్య పిలిచాడో లేదో

"వచ్చేస్తున్నా చిన్నోడా!" అంటూ ప్రత్యక్ష మైంది. అదే మరొకరైతే "నేనేమన్నా నీ పెళ్లాన్నా? అలా పిలుస్తావెందుకు?" అని అధిక్షేపించి మొహం వాచేలా చివాట్లు పెడతారు. కాని... సత్తికొండ అలా పిలిస్తేనే ఆనందంగా వస్తుందని సిద్ధయ్య కర్థమైంది. మనుషుల మనస్తత్వాలు చదవడంలో సిద్ధయ్య సిద్ధహస్తుడు. కలం, కాయితం పట్టుకుని ఆవిడ నాపాదమస్తకం చూపులతో తడుముతూ

"ఈ ఇంటి నెంబరు, ఈ ఏరియా పేరు చెప్పు" అడిగాడు.

ఇంటినెంబర్ చెప్పేసి "ఇహ పోతే ఏరియా.... ఇది బుడంపేట...."

"ఆం బుడంపేటనా?" బుర్ర గిర్రుమంది. బురదగుంటలో దిగబడిపోతున్నట్లు అరిచాడు. మిత్రులు బిత్తరబోయారు. ఆరెరే... ఎక్కడైతే ఉండొద్దని అనుకున్నానో... అక్కడే ఉన్నానే!

"ఏందయ్యోయ్ క్రిష్ణమూర్తీ" సత్తికొండ నోరుదెరిచి గదవ మీద వేలేసుకుంది. కుడి అరచేతిలో ఎడమ మోచేయి ఆనించి ఉంది. "కరెంట్ షాక్ కొట్టినట్టు అలాగైపోయావేటీ?" అంటూ విచిత్రంగా చూస్తోంది.

నిజం నిష్టురంగా ఉంటుంది. చెబితే కోపానికోస్తుందేమో! నా బిత్తర చూపులు సిద్ధయ్య వైపు మళ్లాయి.

"ఏందన్నా?" కళ్లతో అడిగాడు సిద్ధయ్య.

"అబ్బే ఏంలేదు. కానీ గొంతులో గోంగూర కాడ తట్టుకున్నట్టుంది. నా అవస్థ ఆవిడ కర్థమైనట్టుంది.

"బుడంపేట నిండా సానులుంటారని విన్నావా?" కనుబొమలెగరేసింది.

"ఆం ఆం అదే అదే!"

కళ్లు చికిలించి కిసుక్కున నవ్వింది. కిసుక్కుతో ఆరంభమైన నవ్వు గలగలాపారే గోదావరిలా మారింది. అవయవాలన్నీ కదిలిపోతున్నాయి. బలవంతాన నవ్వాపుకుని

"అయితే ఈ వీధిలో సంసారులు లేరని చెప్పారా?" కొంగు సర్దుకుంది.

"కానీ ఇది బుడంపేట..."

"బుడంపేటనే. అనుమానం అక్కర్లేదయ్యా క్రిష్ణమూర్తీ. కానీ బుడంపేట ఏరియాలో వీధులన్నీ అలాంటివి కావు. సానికొంపలు, సీతాకోకచిలకలు పక్కవీధిలో ఉన్నాయి. ఆ వీధిలో మీలాంటి యువకులు కనబడితే కోమలాంగుల కనుసైగలు, కొంగులు జారడాలు, బజారు బాగోతాలు బోలెడన్నుంటాయి. అటువైపు వెళ్తే ఆరోగ్యం చెత్త అయిపోతుంది. మీరు చిత్తయి పోతారు. ఆ వీధిలో నడుస్తుంటే పిచ్చి యెదవలైపోతారు. ఒళ్లు పుచ్చిపోతుంది... జాగ్రత్త" సీరియస్‌గా చెప్పేసింది.

"హమ్మ నా సత్తికొండా!" సిద్ధయ్యకు సందు దొరికింది.

గుండెమీద చెయ్యేసుకుని "సత్తికొండ అంటే సుత్తికొండ అనుకున్నాను గానీ హుషారు పిట్టవే సుమా!" అనేశాడు.

"ఆ మాత్రం హుషారు లేకపోతే ఈ మాత్రం బతుకుదెరువుంటుందా సిద్దులూ!" చేతులు తమాషాగా తిప్పేసింది.

"వారెవ్వా! సత్తికొండది సినిమాల్లో సూర్యకాంతం పాత్ర అనుకున్నా గానీ అదేంకాదు" ఆనందం ఆనందంగా ఫీలయ్యాడు.

"సత్తికొండగారూ థాంక్స్" సత్యనారాయణ గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నాడు.

"మనమున్నది సంసారుల వీధి. పక్కవీధిలోకి తొంగిచూడొద్దని మరోసారి చెబుతున్నా... ఆం" మరో వార్నింగ్.

"అమ్మ సత్తికొండా! నువ్వు సత్తుపిండివి గూడా కాదు..." సిద్ధయ్య ఉడికించాలనుకున్నాడు.

"ఆయ్... సత్తుపిండినే కాని పంచదార

పానకములో ముంచి తీసిన సత్తుపిండిని కుర్రోడా! " గర్వంగా చెప్పేసి నవ్వేసింది.

"ఇహ మీరు పడుకోండి. పొద్దున్నే క్లాసుకెళ్లాలి గదా" అంటూ తన గదిలోకెళ్లింది. దభీమని తెలుపేసుకుంది.

"ఈమె మనలాంటి ట్రెయినీస్ నెందరినో చూసుంటుంది. ఆర్నెల్లకో బ్యాచు. పాపం... అందరినీ ఇట్లానే ఆటపట్టిస్తుందేమో" సిద్ధయ్యతో అన్నాను గదిలోకెళ్తూ.

ఐదురోజుల దాకా హాండ్‌రైటింగ్ ట్రెయినింగే కొనసాగింది. ఆశ్చర్యమేమిటంటే ఈ కొద్దిరోజుల్లోనే మా చేతిరాత ఎంతో మెరుగైంది. అక్షరాలు ఆణిముత్యాల్లా, గుండ్రంగా, స్పష్టంగా కనబడుతున్నాయి. అదంతా మా ఇన్‌స్ట్రక్టర్ గారి శ్రమ ఫలితమే. శుక్రవారం మధ్యాహ్నం

"ఈరోజు మంచిరోజు. అక్షరాల కోడ్ ప్రారంభిద్దాం"తో కొత్తపాఠం ఎత్తుకున్నాడు ఇన్‌స్ట్రక్టర్. చాక్‌పీసుతో బోర్డుమీద రాస్తున్నాడు.

"కట్టు, కడ (-.) ఏ

కట్టు, కడ, కడ, కడ (-...) బి

కట్టు, కడ, కట్టు, కడ (-. - .) సి

కట్టు, కడ, కడ (- . .) డి॥

అదంతా కాపీల్లో రాసుకొమ్మన్నాడు. రాసుకున్నాం.

"రేపు సెకండ్ సాటర్‌డే. ఎల్లుండి ఆదివారం. రెండ్రోజుల సెలవు కాబట్టి వెనకటికి ఆశ్రమ పాఠశాల విద్యార్థులు వేదశ్లోకాలు వల్లెవేసినట్టు బట్టీ పట్టండి. కంఠోపాఠమవడం గ్యారంటీ. సోమవారం అందరూ అప్పజెప్పాలి. ఆరోజుకు ఇన్‌స్ట్రక్టర్ గారి చివరి ఇన్‌స్ట్రక్షన్.

నిజామాబాదు కాశీనాథ్, అనకాపల్లి సత్యనారాయణ, కరీంనగర్ రాజయ్య, ఆదిలాబాదు ఆనందం క్లాసునుండి నేరుగా రైల్వేస్టేషన్ కెళ్లారు. ఫ్యామిలీస్‌తో తిరిగొస్తామన్నారు.

ఉద్యోగాల్లో స్థిరపడ్డాక గుట్టుగా సంసారాలు సాగుతున్న సమయంలో ఆర్నెల్ల అంతరాయం. ఉమ్మడి కుటుంబాల్లో మనిషికీ మనిషికీ మధ్య మమతానురాగాలు మాయమవుతున్న రోజులు. ఎవరి కుటుంబ పరిస్థితి ఎలాంటిదో...

సిద్ధయ్య, నేను ఇద్దరమే మిగిలాం.

శనివారం ఉదయం ఏ, బి, సి. డి. టెలిగ్రాఫ్ కోడ్ వల్లెవేస్తున్నాం. సత్తికొండ బయటికొచ్చి జాగ్రత్తగా వింటోంది. "ఏయ్ సిద్ధయ్యా! తప్పు" మా ముందుకొచ్చింది. చేతిలోవున్న కాఫీ గ్లాసులు మాకందిస్తూ" డి అంటే కట్టు కడ కడ. నువ్వేమో కట్టు మూడు కడలంటున్నావు. ఇది 'బి' అవుద్ది... తప్పులు ఎత్తిచూపి తిరిగి వెళ్లిపోయింది.

ఆశ్చర్యం! ఆనందంతో అవాక్కయ్యాం.

ఆవిడ మళ్లీ బయటికొచ్చింది.

మాకంటే ఈవిడే నయం. కమ్మని కాఫీ కడుపులోకెళ్తుంటే నరాల్లో ఉత్సాహం ఉరుకులాడుతోంది.

ధైర్యంగా ఆవిడ ముందుకెళ్లాడు. నడుమ్మీద చేతులుంచుకుని దీపస్తంభంలా నుంచున్నాడు సిద్ధయ్య.

"ఈ మోర్స్ కోడ్ నీకెట్టా కంఠోపాఠమైందటా...!"

సత్తికొండ ముఖారవిందము ఇంద్రధనుస్సు రంగులు పులుముకుంది. "ప్రతి బ్యాచివాళ్లు వల్లెవేస్తుంటే వింటున్నాను గందా. ఏదో సరదాకోసం నేనూ వల్లెవేశాను. వచ్చేసింది బుల్లోడా. నోటికొచ్చేసింది!!" మరింత ముందుకు జరిగింది. ఆమె ముఖకవళికల్ని ఆసాంతం చదివేస్తూ

"నువ్వసలూ కాకినాడ టౌన్లో కాకుండా, కరీంనగర్ కలెక్టర్‌గా ఉంటే బాగుండేది సత్తికొండా" అనేశాడు. పొగడ్తలకు పొగరుబోతు గూడా తలవంచి తీరాల్సిందే గదా!

"అయబాబోయ్... ఆయ్ బాబోయ్" సంతోషాన్ని పట్టలేక గుండెలు బాదుకుంటోంది. "కలెక్టరా! బావుందయ్యా మొగుడా" కుడిచెయ్యి చూపుడువేలు బుగ్గమీదుంది.

"చిత్రాల మొగుడు ఉత్రాలు రాస్తే చింత

పల్లి లాకులో చిక్కడ్డాయట" మొహం మబ్బులు కమ్మిన ఆకాశం లాగైంది." ఆ బ్రెమ్మదేవుడు నా నుదుటిమీద ఏం రాశాడో గాని నుదుటిమీది బొట్టు ఎప్పుడో చెదిరిపోయింది. మొగుణ్ని పోగొట్టుకుని మొండిబ తుకు బతుకుమని అడ్డదిడ్డం గీసిపారేసుంటాడు" గోడకొరిగి కూచుండిపోయింది. కంటి రెప్పలు మంచుకురిసిన తమ్మిరేకుల్లాగైనాయి. ఆమె అలా స్పందిస్తుందనుకోలేదు.

"అదికాదు సత్తికొండా" సిద్ధయ్యా ఆమెకెదురుగా కూచున్నాడు. "మనుషుల్ని తోలుబొమ్మలుగా తయారుచేసి ఆడుకోవడం ఆ బ్రహ్మదేవుడికి సరదానట. పైవాడి లీలల ముందు మనమెంత? " ఆరిందాలా మాట్లాడ్తుంటే ఆశ్చర్యపోయాను. అయినా ఆయనకూ మనసుంటుంది గదా!

అయ్యో పాపం! ఒంటరి ఆడది సంసార సాగరాన్ని జంటగా మథించి ఇంకొంత కాలం మధుర రసాలనుభవించే వయసు... జాలేసింది.

"నీకభ్యంతరం లేకపోతే నీ భర్త ఎట్టా చనిపోయాడో చెప్తావా? " అడిగాను ఆసక్తిగా.

"అదంతా ఓ కథ బాబూ!" ఆవిడ చూపులు శూన్యంలోకి చొచ్చుకుపోతున్నాయి. మొహం అదోలాగైంది.

"ఫరవాలేదు. వింటాం" అని నేనుగూడా వెళ్లి సిద్ధయ్య పక్కన కూచున్నాను.

గత అనుభవాల తాలూకు అనుభూతుల్ని నెమరేసుకుంటుందేమో మొహం నిండా గాంభీర్యం చోటుచేసుకుంది.

"మూడు ముక్కల్లో చెబుతా బాబూ"తో ప్రారంభించింది.

"అందరు ఆడపిల్లల్లాగే నాగ్గూడా పదిహేనేళ్లకు పెళ్లైంది. ఎన్నో కోరికలు కొంగున ముడేసుకుని కొత్త కోడలుగా అత్తారింట్లో అడుగుపెట్టాను. అత్తామామలు లేరు. నా భర్తకు తోడబుట్టిన వాళ్లెవ్వరూ లేరు. వాళ్లంతా తుఫానులో ఒకేసారి కొట్టుకుపోయారట. మూడు రాత్రులు మురిపెంగా గడిచాయి. నా భర్త చానా మంచోడు. చిలకా, గోరెంకల్లా సినిమాలకు, షికార్లకు తిరిగేవాళ్లం. పెళ్లైన మూడు నెలల్లో ముప్పై సినిమాలు చూపించాడు.

ఆరోజు యానాం వెళ్లొచ్చినం. సాయంత్రం మల్లెపూలు తెస్తానని సైకిల్ మీదెళ్లాడు. ఎదురుగా ఏదో లారి వచ్చి గుద్దేసి వెళ్లిపోయిందట. ఆ వార్త వినగానే నా నెత్తిమీద పిడుగుపడ్డట్టైంది. లబలబలాడుతూ వెళ్లి చూశాను. రక్తం మడుగులో ఒడ్డుకేసిన చేపపిల్లలా కొట్టుకుంటున్నాడు. మల్లెదండ ఎర్రని రక్తమ్మీద తేలిఆడుతుంది. నాకోసమే ఎదిరి చూస్తున్నాడేమో- నా చేతుల్ని తన చెంపలమీదుంచుకుని ప్రాణాలొదిలేశాడయ్యా! భోరుమంటూ వెక్కి వెక్కి ఏడ్చింది. కొద్దిసేపటి తర్వాత శాంతించింది. అతడు పనిచేస్తున్న ఫ్యాక్టరీ కార్మికుల సాయంతోనే సాగనంపాం బాబూ!" అంది. అయితే అప్పట్నుంచి ఒంటరిదైపోయిందన్న మాట.

సినిమా ట్రిక్కుల గురించి, సినీయాక్టర్ల హక్కుల గురించి సత్తికొండకు బాగా తెలుసు.

"అన్ని సినిమాలెందుకు చూసినట్లో డబ్బులెక్కువ అయినయా లేకపోతే తిన్నది అరగ లేదా? " తమాషాకు దిగాడు సిద్ధయ్య. విషాదాన్ని వినోదంగా మార్చడమొక కళేనేమో.

"కాదు సినిమా యాక్టరునై నీలాంటి హీరోతో చిందులెయ్యాలనీ" చేతులతో పాటు నడుముగూడా ఊగింది. "పగటి కలలు కన్నాను బుల్లోడా. కాని ఏం లాభం? నువ్వు హీరోవు కాలేదు. నేను హీరోయిన్ను కాలేదు. ఇద్దరమూ పెద్ద జీరోలమైపోయినాం" సిద్ధయ్య చెంప గిల్లింది. మాతో ఆమె గూడా నవ్వేసింది. ఆ తర్వాత మొహం పగటి కలువలాగైంది. "మొగుడు పోయాక కడుపు తప్ప

ఒక వ్యక్తి యొక్క పొడిగింపబడిన నీడే ఒక సంస్థ. విమర్శకు చోటివ్వని మచ్చలేని జీవితాన్ని జీవించు. - రోస్‌పాల్

నాకింకేం మిగిలిందనీ. ఫ్యాక్టరీ వాళ్లిచ్చిన డబ్బుల్తో ఈ పోర్షన్లు వేయించా. అద్దెలతో కడుపునింపుకోవడం, అప్పుడప్పుడు సినిమా చూడ్డం. ఏదో ఇలా గడిచిపోతుంది" మళ్లీ గోడ కొరిగింది. ఏ మనిషి మనసులో ఏ అగాధముందో!

నిర్మలగంగా ప్రవాహంలా మాట్లాడే సత్తికొండ జీవితం పాపం! ఎన్ని మలుపులు తిరిగిందో.

మధ్యాహ్నం హోటల్లో భోంచేసి అట్నుంచటే మ్యాట్నీ షోకెళ్లాం. వీధిలైట్ల వెలుగుతో ఇల్లు చేరుకున్నాం.

ఓ అందాలభామ మాకెదురుగా వచ్చి "మీరు అద్దెకున్న వాళ్లాండీ? " పలుకరించింది. ఎర్రని పెదాలమీద తెల్లని చిరునవ్వు దోబూచులాడుతోంది.

"అవునండీ" అన్నాను.

వయసులో ఉంది. నున్నని చెక్కిళ్లు, సన్నని నడుము, పొంగుకొచ్చిన యవ్వనపు హంగులు, గుండ్రని మొహమ్మీద దోసగింజ బొట్టు, చేపల్లా కదులుతున్న కళ్లు. జాగ్రత్తగా పైట సవరించుకుంటూ సత్తికొండ గదిలో కెళ్లింది. వాళ్లిద్దరూ కలసి భోంచేస్తున్నారని అర్థమైంది.

"ఈమె ఎవరటా? " సిద్ధయ్య నడిగాను అనుమానంగా.

"యేమో! నాకేం దెలుసన్నా"

కోడ్‌బుక్ చేతిలోకి తీసుకుంటూ "ఇది బుడంపేట గదా!" దీర్ఘాలు దీశాడు. అవును కానీ బుడంపేట గురించి బడా కబుర్లు చెప్పిందిగదా! అరే బాప్‌రే! ఆ అమ్మాయి అంత ధైర్యంగా మాట్లాడుతోంది.!

గుండె గుబగుబలాడింది.

సముద్రంలోతు తెలుసుకోవచ్చుగాని మనిషి లోతు తెలుసుకోలేమన్నారు. సత్తికొండ స్వభావమెలాంటిదో ఆ అమ్మాయి ఎందుకొచ్చిందో మా గురించి ఏమనుకుంటుందో పదినిమిషాల్లో పలు అనుమానాలు ముసురుకున్నాయి. భోజనం ఐపోయినట్టుంది ప్లేట్లు కడిగి తీసుకెళ్తుంది సత్తికొండ. ఆ అమ్మాయి గురించి అడుగుదామనుకున్నాను.

"ఒసేయ్! ఎక్కడున్నావే" ఓ యువకుడు ఓరగా వేసున్న తలుపుల్ని తోసుకుని లోపలికొచ్చేశాడు. ఫూటుగా తాగినట్టుంది తూలుతున్నాడు.

"రాయే... ఇట్రాయే, నా ముందుకు రావే" ఉల్లి ఆకులా ఊగిపోతూ నోరారా ఛాలెంజిలు విసురుతున్నాడు. మేము బయటకొచ్చి చూస్తున్నాం. ఎరక్కపోయి ఇరుక్కుపోయామా? అనుమానం.

నెక్కరు, హాఫ్‌షర్టు, చెదరిన జుట్టు బక్కపలుచగున్నాడతడు. సత్తికొండ బయటికి పరుగెత్తుకొచ్చి "ఆగు పైడితల్లి ఆగవయ్యా" గుడ్లురిమింది. కొంగు నడుముకు చుట్టుకుంది.

"ఎందుకాగాలెనటా.. నా పెళ్లాన్ని... నీ ఇంట్లో తొంగోబెట్టుకున్నావెందుకు అంట? అరుస్తూ సత్తికొండ గదిలో దూరాడు పైడితల్లి.

"ఒసేయ్ గిరిజా నీకు సిగ్గూ ఎగ్గులు లేవు గదూ" విచిత్రంగా అరుస్తూ ఆ అమ్మాయి జడపట్టి బయటికి లాక్కొచ్చాడు.

"అమ్మోయ్ బాబోయ్ ఈ యెదవ నన్ను చంపేత్తడే. నన్ను బతకనియ్యడే. అమ్మా!" గిరిజ కుయ్యో, మొర్రోలతో ఇల్లు దద్దరిల్లింది. అదంతా ఏమి తతంగమో మాకర్థం కాలేదు. సినిమా ప్రేక్షకుల్లా చూస్తున్నాం.

"వాయమ్మో గిరిజా" సత్తికొండ మొత్తుకుంటూ గిరిజ చెయ్యిపట్టి తనవైపు లాక్కుంది "చూడు పైడితల్లీ! మాటలు జాగర్తగా రానీ. తాగుడు. తందనానలాడ్డం. ఛీఛీ సిగ్గులేదూ! ఆగు నువ్వాగవయ్యా" బెదిరిస్తూ అదిరిస్తూ అతన్నుండి గిరిజను విడిపించుకుంది.

"అత్తోయ్! నా పెళ్లాన్ని నువ్వు లాక్కుంటావా? విడిచిపెట్టు. పైడితల్లి దూకులాడుతూ రెచ్చిపోతున్నాడు. "మొగుడంటే యావనుకుంటుందో దాన్నడిగి చూడు. ఇవ్వాళ అదో, నేనో తేలిపోవాల" గంతులేస్తూ

సత్తికొండ జబ్బలు బట్టి నెట్టిపారేశాడు. పాపం సత్తికొండ మొదలు నరికిన మామిడి గున్నలా పడిపోయింది.

"రాయే నా యాలా" తోక కోసిన మేకలా అరుస్తున్నాడు. గిరిజ వీపుమీద గుద్దుల వర్షం కురుస్తోంది.

సంసారుల ఇళ్లల్లో సవాలక్ష సమస్యలుంటాయి గదా! కళ్లతో సైగలు చేసుకుని కల్పించుకోవాలనుకున్నాం. ముందు నేను కదిలాను. "ఏయ్ మిస్టర్! ఆగు" బెదిరిస్తూ పైడి తల్లి నిటు లాగేశాను.

"నువ్వెవనివిరా! ఆమెనట్లాకొడుతున్నావ్" సిద్ధయ్య చేతిలో పైడితల్లి కుడిచెయ్యి నలిగిపోతోంది. పిల్లి ఓటికి చిక్కిన కోడిలా అరుస్తున్నాడతడు. వద్దని సైగ చేశాను. వదిలేశాడు.

సత్తికొండ నెత్తికొట్టుకుంది. "ఈ దుర్మార్గుడు నా అల్లుడు. అది నా కన్నకూతురు గిరిజ బాబూ!" వగరుస్తూ లేచి వచ్చి మా వెనక దాక్కుంది. "ఈ యెదవను కట్టుకుని నా కూతురేమీ సుఖపడలేదు క్రిష్ణమూర్తీ" భోరుమంది.

పైడితల్లికి రోషం పొడుచుకొస్తున్నట్టుంది. "నా పెళ్లాం. నా యిష్టం. మజ్యన మీరెవరండీ" నలిగిన చెయ్యిని పుణుక్కుంటూ మావైపు తిరిగాడు. రోషంతో రొప్పుతున్నాడు.

"నీ పెళ్లామైతే మాత్రం అట్లా కొడ్తావా? " మనసు కుతకుతలాడ్తోంది. "ఆలిమీద చెయ్యి చేసుకునే మొగుడు అసమర్థుడు, తెలివితక్కువ దద్దమ్మ. ఆమె తిరగబడితే నీ అంతు చూస్తుంది. తెలుసా? " ఉరిమాను.

తాగిన మత్తు దిగిపోయిందేమో చేష్టలుడిగి నుంచున్నాడు. తన ఆటలు సాగవని అర్థమై పోయుంటుంది. "మీరే చెప్పండి మాస్టారూ!" నేలమీద కూలబడ్డాడు. "ఇది నా పెళ్లాం. ఫ్యాక్టరీలో రెగ్యులర్ లేబరండీ. జీతం డబ్బుల్లో సగం కూడా నాకివ్వదండీ. మనం మొగోళ్లం. మనకెన్నో యవ్వారాలుంటాయి, ఖర్చులుంటాయి గందా" అమాయకుడిలా ఆరోపణలు కురిపిస్తున్నాడు. పెళ్లాన్ని దోషిగా చూపిస్తున్నాడు.

పాపం గిరిజ తల్లిచాటున నుంచుంది. కొంగునోట్లో కుక్కుకొని ఏడుపును గొంతులో బందీ చేసిందని ముఖకవళికలు చెబుతున్నై. పాపం! అమాయకురాలిలా ఉంది!

"మరీ నువ్వేం పనిచేస్తున్నవ్ భాయీ సాబ్? " సిద్ధయ్య సూటిగా అడిగాడు. పైడి తల్లి భుజాలు పుణుక్కుంటూ.

"నేనాండీ. నేను మొగోణ్ని గదండీ" తనను తానే గర్వంగా చూసుకుంటూ ఇంకేదో చెప్ప బోతున్నాడు.

"కాదని యెవరన్నారు? " గొంతు పెంచి అడిగాను.

"అద్గదో అదేనండీ. ఎక్కడుంటున్నావు? ఏం చేస్తున్నావు? ఎందుకు తాగుతున్నావని పిచ్చి పిచ్చి పెశ్నలడుగొద్దండి. దీని అమ్మ ఇదిగో మా అత్తగారు. వీళ్లిద్దరికీ గట్టిగా బుద్ధి చెప్పండి మాస్టారూ!" మాటలు సరిగానే వస్తున్నాయి.

"ఇంతకీ తమరేం చేస్తున్నారో చెప్పనేలేదు" సిద్ధయ్య రెట్టించాడు. పైడితల్లి చూపులు అందరినీ తడిమాయి.

"నేనేం చేస్తున్నానని కాదండీ. నా పెళ్లాం సంపాదన నా చేతిలో పడాలిగదా! అదీ నా పాయింట్. అయినా మీరు కొత్తగా వచ్చారు గదూ!"

"అవును" నేనందుకున్నాను. "అయితే తమరేమీ చెయ్యరన్నమాట. ఏ పనీ చెయ్యకపోతే ఎలా? "

"నేనెందుకు చెయ్యాలండీ? " మకుటంలేని. మారాజులా ఫోజిచ్చాడు. "సరదాలు ఈ వయసులో కాకపోతే ఇంకెప్పుడండీ"

"ఆమె నీకు డబ్బులెందుకివ్వాలటా? "

"నా పెళ్లాం కాబట్టి" నవ్వబోయాడు.

"నువ్వు మొగోడివి కాబట్టి ఏదో పనిజేసి సంపాదన డబ్బులు తెచ్చి పెళ్లాం కివ్వాలి. ఛీఛీ... పెళ్లాం సంపాదన మీద ఆధారపడ్డ వాడో మొగుడేనా? " మొహమ్మీద ఉమ్మేసి నట్టు అన్నాను.

"అలా గడ్డిపెట్టవయ్యా క్రిష్ణమూర్తీ!" సత్తికొండకు ధైర్యమొచ్చినట్టుంది. "వీడు నాకు దూరపుబంధువు. దిక్కులేనోడు. వరుసకు అల్లుడు. పిలిచి పిల్లనిచ్చానయ్యా. మా ఆయన తీపిగుర్తు నా కూతురు. అతిగారా బంగా పెంచాను బాబూ"

"ఓయబ్బో పెంచావులే" పైడితల్లి లేచినుంచున్నాడు.

"మా పెళ్లై మూడేళ్లైందండీ. ఇంకా దీని కడుపునో కాయ కాయలేదండీ. నేనింకో పెళ్లి చేసుకోవాలంటే ముందు దీనికి ఇడాకులియ్యాలట. ఇదేమో ఇడాకుల కొప్పుకోనంటుంది. నేనెట్టా చచ్చేది? మీరే చెప్పండి న్యాయం" ధర్మపీఠమ్మీద కూచున్నట్టు దర్జాగా ఛాతీ విరుచుకున్నాడు.

గిరిజ సంసారములో సరిగమలు, పైడితల్లి బుర్రలో పదనిసలు. మాకంతా అర్థమైపోయింది.

"ఈ యెదవ పనికిమాలిన యెదవ నా కూతురు బతుకుల బండలేత్తున్నాడయ్యా" సత్తికొండ శోకాలు దీసింది. "నాకెవ్వలూ దిక్కులేరని వీడిట్టా రెచ్చిపోతున్నాడయ్యా..."

"ఈ సచ్చినోడు ఎన్నడూ సరిగా ఇంటికి రాడయ్యా. ఉజ్జోగముందిగాని పంజెయ్యడు. అందుకే ఉజ్జోగం ఊడబీకేశారండీ" గిరిజ ముందుకొచ్చింది. "చెప్పుకునేందుకే మొగుడు కానీ, సిగ్గిడిచి చెప్తున్నానన్నయ్యా... వీడు నాతో సంసారం చెయ్యట్లేదు. ఏ రోజూ పావలా పూలు తేలేదు. నా సంపాదనంతా లాక్కెళ్లి తాగి తందనాలాడ్తున్నాడు. ఎవత్తోనో కులుకుతున్నాడు. ఏ అర్ధరాత్రి దాటాకో ఇంటికొచ్చి మంచానికతుక్కుపోతాడంతే" వెక్కివెక్కి ఏడుస్తోంది. చెంపల మీద కన్నీటి ధారలు మెరుస్తున్నాయి.

"సిగ్గులేదూ! ఆడదాని ఉసురుబోసుకున్నవాడు అసలే బాగుపడడు. నువు మనిషివేనా? " సిద్దయ్యకు కోపమొచ్చింది.

"ఓయబ్బో... ఉసురు, కసురు అయినా పిలవని పేరంటానికొచ్చినట్టు మా సంగతి మీకెందుకంటా? " పైడితల్లి పళ్లు పటపటలాడాయి "నా పెళ్లానికీ నీకూ సంబంధమేమిటీంట!"

"ఓర్నీ దుంపదెగా! నోటికేదొస్తే అదేనా. ఇలారా" పైడితల్లి చెయ్యి బట్టుకుని మా గది లోకి లాక్కొచ్చి కూచోబెట్టాను. "చూడు పైడి తల్లీ! లక్షణంగా నీకు పెళ్లైంది. లక్ష్మీదేవి లాంటి భార్య ఉంది. బతుకు బాటలో నిజమైన సుఖాలనుభవించాలి గదా. దుర్మార్గుడైన ప్రతి భర్త భార్యను బెదిరించేందుకు విసిరే అస్త్రమిదే. కాని నువు దుర్మార్గుడివా? కాదు. బుద్ధిమంతుడివి. నీ భవిష్యత్తు గురించి నువ్వే బాగా ఆలోచించు. అందరి లాగా నీ సంసారం పచ్చగా ఉండాలని లేదా? నీ ఇల్లు పిల్లా పాపలతో కళకళలాడాలని లేదా? " ఆవేశాన్నదిమి పెట్టి అనునయంగా అడిగాను. సత్తికొండ, గిరిజ, సిద్దయ్యలు ఆసక్తిగా చూస్తున్నారు.

గోడకొరిగిన పైడితల్లి కొంచెం ముందుకొచ్చి సిద్దయ్యకు చేతులు జోడించాడు క్షమించమన్నట్టు. అతని మెదడు పొరల్లో ఏదో తిరుగుతున్నట్టుంది. "ఆయ్ ఎందుకు లేదండీ? ఉంది" మనిషికీ మనసుకూ మధ్య మాయపొరలా పేరుకుపోయిన కోపం కొండెక్కినట్టుంది.

"అయితే సంసారమనే బండికి రెండు చక్రాలు గదా? "

"ఆయ్. ఒకటి పెళ్లాం, ఇంకోటి మొగుడు" బేలగా బుర్ర గోక్కుంటున్నాడు.

"కరెక్ట్. నీకు చాలా విషయాలు తెలుసే" కాస్సేపు ఆకాశానికెత్తాను. పొగడ్తలకు లొంగనివారు ప్రపంచంలో ఎవరున్నారు? పైడితల్లి కళ్లల్లో పసిడి వెలుగులు దోబూచులాడుతున్నాయి. ఊడిపోయిన షర్టు బటన్స్ సర్దుకున్నాడు.

పిల్లలు లేని ఇల్లు పూలు లేని పూదోట లాంటిది. – బెన్‌జాన్సన్

"ఇప్పుడు నేనేం చెయ్యాలో చెప్పండి" కురుక్షేత్ర సంగ్రామంలో కృష్ణ పరమాత్మ ముందు మోకరిల్లి గీతబోధ వినేందుకు ఉద్యుక్తుడైన అర్జునుడయ్యాడు.

"మరి మా అన్న చెప్పినట్టు చేస్తావా? నీకు చేతనవుద్దా?" ఛాలెంజి పద్ధతిలో సిద్దయ్య అట్నుండి నరుక్కొస్తున్నాడు.

"అదేం మాటండీ! నేనేమన్నా చేత కాని దద్దమ్మనా? చేవ చచ్చిన వాణ్నా? ఛాలెంజండీ. ఛాలెంజి. మీరు చెప్పిందంతా చేసి చూపె డ్తాను... ఆc" మాటల్లో స్వాతిశయం.

"సిద్దయ్యా! పైడితల్లి మాట మీద నిల్చుండే మనిషి సుమా!" ఇంకాస్త పైకెత్తాను.

"ఏమో అన్నా! అనుమానమే!"

"యావండోయ్" పైడితల్లిలో రోషం పొడుచుకొస్తున్నట్టుంది" ఆడిన మాట తప్పని వంశమండీ మాది"

"వెరీ గుడ్" వీపు తట్టాను. "మొదట తాగడం మానెయ్యాలి. దాని వల్ల ఒళ్లు గుల్లవుతుంది. డబ్బులిచ్చి తద్దినం కొనుక్కున్నట్టే సుమా" సూటిగా చూశాను కళ్లలోకి.

"ఆయ్ బాబోయ్! పొడిచేశారండీ" కట్టుకున్న పెళ్లాం ఎదురింటి వాడితో లేచిపోయిన వార్త విన్నట్టు హడలిపోయాడు. మరికొన్ని మంచిమాటలతో శాంతపరచడం నావంతైంది.

"ఆయ్c... అది పైడితల్లికి చేతగాదన్నా" పైడితల్లి నుండి దూరం జరిగి సిద్దయ్య నా పక్కన కూచున్నాడు. "తాగుడుకు బానిస అయిన మనిషి తల్లెముంత అమ్ముకుంటాడు. ఏదీ దొరక్కపోతే పెళ్లాన్ని గూడా అమ్ముకుం టాడు. అంతేకాని తాగుడు మానడన్నో. అది చేతగాదు. అతన్నొదిలేయ్"

పైడితల్లి మొహంలో పౌరుషం తొణి కిసలాడింది.



**విశ్వనాథపై దూసిన నవ్వుల కత్తి**

విశ్వనాథ సత్యనారాయణ గురించి శ్రీశ్రీ ప్రసంగించాల్సి వచ్చింది. సభలో విశ్వనాథతో పాటు అనేకమంది సాహితీవేత్తలు కవులు ఉన్నారు. అంతా విశ్వనాథను ఎడాపెడా పొగి డేస్తున్నారు. శ్రీశ్రీ వంతు వచ్చింది. ఆయన లేచి

'విశ్వనాథ దేశంపట్టని కవి'అన్నారు.

విశ్వనాథ భక్తులు ఇతర అభిమానులు నిర్ఘాంతపోయారు. కొందరు కొరకొర చూచారు. అది గమనించి శ్రీశ్రీ-

"అవును.. కవిగా విశ్వనాథ దేశంకన్నా మిన్న.. చాలా విస్తారమైనవాడు" అన్నారు. అంతే చప్పట్లే చప్పట్లు..

'దేశం పట్టని' పదంలోని శ్లేష.. శ్రీశ్రీ కొంటె తనం మిగిలిన వారి పెదాలపై చిరునవ్వులు పూయించింది.

"ఎందుకు చేతకాదండీ? దానికి నేనేమన్నా బానిసనా? ఇప్పుడు వినండి" చెయ్యి నెత్తిమీ దుంచుకుని "సచ్చ పెమాణికంగా చెప్తున్నా ఇప్పట్నుంచి తాగుడు మానేత్తన్నానండీ. ఇహ దీని జోలికి పోనంటే పోను"

ప్రమాణం చేశాడు. మాక్కావాల్సింది అదే గిరిజ, సత్తికొండ మొహాల్లో వెలుగు రేఖలు విచ్చుకుంటున్నాయి. సంతోషంగా మొహాలు చూసుకున్నారు.

"వెరీ ఫైన్" సిద్దయ్య షేక్‌హాండిచ్చాడు"

తర్వాత నువు మళ్లీ ఉద్యోగంలో చేరాలి. రోజూ డ్యూటీకి సరిగ్గా వెళ్లాలి. లేకపోతే నడ్డి విరిగిపోద్ది. జాగర్త" బెదిరించాడు.

"ఆయ్. నెలనెలా జీతం మొత్తం తెచ్చి గిరిజ చేతికిస్తా. ఆ తర్వాత నా ఖర్చుల కోసం అడుక్కుంటా"

"ఖర్చులంటే? "

"కాఫీ ఖర్చులండీ. ఎంతైనా మొగోణ్ని గదండీ. జేబులో చిల్లర డబ్బులు లేకపోతే చిల్లర మనిషనుకుంటారు గదండీ"

"అవునవును." నాకింకో సంగతి గుర్తుకొచ్చింది. "రోజూ డ్యూటీ ఐపోగానే నేరుగా ఇంటికి రావాలి. సినిమాలకు షికార్లకు వెళ్లాలంటే గిరిజతో కలిసి వెళ్లాలి. ప్రతి పండగకు ఈ ఇంటికి సతీసమేతంగా రావాలి. అప్పుడప్పుడు మీ అత్త గారిని మీ ఇంటికి తీసుకెళ్లాలి"



"ఆయ్... ఇయన్నీ అక్షరాలా పాటిత్తానండీ" చేతులు జోడించాడు. బోధివృక్షం నీడలో జ్ఞానోదయమైన బుద్ధ భగవానుని వాలకంలా- పైడితల్లి కళ్లు నిర్మలంగా కనిపించాయి.

"గిరిజా" ఇప్పట్నుంచి నువు గీసిన గీత దాటనే!!" లేచి గిరిజ చెయ్యందుకుని కళ్లకద్దుకున్నాడు. "ఇహ మనం మనింటికెళ్దాం పదా!!" బతిమాలుతున్నట్టు మొహం పెట్టాడు.

తనముందే గొప్ప అద్భుతం జరిగినట్టు సత్తికొండ భృకుటి విచిత్రంగా పీటముడేసుకుంది. "అమ్మనాయనోయ్! ఉన్నపళంగా ఎటు తీస్కెల్తావయ్యా?" చెయ్యి గుండెల మీదుంది.

"ఇక్కణ్నుంచి సినిమాకెళ్తాం. అట్నుంచటే మా ఇంటికెల్తా మత్తా"

సత్తికొండ అనుమానం చూపులు మావైపు మళ్లాయి. భయపడాల్సిన అవసరంలేదని సైగతో చెప్పేశాను.

"భోంచేసి వెళ్లండి. సినిమాకింకా టైముందిగదా!" అంటూ సత్తికొండకు సైగచేశాను.

"మీరు కూడా ఈ పూట నాచేతివంట తినాలి. తప్పదు క్రిష్ణమూర్తీ" బతిమాలుతూ ఆదేశించింది.

"అవునన్నయ్యా! అందరం కలిసి సరదాగా భోంచేద్దాం" గిరిజ అడగడంలో ఆప్యాయత వ్యక్తమైంది.

తల్లీకూతుళ్ల విన్నపాన్ని కాదనలేకపోయాం. తల్లీ కూతుళ్లు వంటగదిలోకెళ్లారు. ఓ గంటసేపట్లో వంటయింది. అంతదాకా పైడితల్లి తమ ఫ్యాక్టరీ విషయాలు చెబుతున్నాడు. మేము వింటూ కూచున్నాం. భోజనాలవగానే పైడితల్లి- గిరిజ చేతిలో చెయ్యేసుకుని నవ్వుతూ వెళ్లిపోయారు.

గుండెల నిండా ఊపిరి పీల్చుకుంది సత్తికొండ. మావైపు కృతజ్ఞతగా చూస్తూ...

"ఏదో మీ మాటల పుణ్యాన అల్లుడుగారు బాగుపడితే అన్నవరం సామికి ఐదు టెంకాయలు కొడ్తానయ్యా" గాల్లోకి చేతులెత్తి దండం పెట్టింది.

సాయంత్రం సత్యనారాయణ ఫ్యామిలీతో దిగాడు. కాకినాడ నుండి అనకాపల్లి దగ్గరే కాబట్టి ముందుగా రాగలిగాడు. అర్ధాంగి రోహిణిని, ఏడేళ్ల కొడుకు రామారావును పరిచయం చేసి మమ్మల్ని తమలో కలుపుకున్నాడు.

★ ★ ★

అటు తెల్లవారిందో లేదో ఇటు మెలకువ వచ్చింది. కిటికీలోంచి ఆకాశం నిర్మలంగా

కనబడింది. తూరుపు దిక్కు అరుణ వర్ణం సంతరించుకుంటోంది. అప్పుడే మిగతా ముగ్గురు మిత్రులు సకుటుంబ సమేతముగా ప్రత్యక్షమయారు. గాజుల గలగలలు, కాలి అందియల ఘల్లుఘల్లు సవ్వడులతో ఇంటికి కొత్తకళ వచ్చింది. అందుకే అన్నారేమో- మట్టెల సవ్వడి లేని ఇల్లు- మరుభూమితో సమానమని.

పరిచయం లేని ఆడవారిలో మాట్లాడా లంటే బెరుకుదనం... కరుకుదనానికొస్తుంది. కాని... ఒకే ఇంట్లో ఉన్నాంగదా... మాట్లా డక తప్పదు. నీళ్లకోసం కుళాయి వద్ద కెళ్లాను. అప్పటికే నలుగురు ఆడవాళ్లున్నార క్కడ. ఒకరి తర్వాత ఒకరు నీళ్లు నింపుకుం టున్నారు. చేతిలో ఖాళీ బకెట్టుతో ఐదారు నిమిషాలు నిలబడి ఉన్నాను. నా ఉనికి నెవ్వరూ గమనించినట్టులేదు. ఎవరినెలా పలుకరించాలో అర్థంగాక చిన్నగా దగ్గాను. రోహిణి ఒక్కతే నావైపు చూసింది.

"నీళ్లు పట్టుకుంటారా అన్నయ్యా? " ఆప్యా యంగా అడిగింది.

"అవునమ్మా. క్లాసుకెళ్లాలిగదా!"

"మావారు గూడా వెళ్లాలి" శ్రీమతి కాశీ నాథ్ అంది.

"పాపం! ముందు అతణ్ని పట్టుకెళ్లనివ్వం డమ్మా" సత్తికొండ ఆదేశం. నలుగురూ ఒకే సారి పక్కకు తప్పుకున్నారు. అప్పటికే సిద్ధయ్య స్నానమైపోయింది. గడపలోంచి నా అవస్థ గమనిస్తున్నాడు. నీళ్లు పట్టుకెళ్లి గబగబా స్నానం ముగించాను. అన్ని సంవ త్సరాలు అర్ధాంగి సేవలకలవాటుపడ్డ ప్రాణం ఉసూరుమంది. ఆరునెలలు ఎట్లాగ డుస్తుందో ఏమో!

మధ్యాహ్నం క్లాసునుండి రాగానే ఆ ముగ్గురు ఆడవాళ్లను సత్తికొండ మాకు పరిచ యంచేసి

"వీళ్లిద్దరూ పెళ్లైన బ్రహ్మచారులమ్మా. మీ అన్నయ్యలనుకోండి" అంది- ముసిముసిన వ్వుతో.

ముగ్గురి దృష్టి మూడు రకాలుగా తోచింది. సత్తికొండ కలగలుపుతనం నాకెంతో నచ్చింది.

"ఇంతవరకు ఒంటరిమొగాళ్లకే రూములు అద్దెకిచ్చాను. ఫ్యామిలీకివ్వడం ఇదే మొదలు. కాస్త జాగర్తగా మసలుకోండమ్మా" సుతిమె త్తని మాటల్తో తన బయోడేటా కొంత ఏక రువు పెట్టింది.

మధ్యాహ్నం జంటగా ఉన్నవాళ్లనొదిలేసి ఒంటరిగాళ్లం హోటల్‌కు పరుగెత్తాం. అటు భోజనమవగానే ఇటు ఏ.సి. థియేటర్ స్వాగతం పలికింది. కొత్త సినిమా పాలు-పం చదారలా గ్లామరస్ హీరో- బ్యూటీఫుల్ హీరో యిన్ల కాంబినేషన్ వెంటనే చొరబడ్డాము.

సాయంత్రం ఇంట్లో అడుగుపెట్టామో లేదో "అలా వాకింగ్ కెళ్లొద్దాం పదండీ" సత్యనారా యణ ప్రపోజల్. మాతోపాటు మిగతా మిత్రులుగూడా కదిలారు. పార్కు పచ్చదనం మా ముచ్చట్లు పిచ్చాపాటి కబుర్లు రెండు గంటలక్కడే గడిచాయి. నలుగురు జంటగాళ్లు నేరుగా ఇంటికి వెళ్లారు. ఇద్దరం ఒంటిగాళ్లం హోటల్ కోసం ష.రా. మామూలే. ఇంటికిచే రేసరికి తలుపు వేసుంది. అంతా నిద్రలోకి జారుకున్నట్టుంది. సత్తికొండనే తలుపు తీసింది. "అట్లా హోటల్లో పూట గడిపి ఆకలి చల్లార్చుకుంటే డబ్బు దండగ. జబ్బులకు హేతువు" అంది ముంగురులు సవరించు కుంటూ.

"ఒంటిగాళ్లకు వంట ఒకతంటా" సిద్దయ్య తాళం తీస్తూ కూనిరాగంతో కొట్టిపారేశాడు. మాకది కుదరదు పొమ్మంటూ.

"ముందుకు వస్తే అబ్బాయా, ముద్దుగ కుదురునులేవయ్యా" నేనేమీ తక్కువ తిన్నానా అన్నట్టు తానూ రాగమందుకుంది. "అదో బ్రహ్మవిద్య కాదయ్యా... కుర్రోడా," అడుగులో అడుగేసుకుంటూ, తిరిగి చూడకుండా తన గదిలో కెళ్లిపోయింది.

"అబ్బో సత్తికొండ భావుకురాలే. భావాల వెంట పరుగెత్త గలిగే భాష ఉంటే గొప్ప కవ

యిత్రి అ...యిుండేది గదా సిద్దయ్య"

"అవునన్నా"

మర్నాడు క్లాసులో ఏ,బిసి,డి నాలుగక్షరాల కోడ్ కంఠతా ఒప్పజెప్పాలన్నాడు ఇన్‌స్ట్రక్టర్. మేమంతా గుడ్లు తేలేశాం. అలా అడుగుతాడని ఎవ్వరూ ఊహించలేదు. ఇన్‌స్ట్రక్టర్ మొహం విచిత్రంగా మారింది.

"ఇదేమి విచిత్రమండీ. ఒక్కరంటే ఒక్కరు గూడా ఒప్పజెప్పలేరా? అంతా ఇంతేనా హరి హరీ"

నాలో రోషం పొంగింది. లేచి గొంతు సవరించుకున్నాను. "కడ, కట్టు ఏ. కట్టు కడకడ కడ బి ఆc ఆc" బండి ఆగిపోయింది. ఎంత ప్రయత్నించినా, సి. కోడ్ గుర్తుకు రాలేదు. ఇన్‌స్ట్రక్టర్ మొహం వివర్ణమైంది.

"ఓ.. కే ఇంకెవరన్నా ఉన్నారా? "

అనంతపురం వేణుగోపాల్ స్ప్రింగ్‌లా లేచి నుంచున్నాడు. నాలాగే ఏ,బిల కోడ్ అప్పజెప్పి సి. కోడ్ కోసం తంటాలు పడుతున్నాడు.

"భలే విచిత్రంగా ఉందే" అంటూ కూచున్నాడు.

"మీరంతా ప్రభుత్వోద్యోగులు" ఇన్‌స్ట్రక్టర్ కుర్చీలోంచి లేచొచ్చి టేబుల్ అంచున కూచున్నాడు. "ప్రభుత్వం జీతాలిస్తూ మిమ్మల్ని ట్రెయినింగ్‌కు పంపించింది. ఇది జాబ్ ఫర్ ఓరియెంటెడ్ ట్రెయినింగ్ అని ముందే చెప్పాను గదా!' మందలింపులు, బెదిరింపులు సాగిపోయినై.

ఛీఛీ! ఇంత బతుకు బతికి ఇంటెనక చచ్చినట్టు పెద్దాయనతో మాటలు పడాలా! మేమంతా సిగ్గుతో కుంచించుకుపోయాము. మరో రెండు అక్షరాల కోడ్ బోర్డుమీద రాసి ఆరింటి కోడ్ మర్నాడు ఒప్పజెప్పాలన్నాడు. ఇంటర్వెల్‌లో కొందరు మిత్రులు కలిసి చెప్పారు. ఇన్‌స్ట్రక్టర్‌కు చాలామంది ఊళ్లకు వెళ్లొచ్చారని.

"ఓకే నిజం నిలకడమీదైనా తెలిసింది" నవ్వేశాడాయన.

ఇంటికొచ్చేప్పుడు దారిలో సత్యనారాయణకు గుర్తుకొచ్చింది.

"మా అబ్బాయిని స్కూల్లో చేర్పించుమన్నాను. మాఆవిడ చేర్పించిందో లేదో!" మాతో అన్నాడు. ఇంటికొచ్చాక తెలిసింది సత్యనారాయణ శ్రీమతి రోహిణికి తోడుగా సత్తికొండ వెళ్లి రామారావును బడి ప్రవేశం చేయించి వచ్చిందని. అదేమి చాకచక్యమో, మాటకారితనమో గాని వారం తిరక్కుండానే మా కుటుంబ వివరాలన్నీ చెప్పించుకుని కొత్త మనుషుల్ని పాతమనుషులుగా మార్చేసింది.

మధ్యాహ్నం గదిలో కూచుండి కోడ్ ప్రాక్టీసు చేస్తున్నాం. బయట మబ్బు విడిచిన ఎండ- తళుకుబెళుకులు చూపిస్తోంది. మేము మాటిమాటికి కాపీలు తెరిచి చూస్తున్నాం. మా గదిలో కెప్పుడొచ్చిందో ఏమో సత్తికొండ బుగ్గలు నొక్కుకుంటూ

"ఆ మాత్రానికే అన్నిసార్లు కాపీ తెరచిచూడాలా? " చిన్నపాటి ఛాలెంజి నవ్వు విసిరింది. సిద్దయ్యకు చిర్రెత్తినట్టుంది.

"టెలిగ్రాపు కోడంటే టమాటాలు తరుగుడుకాదు. వంటింట్లో వంట చెయ్యడమూ కాదు" మిగతా నలుగురు మిత్రులు మాగదిలోనే ఉన్నారు.

"అలాగా!" సత్తికొండ కళ్లు చక్రాల్లా తిరిగాయి. కనుగుడ్లు గచ్చకాయల్లా ఎగిరి నిల్చుండిపోయినై" టమాటాలు తరగడం కాకపోతే మీసాలు కొరగడమా? "

పాపం! సిద్దయ్య అంతకుముందే నున్నగా షేవ్ చేసుకున్న పేడిమూతిని తడుముకున్నాడు. సత్తికొండకు జవాబివ్వలేక మౌనం చిత్తగిస్తాడనుకున్నాం గాని అతని కనుబొమలు అలవోకగా ఎగిరి పడ్డినై. పెదాలమీద చిరునవ్వు వెలిగింది.

"ఏదీ ఓ పది అక్షరాల కోడ్ చెప్పు... చూద్దాం" సవాలు విసిరాడు.

"ఆయ్ ఐతే విను "కొంగునడుముకు దోపుకుని గొంతు సవరించుకుంది. ఏ నుండి జడ్ దాకా కోడ్ గడగడా ఒప్పజెప్పింది. "అంకెలు గూడా ఒప్పజెప్పనా!"

ఆరుగురి మొహాల్లో ఆనందం, ఆశ్చర్యం తాండవించింది.

'అసలూ ఆ అంకెల కోడ్ మాకొస్తే గదా" రాజయ్య ఠపీమని అనేశాడు.

"హమ్మ నా సత్తికొండా! ఇవన్నీ ఎప్పుడు నేర్చుకున్నట్టూ? " సిద్దయ్య గుండెలు బాదుకున్నాడు.

"ఇవన్నీ ఎలా కంఠోపాఠమైనాయో!" సత్యనారాయణ సంతోషం.

"మీకప్పుడే చెప్పాను గదా... మా ఇంట్లో అద్దెకు దిగేది ఎప్పుడూ టెలిగ్రాఫ్ ట్రెయినింగ్ వాళ్లేనని. ఎన్నో బ్యాచులొచ్చిపోయాయి. వాళ్లు వల్లెవేస్తున్న కోడ్ వినీవినీ నాకు కంఠోపాఠమైంది. అంతేనయ్యా సిద్దులసామీ!" సత్తికొండ గుండెలనిండా నవ్వుతూంటే అవయవాలన్నీ కదిలిపోతుంటే చూడముచ్చటగా ఉంది.

"ఓహో గదా సంగతీ! తినగతినగ వేప తియ్యనుండు అన్నారు గదా! అన్నిసార్లు వింటే నాగ్గూడా వచ్చేస్తుందిలే" సిద్దయ్య ఓటమిని అంగీకరించలేదు.

"చాల్లే బడాయి" సత్తికొండ చేతులు తిప్పుతోంది. "లడాయి మొగుడా కొండకు తీసుకెళ్ళురా అంటే... ఆ బండరాళ్లు మనకెందుకులే అన్నాట్ట ఎవడో సన్నాసి యెదవ"

"నేను మాత్రం సన్నాసిని కాదు. సంసారినిలే" సమర్థించుకున్నాడు సిద్దయ్య

అంతా హాపీగా నవ్వుకున్నాం.

"వినీ వినీ సత్తికొండకే ఒంటబట్టింది. వల్లె వేస్తే మనకెందుకురాదూ? "అనేశాను నవ్వాపుకుని.

"అవునన్నా... ఎందుకు రాదు. వచ్చి తీరుతుంది" సిద్దయ్య సీరియస్‌గా అన్నాడు. అతని పట్టుదల మమ్మల్ని ఉత్తేజపరిచి నూతన శక్తిని ప్రసాదించింది.

"ఓ పట్టు బడదాం. రోజూ బట్టీబడదాం' ' ఆనందం అందుకున్నాడు. "ఇంకోవారం రోజులల్ల అంతా వస్తుంది. మనమేమీ బాధ పడొద్దు"

గురుకులంలో విద్యార్థులు సంస్కృత శ్లోకాలు వల్లెవేసినట్లు- మా కోడ్ అభ్యాసం ఊపందుకుంది. వారం రోజుల తర్వాత క్లాసులో టకటకా ఒప్పజెప్పేశాం.

ఇరుగుపొరుగు వారితో పరాకులు- చిరాకులు ప్రాణాలు తోడేస్తాయి. కొద్దిపాటి ఇంగిత జ్ఞానం కలుపుకుపోతే కలివిడిగా ఉంటామంటుంది. కుళాయి వద్దనో, మరో చోటనో ఆడవాళ్లతో స్వేచ్ఛగా మాట్లాడుతున్నాం. నాలుగుసార్లు కలిసి మాట్లాడితే వారు వీరైతారన్నట్టు, కొద్ది రోజుల్లోనే కొత్తవాళ్లంతా పాతవాళ్లయ్యారు. రోహిణి మాత్రం సోదరిలా, అన్నయ్యా అంటూ ఆప్యాయంగా మాట్లాడ్తుంది. నన్నూ, సిద్దయ్యనూ సొంత చెల్లిలా పలుకరిస్తూంటే ఇది ఏనాటి అనుబంధమో అన్పించింది. వాళ్ల సుపుత్రుడు చిన్నారి రామారావు మామయ్యా అంటూ మాటిమాటికి మా గదిలోకి పరుగెత్తుకొస్తున్నాడు. మా గదిలో వాడికి... పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నాయి. ఎన్టీ రామారావులా ఫోజిచ్చి వచ్చీరాని అచ్చతెలుగులో డైలాగులు చెబుతుంటే మరీ మరీ వినాలన్పిస్తోంది.

ఆదిలాబాదు ఆనందం భార్య, కరీంనగర్ రాజయ్య శ్రీమతి ఇద్దరూ హైదరాబాదులో పుట్టి పెరిగారట. బంగారానికి వెలిగారములా వాళ్లిద్దరి పరిచయం స్నేహంగా మారింది. సాన్నిహిత్యానికి దారితీసింది. కూరగాయల మార్కెట్‌కు, షాపింగ్‌కు కలిసి సరదాగా వెళ్తున్నారు. నిజామాబాదు కాశీనాథ్ భార్య పూజలు పునస్కారాలతో తనలోకములో తానుంటుంది. వారూ, వీరని తేడా లేకుండా అందరినీ పలుకరించి గలగలా మాట్లాడ్డం- సత్తికొండకు వెన్నతో పెట్టిన విద్యలాగుంది.

శనివారం మధ్యాహ్నం క్లాసునుండి రాగానే కాపీలు రూంలో పడేశాం. హోటల్లో సుష్టుగా భోంచేసి, రిలీజైన కొత్త సినిమా ఫస్టు రోజు, ఫస్ట్‌షోకెళ్లాలని బయలుదేరబోతున్నాం.

"క్రిష్ణమూర్తి బాబూ! రేపు గూడా హోటల్

భోజనమేనా? ” దారికడ్డంగా నుంచుని అడిగింది సత్తికొండ.

“రేపు మా ఇంట్లో భోంచేస్తారు. కదన్నయ్యా!!” రోహిణి ప్రస్తావించింది. నిజమా! అన్నట్టుగా చూశానామె వైపు

“ఎందుకమ్మా మీకెందుకు శ్రమా? ”

“అవన్నీ ఎందుగ్గానీ, నేనో మాట చెబుతాను, వింటారా!” సత్తికొండ చేతులు నడుమ్మీదున్నాయి. ఏదో కొత్త కార్యక్రమం చేపట్టబోతున్నట్టుంది. తాళం వేసొచ్చిన సిద్ధయ్య గదివైపు చూస్తూ “సత్తికొండ మాట, చద్దన్నం మూట” నాకూ, సత్తికొండకు మధ్యలో ఆగిపోయాడు.

“ఆహా నా బంగారమే” సిద్దయ్య తల చుట్టూ చేతులు తిప్పి మెటికలు విరుచుకుంది. “ఆ మాటన్నావు బాగుంది. బుల్లోడా! రేపట్నుంచి మీరు వంట చేసుకోవాలి అంతే. స్వయంపాకమే స్వర్గలోకము, సొంత చేతి వంటనే అమృతము... కదా!” దీర్ఘం తీస్తూ అడిగింది.

“స్వయంపాకం, స్వర్గలోకమా! కోతలెందుగ్గాని... అండగా హోటలుండగా, వంటెందుకు ఇక దండగ” అన్నాడో కవి. సిద్ధయ్య మూతి తిప్పేశాడు.

“అది కయిత్వంకాదు, పైత్యము. వంటచేసి చూడు ఇంటి తిండి తిని చూడు మన్నారెవరో...”

“అంటే వంటకుదరక పోతే వరుసగా ఉపవాసాలు చేసి వైకుంఠానికెళ్లాలనా? ”

“శుభం పలకరా పెళ్లికొడకాంటే, మరేదో అన్నాడట”

“కాదయ్యా ఆరు జిల్లాల అందగాడా”

“మరేందటా కాకినాడకుందనబొమ్మా...”

“హోటల్ తిండి, ఆరోగ్యానికి గండి, ఒళ్లు గుల్ల డబ్బు చెల్లు... జబ్బు సొంతం చిన్నాడా ఓ చిన్నోడా” సత్తికొండ చేతులు తిప్పుతూ ఆశుకవిత్వం చెప్పేసింది. చిన్నప్పుడు అక్షరాలు, గుణింతము, పెద్ద బాలశిక్ష చదివానని చెప్పిందోసారి. ఆ మాత్రం చదువుకే ఇంత ఉంటే, బాగా చదివితే ఇంకెంత కవిత్వం ఒప్పచెప్పేదో!

నాకైతే సత్తికొండ సలహా కొట్టిపారెయ్యాలన్పించలేదు. రోజూ పొద్దు పొడవకముందే నిద్దుర లేస్తేనే... ఉదయం ఏడుగంటలకల్లా ఉండగలుతున్నాం. ఇంకొంచెం ముందేలేస్తే వంటగూడా చేసుకోవచ్చు కానీ... అంత పొద్దున అన్నం తినడం నాకు అసాధ్యమేనేమో! ఒకవేళ అలవాటు చేసుకున్నా మధ్యాహ్నం ఒంటిగంటకు మళ్లీ అవురావురుమంటుంది. అప్పుడు వంట చేసుకునే ఓపిక గానీ ఆకలికేకలకు తట్టుకునే శక్తిగానీ ఉండక పోవచ్చు. విధిలేక మళ్లీ హోటల్‌వైపు పరుగెత్తాలి. అదే విషయం చెప్పాను. ఓ నిమిషం ఆవిడ చూపులు మమ్మల్ని కొత్తగా తడిమాయి.

“అదికాదు క్రిష్ణమూర్తీ”

“ఏది కాదటా” సిద్దయ్య అందుకున్నాడు. ఆకలి దంచేస్తోంది. పదన్నా!” కడుపు నిమురుకున్నాడు.

“దంచేందుకు నీ కడుపులో ధాన్యముందా? ” సత్తికొండ రాజీ పడలేదు. కొంగు నడుముకు బిగించి కదలబోతున్న సిద్దయ్య నాపేసింది. “కనీసం ఆదివారంనాడన్నా వంట చేసుకొండయ్యా. మిగతా రోజుల్లో మీ ఇష్ట ప్రకారమే” రాజీ ఫార్ములా ప్రతిపాదించింది.

“ఇదేదో బాగానే ఉందే!” అనేశాను సిద్దయ్యకు సైగచేస్తూ. అతని చూపులో క్షణం శూన్యంలోకెళ్లాయి.

“సరే సత్తికొండ మాట వరాల మూట అనుకుందామిప్పుడు” ముందుకు కదలబోయాడు.

అతని మొహ్మామీద అరచేతులుంచి తీసి, నవ్వుతూ మరోసారి మెటికలు విరిచింది.

చదువు మనిషికి నిండుతనాన్ని ఇస్తుంది. రచన అతడిని అసలైన మనిషిగా తీర్చిదిద్దుతుంది. – ఫ్రాన్సిస్ బేకన్

"అయితే మీరు త్వరగా రండి. సరుకులు తెచ్చుకోవాలి" అర్డరేసింది. సరేనన్నాను.

"మరి రిలీజైన సినిమా ప్రోగ్రాం కాన్సిలా? " సిద్ధయ్య అన్నాడు.

"సినిమాదేముందన్నయ్యా, చాలా చూశారు గదా!..." రోహిణి సముదాయింపు మనసును కదిలించింది. సిద్ధయ్య గూడా "సరే తల్లీ" అనేశాడు.

ఇంకేం సినిమా ప్రోగ్రాం కాన్సిలయింది. హోటల్‌నుండి రాగానే మమ్మల్ని బయలు దేరమని తానూ వెంట వచ్చింది. సత్తికొండ వంట సామాగ్రి, సరుకులన్నీ కొనిపించింది.

ఆదివారం ఉదయం నుండే రోహిణి మమ్మల్ని కట్టడి చేసింది. "మీరీ రోజు హోటల్లో అడుగుపెట్టొద్దన్నయ్యా!" అంటూ కాఫీ అందించింది.

వెళ్లింది టెలిగ్రాఫ్ ట్రెయినింగ్‌కైనా మేమంతా పోస్టల్ పక్షులమే గదా! అంతకు ముందు రోజు క్లాసులో డిపార్ట్‌మెంటల్ రూల్స్ గురించి చర్చ జరిగింది. నేనోసారి ఇన్స్‌పెక్టర్ పరీక్షకు చదివాను... కాబట్టి వారి అనుమానాలన్నింటికి జవాబివ్వగలిగాను. ఆ క్షణం నుంచి నేను సత్యనారాయణ పాలిట గురువునైపోయాను.

"శుభం గురూగారూ! ఇంటివంట ఒంటికి మంచిది గదా... వారానికోసారన్నా ఇలా కానివ్వండి" మమ్మల్ని ప్రోత్సహించాడు. సిద్ధయ్య పుణ్యమాని కూరగాయలు సంచీ లోంచి బయటపడ్డినై. ఇహ తప్పదు గదా! కత్తి అందుకుని వాటిని ముక్కలు చేయడం ప్రారంభించాను. ఉదయమే మా కోసం రోహిణి పెరుగు కొనిపెట్టింది. సత్తికొండ, రోహిణి మాపాలిట వంటగురువులై పోయారు. స్వయంపాకం వంటకాలు బాగున్నాయి. విందు భోజనంలాగన్పించింది.

అందుకే అన్నారేమో స్వతంత్రము స్వర్గలోకమని, దేని పస అయినా స్వయంగా అనుభవిస్తేగాని తెలియదు. ఆలనా పాలనా లేని పిల్లాడికి అన్నీ సమకూరినంత సంతోషమైంది.

"ఇది బాగుందన్నా. హోటల్‌లో సర్వర్లు పెట్టిందే తినాలి. ఇక్కడ మనిష్టం. కోరుకున్నవి వండుకుని తినొచ్చు" సిద్ధయ్య సంతృప్తి వెలిబుచ్చాడు. అంతటితో ఆగకుండా.

"సత్తికొండా! నువ్వు కూడా మావంట రుచి చూడు" గర్వంగా ఆహ్వానించాడు. క్షణం గూడా ఆలస్యం చెయ్యలేదు.

"ఆయ్ సిద్ధులూ!" అంటూ వచ్చి కూచుంది సత్తికొండ. "రుచి చూడ్డమేవిటీ ఉన్నదంతా లాగించేస్తా... తే... వడ్డించు" దర్జాగా సర్దుక్కూచుని ప్లేటు ముందుంచుకుంది. సిద్ధయ్య మొహము చింపేసిన విస్తరిలాగైంది. నిజానికి పాత్రలో ఏమీ మిగలలేదు. నాలిక్కరుచుకుని

"నేను బజారుకు పొయ్యొస్తా"నంటూ జారుకోబోయాడు.

"అదేం కుదరదు అయ్యగారూ!" కుడి చేత్తో అతని ఎడమచెయ్యి పట్టిలాగి ఎడమ చేత్తో ఖాళీ గిన్నెలు చూపించింది. "ఉన్నదంతా ఊడ్చిపారేసి నన్ను భోజనానికి పిలుస్తావా నీ సంగతి నాకు తెలీదా" కళ్లు, చిత్రంగా తిప్పేసింది.

సిద్ధయ్యతోపాటు నాకూ సిగ్గనిపించింది. "ఏదో తమాషాకు పిలిస్తే, వచ్చి కూచుంటావని నాకేం దెల్సు" సిద్ధయ్య రుసరుసలో రోషముంది.

సత్తికొండ గలగలా నవ్వింది. ఆ నవ్వు శుభ్రజ్యోత్స్న లాగుంది. సత్యనారాయణ - రోహిణిలు వచ్చి విషయాన్నర్థం చేసుకొని వాళ్లూ నవ్వారు. మేమూ శృతికలిపాం.

మరో ఆదివారం మా చేత గోంగూర పచ్చడి చేయించింది సత్తికొండ. రుచి అమోఘం. అది కొన్నివారాలపాటు ఉపయోగపడుతుంది. ఏది ఉన్నా లేకున్నా గోంగూర పచ్చడి కామనైపోయింది.

రోజు రాత్రి మేము ఆరుగురము మా గదిలో కూచుని లోకాభిరామాయణం, జోకాభిరామాయణంతో టైంపాస్ చెయ్యడం అల

వాటైంది. మాతో పాటు సత్తికొండ గూడా వచ్చి చేరుతుంది. అందరి మనస్తత్వాలను అవలీలగా చదివేసిన సత్తికొండ మిత్రులు ఐదుగురిని పంచపాండవులుగా మార్చేసింది. అందులో సిద్దయ్య అర్జునుడు, నేను శ్రీకృష్ణుడినట.

"ఈ సరదా పేర్లు మగరాయుళ్లకు మాత్రమే పరిమితము. ఆడవాళ్ల ప్రసక్తి రావద్దు సుమా!" హెచ్చరించింది.

మూడు వారాల్లో టెలిగ్రాఫ్ కోడ్ మొత్తం వచ్చేసింది. ఆ తర్వాత మోర్స్ యంత్రం ముందు కూచుండి ప్రాక్టీసుకు శ్రీకారం చుట్టాం. అక్షరాలను మోర్స్ మీద ప్రాక్టీసు చేయించే ముందు కుడిచెయ్యి మణికట్టు, వేళ్లు ఫ్రీగా ఆడేట్టు ఓ పద్ధతి ప్రకారం ప్రాక్టీసు సాగింది. నెలరోజుల్లో అక్షరాలు, అంకెలు మోర్స్‌మీద ప్రయోగించి కొట్టడం అర్థమైంది. ఇన్‌స్ట్రక్టర్ ముందు మాస్టర్‌కీ. మా ముందు



మామూలు యంత్రం, కీ. మానవాళి మహో న్నతి కోసం మహనీయుల తపస్సులో భాగంగా ఈ కోడ్‌ను శామ్యూల్ మోర్స్ అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టాడు. సర్వేజనాస్సుఖినోభ వంతు అంటూ తన తపోఫలాన్ని లోకానికం దించాడు. అందుకే ఆ కోడ్ అతని పేరనే నిలిచిపోయింది.

థిరిటికల్ క్లాసులో మొదటి రోజు తెలిసిన విషయమది. మెదడు గూటిలో కోడ్ శాశ్వ తంగా నిక్షిప్తమైపోవాలి. లేకపోతే అనర్థం జరిగిపోతుంది.

అటు కుటుంబ భారాన్ని మోస్తూ, ఇటు కొత్త విద్య నేర్చుకోవడమంటే జోడుగుర్రాల స్వారీ చేయడమే. స్వారిలో ఏ గుర్రం కాస్త వెనకబడినా మనిషి స్వాహా ఐపోతాడు. మా పరిస్థితీ అదే. కాకినాడ ఖర్చుల్ని భరిస్తూ నెల జీతం రాగానే ఇంటికి మనియార్డరు పంపితీ రాలి. అమ్మా- నాన్నలు, ఇల్లు-ఇల్లాలు, పిల్లలు యోగక్షేమాలు కనిపెట్టకపోతే సంసారసాగ రంలో సుడిగుండాలెదురౌతాయి. ఇటు చదువు మీద దృష్టి కేంద్రీకరించకపోతే భవి ష్యత్తు చట్టుబండలైపోతుంది. ఆర్థిక వనరుల విషయంలో గూడా అంతే. ఆదాయాన్ని దృష్టిలో ఉంచుకుని ఖర్చుల్ని నియంత్రించి తీరాలి. బతుకు బాటలో ముందు లభించ బోయే ఫలాల కోసం ఇలాంటి ప్రాయోప వేశం కష్టమనిపించినా ఇష్టమే.

ఈ టెలిగ్రాఫ్ ట్రైనింగ్‌లో పాసైపోతే టెలి గ్రాఫ్ మాస్టర్‌గా పనిచేయవచ్చు అదనపు ఇంక్రిమెంటుతో పాటు లేట్‌ఫీ డ్యూటీ (ఆఫీ సులో రెగ్యులర్ డ్యూటీ తర్వాత అదనపు టెలిగ్రాఫ్ డ్యూటీ) చేస్తూ కాస్తోకూస్తో సంపా దించుకోవచ్చు. ఫెయిలైతే రెంటికి చెడిన రేవ డిలాగైపోతుంది. జోడుగుర్రాల స్వారీ నుండి జారిపడి, గాయపడ్డ రౌతులాగైపోతుంది. జీవన పోరాటములో ఆశల ఆరాటం ఆశ యాలను పక్కకు నెట్టెయ్యకుండా జాగ్రత్త పడ్డం మరో ఎత్తు.

సెంటర్లో కోడ్ ప్రాక్టీసుతోపాటు ఇంటివద్ద టెక్నికల్ థియరీ నోట్స్ చదవడమలవా టైంది.

మేముంటున్నది బుడంపేటలోనాయె. పక్కవీధిలో రాత్రీపగలు తేడా లేకుండా పంచ వన్నెల రామచిలుకల పటాటోపం. అంగడి బొమ్మలు అరుగులమీదనుంచుండి సైగలజా ర్చడం, అవయవసౌందర్యాలను అలవోకగా ప్రదర్శించడం, వికవికలు పకపకలు, కనుసై గలు, బ్రహ్మకైనా పుట్టురిమ్మతెగులు అని ఎందుకన్నారో అప్పుడర్థమైపోతుంది. అదంతా రక్షక భటులైన పోలీసులకు తెలిసే జరుగు తుందనీ, రక్షకభటులు కూడా మానవమా త్రులు కాబట్టి భక్షణ ఆశలో చూసీచూడన ట్టుంటారని అందరికీ తెలుసు.

తాత్కాలిక సుఖాలవైపు తనువు తరలిపో కుండా మనసుకు స్థితప్రజ్ఞత కళ్లాన్ని బిగించి, పట్టుసడలకుండా పట్టుకోవడంలోని అవస్థ వర్ణనాతీతం.

క్లాసులో ఒక్కో అక్షరం జతజేసి చిన్నచిన్న పదాలు కొట్టడం నేర్పుతున్నారు. ఇంటర్వె ల్ లో క్యాంటిన్‌లో సరదా కబుర్లు, ఆ తర్వాత టెక్నికల్ క్లాసు రోటీన్‌గా మారింది.

మా క్లాసులో అంతా ఉద్యోగులమే. అందరి పెదాలమీదున్నది మధ్య తరగతి మందహాసమే. అందరి జ్ఞాపకశక్తి ఒకే రకంగా ఉండదుగదా. కుటుంబపరిస్థితుల ప్రభావమో లేక ఇతర పరిస్థితుల, వ్యాపకాల ప్రభావమో కొందరు మిత్రులు కోడ్‌ను పూర్తిగా గుర్తుంచుకోలేకపోతున్నారు. తప్పులు దొర్లుతున్నాయి. మరికొందరికైతే మోర్స్‌కీ ముట్టుకోవాలంటేనే వెన్నుపూసలోంచి సన్నని వణుకు పుట్టుకొస్తుందటా. పలకాబలపముతో బడికొచ్చిన పసికూనల లేతచేతులు పట్టి అఆలు దిద్దించే ప్రైమరీ స్కూలు మాస్టారులా వాళ్ల చెయ్యిపట్టి అభ్యాసం చేయిస్తున్న ఇన్‌స్ట్ర

ఎవరి అహం నశిస్తుందో వాని ఆత్మ మేల్కొంటుంది.

– స్వామీ వివేకానంద

క్టర్ ఓపికకు జోహార్లర్పించాలనిపిస్తోంది. అయినా నలుగురైదుగురు భయం గుప్పి ట్లోంచి బయట పడలేకపోతున్నారు.

సాంకేతిక విద్యనేర్పడంలో సవాలక్ష సమ స్యలుంటాయి అయినా ఇన్‌స్ట్రక్టర్ మానవాతీ తుడు కాదుగదా. ఓపిక, కోపము మనిషి జీవి తానికి రెండంచులు. అప్పుడప్పుడు వెనకబ డిన వారిని చురచురచూస్తూ

"కొంచెం తక్కువతిని, ఎక్కువ ప్రాక్టీసు చెయ్యండి"

"నామాట వినవయ్యా మొగుడా!"

"దిక్కులు చూడ్డం మానేసి చక్కగా కోడ్ ప్రాక్టీసు చెయ్"



"మనిషికోమాట, గొడ్డుకో దెబ్బనయ్యా బాబూ" లాంటి మాట లతో మందలిస్తుంటే మాకు జాలేసింది. ఓ ఇద్దరైతే మీరే వెనకబడి పోతున్నారు. కోడ్ బుర్రలో నిలవడంలేదు. "తప్పించుకుపోయెరా తాబేలు బుర్ర అన్నట్టు కంఠోపాఠమైన కోడ్ కీ పట్టుకునేసరికి తుర్రు మంటుంది" అంటు న్నారు. మందలింపులు వారి కళ్లల్లో నీళ్లూ రిస్తున్నాయి. ఇంటర్వెల్‌లో గుంటూరు జిల్లా మిత్రుడొకాయన నెత్తికొట్టుకుని

"మహారాజులా బతికి మురికిగుంటలో పడి చచ్చినట్టుంది మిత్రమా!" అంటూ బాధప డ్డాడు. శ్రీకాకుళం మిత్రుడైతే

"నాకీ ట్రైనింగూవద్దు. అదనపు సొమ్ములూ వద్దు. హాయిగా మా ఊరికెళ్లిపోతా"నని అల కపాన్నెక్కాడు. అలకపాన్నెక్కినా, నులకమంచ మెక్కినా ఆర్చేవారు, తీర్చేవారెవరూ లేరు.

"అలాగయితే కొండనాలిక్కి మందువేస్తే ఉన్ననాలుక ఊడిపోతుందన్నట్టవుతుంది సోదరా. గడిచిన ట్రైనింగ్ రోజుల జీతం రిక వరీ, డిసిప్లినరీ ఆక్షన్ ఇబ్బందుల్లో ఇరుక్కో వాల్సి వస్తుంది సుమా!" గుర్తుచేశాను.

అలా అన్ననైతే అన్నానుగాని అన్నీ తెలిసిన ఆరిందాలా బోడిసలహాలిస్తున్నాననుకుంటా డేమోననే అనుమానం.

పాపం! అతని వాలకం... ముఖకవళి కలు.. ఆరేసిన మసిగుడ్డను తలపించాయి. అరవిరిసిన పూవులాగుండే మనిషి అలాగైపో యాడు.

"ఛి ఛీ ముందు నుయ్యి, వెనక గొయ్యిలాగైంది బతుకు. వెదవ బతుకు. నా మీద నాకే అసహ్యమేస్తుంది" చీదరించుకు న్నాడు. నేనూరుకోలేదు.

"అది కాదు మిత్రమా. ఇక్కడున్నన్ని రోజులు ఇంటి బాధలు, ఇల్లాలి వెతలు మరిచిపో వాలి. ఏకాగ్రతతో ప్రాక్టీసు చేస్తే సరిపో తుంది. పరిస్థితుల ప్రభా వంతో మనసుకు కోతి స్వభావమొస్తుంది. ఒక్క చోట నిలబడకుండా చంచలమైపోతుంది. గంతులేస్తున్న మనసును గట్టి ప్రయత్నంతో బంధించాలి. ప్రయత్నిం చండి. తప్పకుండా ఫలితముంటుంది"

"నిజమే ప్రయత్నించాలి" నావైపు కృతజ్ఞ తగా చూశాడు.

ఇలాంటి సంఘటనలు అంతరాళాల్లో అల్ల కల్లోలం రేపుతాయి. అయినా నియంత్రించు కోవాలి.

★ ★ ★

రోజువారీ కార్యక్రమాల్లో భాగంగా ఉదయం క్లాసుకెళ్తూ చాయ్‌కోసం హోటల్లో దూరాం. మూడునాలుగు రోజులనుండి గమ నిస్తున్నాను. సిద్దయ్య, నేను టీ చప్పరిస్తు

న్నంత సేపు మమ్మల్నో మనిషి పరకాయించి చూస్తున్నాడు. తెల్లని పంచకట్టు, సిల్కు లాల్చీ నుదుట చందనం బొట్టు, చేతిలో బ్రీఫ్‌కేసు. చాయ్ సిప్ చేస్తూనే సిద్దయ్య చెవిలో ఊదాను. అతడూరుకుంటాడా..

"హలో బాగున్నారా" అతన్ని ఉన్న పళంగా పలకరించాడు.

అందుకోసమే ఎదిరిచూస్తున్నట్లు "ఆఁ...ఆఁ.. కులాసా" చప్పున చాయ్ కప్పుతో సహా లేచొచ్చాడతడు. చిరునవ్వు... గారపళ్లను మెరిపిస్తోంది.

"నన్ను పెళ్ళిళ్ల పేరయ్య అంటారండీ" పాత చుట్టంలా వచ్చి మా ఇద్దరి మధ్య కూచున్నాడు. ముసిముసి నవ్వుల మధ్యన బ్రీఫ్‌కేసు పిచ్చుక పిల్ల నోరులా తెరుచుకుంది. బరువైన ఆల్బమొకటి బయటికొచ్చి రెక్కలు విప్పుకుంది.

"నా అంచనా తప్పు కాదు. మీరిద్దరూ అన్నదమ్ములు. యామ్ ఐ కరెక్ట్? " ఆల్బమ్‌ను మా ముందుకు తోశాడు. దాన్నిండా పెళ్లీడుకొచ్చిన ఆడపిల్లల ఫొటోలున్నాయి. నా ఇబ్బంది సిద్దయ్యకర్థమై పోయిందేమో పెదాల మీద వేలుంచుకుని మాట్లాడవద్దని సైగ జేశాడు.

"అరే చాలా బాగా కనిపెట్టేశారు. కంగ్రాట్సండీ" ఉత్సాహంగా అతని చెయ్యందుకుని కరచాలనం చేశాడు.

"థ్యాంక్యూ థ్యాంక్యూ" అతనిలో విజయోత్సాహం "మీ ఇద్దరికీ కుందనబ్బొమ్మల్లాంటి అమ్మాయిలను వెదకిపెట్టడం నా వంతు. అంగరంగ వైభోగంగా పెళ్ళాడ్డం మీ వంతు. ఈ ఫొటోలు చూడండి. ఏ అమ్మాయి నచ్చితే ఆ అమ్మాయితో పెళ్లి ఖాయం. ఈ సమాచారం, ఫొటోలు సేకరించడమెంత కష్టమో మీకు ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు' ' ఫొటోలు చూపిస్తూ అమ్మాయిల బయోడేటాలు చెబుతున్నాడు. మధ్యలో మా ఊరు, పేర్లు వయస్సు ఇంకేవేవో అడిగాడు. అన్నింటికీ ఏ మాత్రం తడుముకోకుండా జవాబులిస్తున్నాడు సిద్దయ్య. ఆయన ఇచ్చే సమాచారం ఎంతవరకు నిజమో నాకు తెలుసు. కల్పించుకుని 'ఇది అబద్ధమని' చెప్తాననుకుంటే సిద్దయ్య సైగల ద్వారా వారిస్తున్నాడు.

"చూడండి సార్! మీకిద్దరికీ బంగారం లాంటి సెంట్రల్ గవర్నమెంటు ఉద్యోగాలున్నాయి కాబట్టి బంగారు బొమ్మల్నే సెలెక్టు చేసుకోండి" పదహారు గారపళ్లు బయటపడుతూంటే హుషారుగా సలహాలిస్తున్నాడు.

"ఇదన్యాయమండీ" సిద్దయ్య పెదాలు చప్పరించాడు. సంభాషణ పెరిగిపోతోంది. క్లాసుకు టైమవుతోంది.

"ఏదండీ" పేరయ్య మొహం ముడుచుకుపోయింది.

"ముందు పెద్దవాడి పెళ్లి. ఆ తర్వాతే"

"ఆయ బాబోయ్, ఆయ బాబోయ్" పేరయ్య గుండెలు బాదుకున్నాడు. "చాలా గొప్పమాట చెప్పారండీ. ముందు అన్నయ్యకే తగిన జోడీ సెలక్టు చేసుకోండి. కట్నం వగైరాల సంగతి నాకొదిలెయ్యండి" ఆల్బం నా ముందుకొచ్చింది. గుండె లబలబలాడింది. ఆల్బాం మూసేశాను.

"ఈరోజు టైం లేదు" అనేశాను.

"అవును క్లాసుకెళ్లాలి. రేపు చూస్తాంగానీ ఎక్కువ కట్నం తెచ్చే అమ్మాయిల ఫొటోలు మాత్రమే టిక్ చేసుకురండి. మా వదినమ్మంటే మహారాణిలాగుండాలి. మా అన్నయ్యకు చేతినిండా డబ్బులివ్వాలి" అని నా చెయ్యిబట్టి బయటకు తీసుకొచ్చాడు. "నువ్వు గమ్మునుండన్నా. మిగతాది నేం చూసుకుంటా"నన్నాడు. నాకంతా అయోమయంగా ఉంది. ఈ కొంటె పిల్లాడు కాకినాడలో నాకింకో కాంతను ముడెయ్యడు గదా! పెళ్లి చేసి సంసారం పెట్టించడు గదా! అమ్మోయ్ అలాగైతే అక్కడ పెద్దిల్లు, ఇక్కడ చిన్నిల్లు సుఖం సంగతి దేవుడెరుగు, సమస్యల వలయంలో చిక్కుకుని సతమతమైపోవాలి. "ఇదన్యాయం, అక్రమం" అంతరాత్మ ఆక్రోశించింది. బతుకు బస్టాండై పోతుందని హెచ్చ

రించింది.

ఎందుకైనా మంచిదని రాత్రికీ విషయం సత్తికొండ చెవిలో వేశాను. అప్పుడు సిద్దయ్యా టాయ్‌లెట్లో ఉన్నాడు. ఆవిడో నిమిషం ఆలోచించి "నువ్వు గమ్మునుండు కృష్ణమూర్తీ!" అంది. అయ్యో రామ సత్తికొండ గూడా సిద్దయ్యా పార్టీలో చేరిపోయిందన్నమాట. "ఓరి దేవుడా... నా భార్యాపిల్లలకన్యాయం జరక్కుండా కాపాడాల్సిన బాధ్యత నీదే నయా" మనసులోనే మొక్కుకున్నాను.

మర్నాడుదయం... అరగంట ముందే హోటల్‌కు లాక్కెళ్లాడు సిద్దయ్య. ఎప్పుడొచ్చాడో ఏమో, పెళ్ళిళ్ల పేరయ్య చిరునవ్వుతో మాకు స్వాగతం పలికాడు. సిద్దయ్య నా తరపున పెళ్లిపెద్దలా ఫోజిచ్చాడు. చాయ్ స్టైల్‌గా చప్పరిస్తూ "చెప్పండి పేరయ్య గారూ! కట్నమెంత ఇప్పిస్తారూ" క్రాపు సర్దుకుంటూ అడిగాడు. పెళ్ళిళ్ళ పేరయ్య పెద్దగా నవ్వాడు. గారపళ్లు గమ్మత్తుగా మెరిశాయి. "మీరు భలే వారండీ. మీ అన్నయ్యకు అమ్మాయి ముఖ్యమా, అంత పెద్ద కట్నం ముఖ్యమా" ధర్మరాజులా ఫోజిచ్చాడు.

"పెద్ద కట్నమే ముఖ్యమండీ అమ్మాయిదేముందీ? "

"ఆc..ఆc" నోరు ఠక్కున మూతపడింది. "సరే ఈ అమ్మాయి ఫొటో చూడండి. మూడు లక్షల కట్నం వీళ్ళ నాన్న' ఫొటో చూపిస్తూ వివరాలు చెప్పుకుపోతున్నాడు.

"అదంతా ఎందుగ్గానీ తక్షణం కట్నం డబ్బులు అడ్వాన్స్‌గా ఇప్పించండి"

"అం...టే... అమ్మాయిని చూడకుండానే సంబంధం ఓకేనా!" నోరు మా ట్రెయినింగ్ సెంటర్ ఛానల్ గేటులా తెరుచుకుంది. జారిపోతున్న కండువాను సర్దుకుంటున్నాడు.

"అమ్మాయిదేముందండీ. మీ మీద విశ్వాసముంది. మీకు ఓకే అంటే మాకూ ఓకే. చూస్తూ చూస్తూ మీలాంటి పెద్దమనిషి మాకన్యాయం చేస్తారా? "

పేరయ్య ముఖారవిందం ఫోకస్ లైటులా వెలిగింది.

"యావండీ పెళ్లికొడుకు గారూ మీరేమంటారూ? " సంతోషాన్నదిమిపెట్టి నన్ను అడుగుతున్నాడని ఆ భుజాలు ఎగరడంతోనే అర్థమైపోయింది. ఇప్పుడేం చెయ్యాలి?

కుడితిలో పడిన ఎలుకలాగైపోయాను. తల పైకెత్తి అటూ ఇటూ చూస్తున్నాను-రక్షించే వాళ్లెవరన్నా దొరుకుతారా!

"అబ్బా మీరు మరీ మొహమాట పెడ్తున్నారు. మా అన్నయ్యకు ముందే సిగ్గు ఎక్కువ. మీరట్లా అడిగితే సిగ్గుతో మొహం మీకు చూపించలేకపోతున్నాడు" సిద్దయ్యా తంటాలు పడుతున్నాడు. "ముందు డబ్బులిప్పించండి. వెంటనే మీ కమీషన్ పువ్వుల్లో పెట్టిస్తా" ఇంకేదేదో చెప్తూనే పోతున్నాడు.

"సరే ప్రయత్నిస్తా"

మా సంగతులన్నీ హోటల్ యజమానికి తెలుసు. అతడు కూడా నోరు తెరవరాదని సిద్దయ్య అంతకుముందే కట్టడి చేశాడు. మా మాటలన్నీ వింటూ, మా హావభావాలను జాగ్రత్తగా కనిపెడుతున్నాడతడు. నవ్వలేక, మరేమీ అనలేక సతమతమవుతూ చాయ్ వడబోస్తున్నాడు.

"ఒరేయ్! పెళ్ళిళ్ల పేరయ్యా!" ఉరుముతున్న మెరుపులా సత్తికొండ ఊడిపడింది. అనుకోకుండా ప్రత్యక్షమైందక్కడ. "వెధవాయ్! కమీషన్ కోసం కన్నె పిల్లల జీవితాలతో ఆడుకుంటావ్రా!" గంయ్‌మంటూ వచ్చి ఓ చేత్తో కండువా, మరో చేత్తో అల్బం లాక్కుంది.

"అమ్మా, తల్లీ తమరెవరూ? " పేరయ్య వణికిపోతూ చేతులు జోడించాడు. "నా నోటి కాడి కూడు లాగెయకండమ్మా" లేచి నుంచుని బతిమాలుతున్నాడు.

"ఒరేయ్ గారపళ్ల గాడిదా! పెళ్లంటే నూరేళ్ల పంట అని తెలుసా? "

"అయ్ అందుకే గా..." చలిజ్వరం రోగిలా వణికిపోతున్నాడు. నన్నూ, సిద్దయ్యానూ మార్చి మార్చి చూస్తున్నాడు.





## చెప్పుల్లేని రోజున..

కుటుంబ ఆర్థికపరిస్థితి కడుదయనీయంగా ఉన్నరోజులు.. కనీసం కాళ్లకు చెప్పులన్నా లేకుండా శ్రీశ్రీ చెన్నయ్ పాండీబజార్‌లో వెళ్తూ పేరడీకవి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రికి ఎదురుపడ్డారు. ఆయన విపరీతంగా బాధపడిపోతూ 'అయ్యో.. ఏమిటిది? పరిస్థితి ఇంత దారుణంగా ఉంటే కనీసం చెప్పారు కాదు..' అన్నారు ఆవేదనగా.

శ్రీశ్రీ మాత్రం తనశైలిలో- "చెప్పుకొనుటకు ఏమున్నది మిత్రమా? " అన్నారట చిరునవ్వులు చిందిస్తూ.

"మరైతే... అమ్మాయి, వాళ్లమ్మానాన్నలు, అబ్బాయి వాళ్లమ్మా నాన్నలు ఎవరి ప్రమేయం లేకుండా అమ్మాయి అబ్బాయిలు కనీసం మొహాలన్నా చూసుకోకున్నా పెళ్లిళ్లు కరారు చూస్తావట్రా!" పళ్లు పటపటలాడ్తున్నాయి.

పేరయ్యకు రోషమొచ్చినట్టుంది. రొప్పుతూ "అదంతా తవరికెందుకూ? ఏదో పొట్టతిప్పలుకు జెర్రిపోతులాడించాలన్నారు" దూరం జరిగాడు.

"అన్నారు... కాని ఆ జెర్రిపోతును చంపుకు తినమని ఎవ్వరూ అనలేదు గదా? "

"ఆయ్ ఇప్పుడేమైందనీ! నూరు అబద్ధాలాడి ఓ పెళ్లి చెయ్యాలన్నారు. నేనింకా ఒక్క అబద్ధం కూడా ఆడలేదు."

"నువ్వాడక పోవచ్చు గాని పెళ్లంటే నీకు ఏళాకోళంగా ఉందట్రా? అబ్బాయి బ్రహ్మచారా, భార్య ఉన్నవాడా అనే విషయం గూడా కనుక్కోవా? "

హడలిపోయాడు పేరయ్య. "వామ్మో మొదటికే మోసమొచ్చిందిరా నాయనోయ్" నెత్తి కొట్టుకొంటున్నాడు. "ఐతే... ఈయన కిదివరకే పెళ్లయిందా? " మొహమ్మీద ముచ్చెమటలు మెరుస్తున్నాయి. చలిజ్వరం వచ్చినట్టు వణికి పోతున్నాడు.

"పెళ్లేవిటండీ ఇద్దరు పిల్లలుగూడా" కట్టలు తెంచుకొస్తున్న నవ్వునాపుకోలేక హోటల్ యజమాని భళ్లున్న నవ్వేశాడు. పిచ్చివాడా! అన్నట్టుగా పేరయ్య వైపు చెయ్యూపుతున్నాడు.

"నీ దుంపదేగా నీకు చావురానూ నీ పిండంబెట్టా" సత్తికొండ తిట్ల పురాణం విప్పింది. " ఈ సారిలాంటి వెధవ్వేశాలేస్తే మక్కెలిరగతంతా" చివరికో వార్నింగ్ సర్వ్ చేసింది. "పో యెధవాయా... వెళ్లిపో!"

అల్లాం, కండువా అందుకుని అరక్షణంలో అదృశ్యమైపోయాడు. చూస్తున్న వాళ్లంతా నవ్వుకుంటున్నారు.

"ఆహా గురువా పేరయ్యకు మాంచి టోకరా ఇచ్చావయ్యా" హోటల్ యజమాని సిద్దయ్య చేతులందుకున్నాడు. సిద్దయ్య గర్వంగా ఫీలవుతున్నాడు. "చాల్లే సంబడం!" సత్తికొండ హోటల్ యజమానిని చురచుర చూసింది. "నువ్వో మొనగాడివి, ఆ పిల్లాడో సినిమా హీరో. అమ్మాయి లేకున్నా సరే కట్నం డబ్బులు కావాలా? "సిద్దయ్య వైపు తిరిగింది. "ఏయ్ సిద్దులూ! ఇహ వెళ్లండి

బీదతనం ఎక్కడ ఉన్నా సరే పురోగతికి అది అవరోధమే.

\- కెన్నెడీ

క్లాసుకు" పక్కకు తప్పుకుని చూపుడు వేలుతో దారి చూపించింది.

"కేవలం తన అధికారాన్ని నిలబెట్టుకునేం దుకే ప్రధాని దేశంల ఎమర్జెన్సీ పెట్టింది..." అంటూ కరీంనగర్ కాళ్ళు బార్లు చాచి కూచు న్నాడు. రంగుల హంగులు చిమ్ముతున్న రక రకాల పూలను ఓరకంటితో చూస్తున్నాడు.

సాయంత్రం వాకింగ్‌కు బయలుదేరి పార్కుకొచ్చాడు. మెత్తని గడ్డిమీద వాకింగ్ ఆపేసి టాకింగ్‌లోకి దిగాం.

కత్తిరించిన గడ్డిపరకలు మెత్తని ఆకుపచ్చ పట్టువస్త్రం పరిచిన పరుపులాగున్నాయి. సముద్రపు అలలమీంచి ఎగిరొచ్చిన గాలి తరంగాలు- చెట్ల కొమ్మల్ని, రెమ్మల్ని, ఫ్యాషన్ల కోమలాంగుల్ని స్పృశించి వచ్చాయని చెబుతూ ఒంటికి గిలిగింతలు పెడుతు న్నాయి. నవనాగరికులు, నయవంచకులు, మధ్యతరగతి మనుషులు గుంపులు గుంపు లుగా కనబడుతున్నారు. పల్లీలమ్మే పడతులు, ఐస్క్రీముల అయ్యగార్లు పిల్లల్ని కవ్విస్తు న్నారు. పెద్దల కబుర్లు, పిల్లల కేరింతలతో వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది.

"ఇదంతా దొంగాటకమండీ. అలహాబాదు హైకోర్టు తీర్పును తుంగలో తొక్కి ఓడిన తాను గెలిచాననిపించుకోవడానికే" నెల్లూరు నుండి వచ్చిన మా క్లాసుమేటన్నాడు. ఆయన మాకంటే ముందే అక్కడున్నాడు.

"ఆc ఈ ఎమర్జెన్సీ ఎన్ని రోజులుంటుం దిలే. పార్లమెంటుకు ఎన్నికలు ప్రకటిం చారు గదా. అమ్మగారి పస ఈ ఎన్నికల్లో తెలుస్తుంది" వెల్లకిలా పడుకున్న సత్యనారా యణ నిర్మలాకాశాన్ని వీక్షిస్తున్నాడు. మోకా ళ్లకు గదవానించి కూచున్న ఆనందం "ఇదంతా ఓ తమాషా భాయ్. ఇరవై సూత్రాల కార్యక్రమమంతా స్వంత డబ్బా వాయిద్యం. అదే ఓట్ల వర్షం కురిపిస్తుందని ప్రధాని ఎత్తు" గడ్డిపరకల్ని అరచేతో నిము రుతున్నాడు. మా కబుర్లన్నీ వింటున్నామ న్నట్టు- పూలమొక్కల తలలూపుతున్నాయి.

"ఆ ఎత్తుకు ప్రజలు చిత్తైపోయి ఓట్లు తన పార్టీకే ఒత్తేస్తారని కలలుగంటుంది గదా!" కాశీనాథ్ పక్కమీద పడుకుని పూల మొక్కల్ని చూస్తూ అంటున్నాడు.

"అయినా మన దేశంల ఓటర్లు అమాయ కులైతే కావచ్చు గని మాయాజాలాన్ని భరిం చలేరు" అంటుంటే నా చూపులు సిద్దయ్యను తడిమాయి- నువ్వేమంటావన్నట్టుగా.

"గాముచ్చట్లెందు కన్నా? సెన్సారు పుణ్యా మాని పత్రికలే నోరుమూసుకున్నై. మనం ఉద్యోగులం. మనకెందుకీ పరేషాన్? " నా వైపు భయంగా చూస్తున్నాడు సిద్దయ్య. చేతులు వెనక్కు చాచి అరచేతుల్ని నేలకా నించి కూచున్న వాడల్లా టాపిక్ స్టీరింగు తిప్పేశాడు. "జయప్రకాశ్ నారాయణ లాంటోళ్లు అదంతా చూస్కుంటారు. మన మోసారి యానాం చూసి రావాలె. ఇక్కడికి దగ్గరనే గదా"

"ఉద్యోగులమైనంత మాత్రాన మనమీ దేశ పౌరులము కామా? మనకూ ఓటు హక్కు ఉంది" అందామనుకున్నాను గాని ఆ టాపిక్ గురించి మాట్లాడ్డం సిద్దయ్యకిష్టంలేదని మానుకున్నాను.

ప్రకృతి ఒడిలో పరవశిస్తున్న యానాం అందాలు అక్కడి సినిమా షూటింగుల కబు ర్లతో కొంతసేపు కాలక్షేపమైంది.

ఇంకేమేమో కబుర్లు చెప్పుకుంటూ మేమా రుగురం ఇంటి కొచ్చేశాం. ఇంటి లోపల ఏదో అలజడి.

"ఏయ్ నాకన్నీ తెలుసుగాని రాయే! రేటెంతో చెప్పేయ్" మగ గొంతు వినబ డింది.

"అరేయ్ నన్నిడువురా" అది శ్రీమతి రాజయ్య గొంతు. "అయ్యో బయట ఎవ రన్నా ఉన్నారా!" ఆర్తనాదాలు, పెడబొ బ్బలు.

ఆందోళనగా మొహాలు చూసుకుని లోప లికి పరుగెత్తాం. ఎవరో... ముగ్గురు యువ

కులు... మా మిత్రుల భార్యలను... రక్తం కుతకుతలాడింది.

రాజయ్య నేరుగా తనగదిలో దూరాడు. కాస్సేపు పెనుగులాట...



ఆ తర్వాత గదిలో ఉన్న యువకుని గల్లా బట్టి బయటకు లాక్కొచ్చాడు. వీరావేశంతో ఊగిపోతున్నాడు. యువకుని వీపు విమానం మోతమోగింది. ప్రతిఘటిస్తున్న ఆ అర్భకుని లెంపల వాయింపు సాగుతూనే ఉంది.

సత్యనారాయణ గదిలోంచి సిద్దయ్య ఈడ్చుకొచ్చాడో యువకుణ్ని. జబ్బల మీద, మొహమ్మీద పడుతున్న ప్రహారాలను భరించలేక ఆ యువకుడు లబోదిబోమంటున్నాడు. చూపుకి లావుగానే ఉన్నాడు గాని సిద్దయ్య ధాటికి తట్టుకోలేక పోతున్నాడు. కాని తనకూ రోషముందని నిరూపించేందుకు ప్రతిఘటిస్తున్నాడు. అరచేతుల్లో పిడిగుద్దుల

నాపుకుంటున్నాడు.

"బుడంపేట అరుగుల మీద కూచున్నారు గదా. వీళ్లేమన్నా సంసారులా? బేరానికి రమ్మంటే బెట్టు" వాని మాట పూర్తికాక ముందే ముక్కు పచ్చడైపోయింది. మూతి కోతిమూతిలాగైంది.

మరొకని ఒళ్ళు కాశీనాథ్ చేతిలో హూనమైంది. మిగిలిన ముగ్గురం ఆ ముగ్గురికి ఫైనల్ టచింగ్స్ ఇచ్చి బయటకు నెట్టేశాము. సత్తికొండ కనబడలేదింకా.

ఎక్కడికి ఎప్పుడెళ్ళిందో గాని అప్పుడొచ్చింది సత్తికొండ. వాతావరణంలోని గాంభీర్యాన్ని భరించలేకపోయిందేమో- శ్యామల వర్ణంలో ఉన్న మొహం త్రివర్ణముఖచిత్రమైంది. కొంగు నోట్లో కుక్కుకుని వెక్కుతున్న రోహిణి ముందుకెళ్లింది గాబరాగా. ఆవిడ భుజాలు పట్టి కూచోబెడుతూ

"య్యామైంది? య్యామైందమ్మా?" అంటూ అందరిమొహాలూ చూసింది. రోహిణి వెక్కుతూనే ఉంది. ఏమీ చెప్పలేదు. కళ్లనీళ్ళు కొంగుతో అద్దుకుంటున్న శ్రీమతి రాజయ్య దగ్గరికెళ్ళి "ఆయ్‌బాబోయ్! య్యామైందమ్మా! ఈ ఏడ్పులేటీ? య్యామైందంటే చెప్పరేమిటీ?' ' గొంతులో ఆందోళన, భయం.

"ఇంతకీ తమరెక్కడి కెళ్లారటా?" సిద్దయ్య దెప్పిపొడుపు ప్రశ్న. పాపం! సత్తికొండకు పిచ్చెక్కినట్టయిందేమో

"అదేమిటయ్యోయ్! గద్దిస్తావేటీ? నేనూ నా కూతురింటికెళ్లా ఆc య్యామైందంటే ఎవరూ చెప్పరేవిటీ?" ధుమధుమలాడింది.

సిద్దయ్య నాలిక్కరుచుకున్నాడు.

సత్తికొండ గిరుక్కున పక్కకు జరిగి శ్రీమతి కాశీనాథ్ గదవ పట్టుకుంది. "అసలేం జరిగిందమ్మా?" ప్రేమగా అడిగింది.

కొనకొంగుతో కళ్లద్దుకుంది శ్రీమతి కాశీనాథ్.

"చెప్పమ్మా అసలేమైందీ?" నేనూ అడిగాను.

"మీరు ఆరుగురు బయటికెళ్లినంక రోజూటి లెక్క ఆడవాళ్ళం అరుగుల మీద కూచుండి ముచ్చట్లాడుకుంటున్నామన్నా!" నోరు విప్పిందావిడ "ఇల్లుగలావిడనేమో మధ్యాహ్నం నుండే లేదు గదా. గా ముగ్గురు తాగొచ్చినట్టుంది. ఈ పిట్టలు ఫస్ట్‌క్లాసున్నయిరా అనుకుంటు లోపలి కొచ్చిండ్రు. మమ్ముల్ని లోపలికి రమ్మన్నారు. మేము భయపడి రూములల్లకొచ్చి తలుపులు బంద్ జెయ్యబోతే వాళ్లు బలవంతంగా చొచ్చుకొచ్చిండ్రు. ఏదేదో వంకర టింకర మాట్లాడుకుంటూ చెయ్యిపట్టుకుని" ఇహ చెప్పలేకపోయింది.

సత్తికొండ నెత్తికొట్టుకుంది.

"మీరు రావడం ఇంకొంచెం ఆలస్యమైనా అన్యాయం జరిగిపోయేదన్నయ్యా" రోహిణి కళ్లల్లోంచి భయం నీడలు తొలగిపోలేదింకా. "మా అబ్బాయి ట్యూషన్నుంచి రాలేదింకా. ఆ వెధవలు మేమెంత చెప్పినా వినలేదు..." కసిగా అంది.

"అయితే బుడంపేట మహత్యమిదన్నమాట. తాటి చెట్టుకింద కూచుండి పాలు దాగినా కల్లు తాగుతున్నావంటుంది లోకం" రాజయ్య తలపట్టుక్కూచున్నాడు.

"బుడంపేటేమిటీ ఆడంగులు అరుగుల మీద అలా కూచుంటే ఏ పేటలోనైనా అంతే" సత్తికొండ కంతా అర్థమైపోయినట్టుంది. నుదురు కొట్టుకుని చేతులూపుతూ "అమ్మా, తల్లులూ. అలా ఆరుగుల మీద కూచోవద్దని మీకింతకు ముందే చెప్పానా, లేదా?" సూటిగా అడిగింది శ్రీమతి కాశీనాథ్‌ను.

"చెప్పిన మాట నిజమే కాని. మా ఊర్లె గిట్లనే కూచుండి టైంపాస్ చేస్తం" శ్రీమతి రాజయ్య తొణక్కుండా చెప్పేసింది.

"మీది నైజాం ఏరియా. అక్కడది మామూలు కావచ్చు ఇక్కడలా కాదమ్మా. ఈ ప్రాంతంలో వ్యభిచారులు అలా అరుగుల మీద కూచుంటారు. విటుల కదొక సంకేతం. సిగ్నలూ" సత్తికొండ వివరణ "అయిందేదో అయింది గాని ఇక ముందలా కూచోకండేం! కావాలంటే ఈ వరండాలో ఇక్కడే కూచుండి

సరదాగా కబుర్లు చెప్పుకొండమ్మా" ఇంకేదేదో సముదాయించి చివరికి "నీకీ సంగతి తెలుసు గదమ్మా!" రోహిణిని అడిగింది.

పాపం! రోహిణి చూపులు నేలకు వాలాయి. "ఏదో ఊబుసుపోక ఆ ముగ్గురితో పాటు నేనూ కూచున్నానంతే. ఇంత పని జరుగుతుందని ఊహించలేదు"

"సరేలే అంతా మన మంచికే అనుకుందాం. ఇక ముందు జాగర్త మీరసలు ఆ ఆరుగుల మీద కూచోకండేం!" సత్యనారాయణ హితవు పలికి గదిలోకెళ్లిపోయాడు.

రాత్రి పడకల మీద ఒరిగాక

"పాపం! ఈ ఆర్నెల్ల కోసం ఫ్యామిలీస్ పుటప్ చెయ్యడం బాగాలేదన్నా" సిద్దయ్య పెదాలు చప్పరించాడు. "మనమే నయమేమో, ఫ్యామిలీస్‌ను తేలేదు. ఎలాగో గడిపేస్తున్నాం" బాతాకానీ కుపక్రమించాడు.

"ఇది వెనకటి రోజులు కావు గదా. పాశ్చాత్య నాగరికత ప్రభావం ఉమ్మడి కుటుంబాలను కుంగదీస్తుంది. కలిసి ఉంటే కలదు సుఖం సామెతకు విలువ లేదు"

"ఏమో అన్నీ... అప్పటి సంగతి... ప్చ్... బాధాకరం."

"అయినా ఎవరి ఇంటి పరిస్థితి ఎట్లా ఉన్నదో చెప్పలేంగదా" దుప్పటి కప్పుకొంటూ నిట్టూర్చాను.

"పరిస్థితి దేముందన్నా? అంతా మన చేతుల్లోనే ఉంది గదా! మనమెట్లా ప్లాన్ చేసుకొంటే అట్లా ఉంటుంది."

"అందరికీ అట్లా కుదరదబ్బా. పెద్ద కుటుంబాల్లో ముందటి అవగాహన లేదు. నైతిక విలువలు పతనం వైపు పరుగెడుతున్నై. యువ జంటలు... కలిసి ఉండటమంటే మరొకరి అదుపాజ్ఞల్లో నడవడమనుకుని విడిగా ఉండి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనుభవించాలనుకుంటున్నాయి. ఉమ్మడి కుటుంబాల్లో ఆడవాళ్లు కలిసి ఉండలేక పోతున్నారు."

"నిజమే కాని కొందరైతే ఈ ఆర్నెల్లు హనీమూన్ లెక్క గడపాలని ఫ్యామిలీతో వచ్చింద్రు. ఎంజాయ్ చెయ్యాలనుకుంటుంద్రు"

"అదీ నిజమే అనుకో"

చాలా సేపు చర్చసాగింది.

ఏమిటో! సంసార సాగరం ఆటుపోట్ల గురించి, దాని గర్భములో నిక్షిప్తమైన బడబానలం, రతనాల రాశుల గురించి ఎందరో మహానుభావులు ఎన్ని చెప్పినా మరికొన్ని అంశాలు మిగిలి పోతున్నై. ప్రజావళి నోట్లో, నిత్యజీవితములో కనబడుతూనే ఉంటాయి.

ఆ తర్వాత రాబోయే టర్మ్ హాలీడేస్ ప్రస్తావనతో మండుతున్న వెన్నుపూతకు లేతవెన్న రాసినట్లైంది. మనసులు శాంతించి నిద్రాదేవి కౌగిట్లో ఎప్పుడు ఒదిగిపోయాయో తెలీదు. అరకొర జీవితాలను ఆదమరచిన నిద్ర ఒక వరమేనేమో.

బంగాళాఖాతం... సాగరతీరాన ఉంటున్నాంగదా.... సముద్రపు అలల అలజడి కళ్లారా చూడాలని, తరంగాల సవ్వడి సంగీతం చెవులారా వినాలని ఎప్పట్నుంచో అనుకుంటున్నాం. రాత్రి మాగృహ సమావేశంలో ప్రస్తావన కొచ్చింది. సత్తికొండ వచ్చి కూచోగానే.

"సత్తికొండగారూ" రాజయ్య ఆసక్తి.

"ఆ 'గారూ' తోక ఎందుగ్గానీ మామూలుగా పిలువు నాయనా" సత్తికొండ నీలవర్ణం పెదాల మీద తైలవర్ణం చిరునవ్వు మెరిసింది.

పాపం! రాజయ్య మళ్లీ నోరు తెరవలేదు. ఆనందం అందుకున్నాడు. చిరునవ్వుతో

"అద్సరే గాని మేము సముద్రం చూడాలె" అడిగాడు.

"ఆc ఆ సముద్రములో ఏముందిలే. ఈ కాకినాడలో ఇటు జన సముద్రం, అటు జల సముద్రం అంతే" కొట్టిపారెయ్యబోయింది.

సంఘటనలను మనం మార్చలేకపోవచ్చు. కానీ ఆ సంఘటనల విషయంలో ఏర్పడే మనోభావాలను మాత్రం మార్చుకోవచ్చు. – రాధాకృష్ణన్

"ఆ గదే ఈ జన సముద్రానికి, ఆ జలస ముద్రానికి తేడా ఏమిటో కళ్లారా చూడాల నుంది సత్తికొండా. కొంచెం చూపిస్తే... నీ సొమ్మేమైనా పోతుందా? " సిద్దయ్యలో హుషారు. సత్తికొండను ఉడికించాలనే తపన గూడా.

"అవును. నేనెప్పుడూ సముద్రాన్ని చూడ లేదు. దాదాపు రెండు నెలలనుండి సముద్రం ఒడ్డునే ఉన్నాం. ట్రైనింగ్ సెంటర్ ముందు సముద్రం చూసి తీరాలె" నా ఆసక్తి గూడా బయటపడింది. అలా బయటపడకుండా ఉంటే బాగులేదాయె!

"సముద్రమంటే గంగమ్మ" సత్తికొండ వద నము మేఘావృతమైన ఆకాశంగా మారింది. "ఆ గంగమ్మ తల్లే మా అమ్మ పసుపు కుంకాలను తుడిచేసింది" సత్తికొండ మాటల్లో విషాదముంది. ముడుచుకుపోయిన మొహమ్మీద ముడతలు ఛాయలు కనబడు తున్నాయి.

"ఓర్నియవ్వ... గట్లనా!" రాజయ్యకేమర్థ మైందో.

"అయ్యో పాపం! మీ నాన్న ఏం చేసే వాడు? ఎలా పోయారు!" సత్యనారాయణ గోడకొరిగి కూచున్నాడు.

"మా నాన్న ఈ కాకినాడ పోర్టులో కలా సీగా పనిచేసేవాడు. పొద్దంతా పనిచేసి సాయంత్రం పూటుగా తాగి చీకటి పడ్డాక తూలుతూ ఇంటికొచ్చేవాడు. పెద్దలిచ్చిన ఆస్తులేవీ లేకున్నా అలగాజనాల స్నేహం దండిగా ఉండేది. ఆ తాగుబోతు మిడతల దండు ఆయన్నొదిలేది కాదు.

ఏవేవో ఇంగ్లీషు సినిమాలు చూసొచ్చి మా అమ్మతో గంతులేయించేవాడు. రోజూ అమ్మను కొడుతుండేవాడు. మా అమ్మ ఒంటి మీద దెబ్బలకు లెక్కే లేదు. అప్పుడు నేను పదేళ్ల పిల్లను.

ఆరోజు రాత్రి మానాన్న ఇంటికొచ్చేసరికి పది దాటింది. తాగుడు కాస్త ఎక్కువైనట్టుంది. అమ్మ పక్కన పడుకున్న నన్ను లాగి పారేశాడు. నాన్న రెచ్చిపోతూనే ఉన్నాడు. "ఆడదంటే ఆడ బొమ్మ కాదు. కన్నకూతురు సంగతి పట్టించుకునేది లేదు. పైసా ఇంటికి చ్చేది లేదు. రోషం లేని బతుకెందుకు? " అని గడ్డి పెట్టింది అమ్మ. తాగిందంతా దిగిపో యిందేమో - నోర్మూసుకుని పోయి పడుకు న్నాడు.

మర్నాడు... పొద్దున డ్యూటీకెళ్లినోడు మధ్యాహ్నం శవమై తిరిగొచ్చాడు. నమ్ము కున్న గంగమ్మతల్లే మా నాన్న ప్రాణాలు తీసింది. పడవ నుండి స్టీమరులోకి బస్తాలు మోస్తూ జారి సముద్రంలో పడిపోయాడట. "ఒక్కసారి ఆమె కళ్లు తడైనాయి. మా మన సులు మూగబోయిన్నై. కష్టాలు కన్నీళ్ల కబు ర్లకు కరిగిన గుండెలు బండలే గదా. ఆమె ముఖాన్ని పరీక్షగా చూశాను. ఖచ్చితంగా ఆ ముఖంలో - అనుభవాల ప్రాబల్యం పెద్దబా లశిక్షలా ఉంది. అప్పుడొచ్చింది అనుమానం - ఆమె ముఖం కృష్ణవర్ణమా లేక నీల వర్ణమా అని. ఏదో ఒకటిలే అనుకున్నాను. రెండు నిమిషాలు మౌనం తచ్చాడింది.

ఆ తర్వాత సత్తికొండ కొంగుతో కళ్లద్దుకుని సముద్రానికెలా వెళ్లాలో బీచ్‌లో ఏమేము న్నాయో వివరంగా చెప్పేసింది. చెప్పేట ప్పుడు ఉల్లాసంగా ఉంది.

ఆదివారం నాలుగు కుటుంబాలు, సిద్ద య్యతో నేను, మాతో సత్తికొండ కూడా బీచి కొచ్చింది.

రోజువారీ రొటీన్ పనుల్తో, ప్రాక్టీసు పాఠా లతో విసుగెత్తిన ప్రాణాలు రెక్కలు విప్పిన పక్షుల్లా సముద్రతీరాన స్వేచ్ఛగా విహరిస్తు న్నాయి.

సముద్రం ఎంత విశాలమైందో! కనుచూపు మేర కడలి విస్తరించి ఉంది. అర్జంటు పని మీద పరుగెత్తుకొస్తున్న మనుషుల్లా పెద్దగా శబ్దం చేస్తూ తరంగాలు ఒడ్డుకు చేరుకుంటు న్నాయి. ఆ దృశ్యం ఆహ్లాదం ఆనందం

సముద్ర తరంగాల కెదురెళ్తూ, సన్నని

ఇసుకలో కాళ్లు కడుక్కుంటూ, చిన్నపిల్లల్లా కేరింతలు కొడుతూ గంతులేశాం. సమయ మెట్లా గడిచిందో తెలీదు. రోజంతా సరదాగా గడిచింది. సత్తికొండ గూడా మాతో కలిసి సరదాగా గంతులేసింది. మాటలతో సిద్ద య్యను ఉడికిస్తూ, సిద్దయ్య కట్‌చేసిన జోకు లకు పసిపాపలా నవ్వుతూ హాపీగా గడి చింది. కాలం, కడలికెరటం మనకోసం ఆగ వుగదా!

మరికొన్ని రోజులు మామూలుగా గడి చాయి.

ఓ రోజు మధ్యాహ్నం సత్తికొండ గారాల కూతురు గిరిజ, అల్లుడు పైడితల్లి జంటగా వచ్చారు. ఇద్దరి ముఖాలమీద చిద్విలాసం చిందులేస్తోంది. దానిక్కారణం సత్తకొండ నోట విన్నాము.

"నా చిట్టితల్లి గిరిజ... తల్లికాబోతుంది. కృష్ణమూర్తీ! దాని కాపురం కొల్లేరైపోతుందే మోనని తెగ ఇదై పోయాను. నా దురదృష్టం దానికి సోకి, దాని బతుకు గూడా చితికిపో తుందేమోనని హడలి చచ్చాను. ఇదంతా మీ పుణ్యమే సిద్దులూ. దాని కాపురం నిలబె ట్టారు"

మా కళ్ళు ఆనందంతో నిండాయి.

"అయితే గిరిజా.... ఇప్పుడు మీ ఆయనే మంటున్నాడమ్మా?" ఆనందంగా అడిగాను.

"నన్ను మాబాగా చూసుకుంటున్నారు పెద్దన్నయ్యా!" గిరిజ బుగ్గలమీద పొటమ రించిన సిగ్గులు చూడముచ్చటగా ఉన్నాయి. "చిన్నన్నయ్యా! నీపేరు చెబితే మావారికి హడల్ సుమా!" కిలకిలా నవ్వే సింది. ఆ నవ్వు సన్నాయి రాగంలా విన సొంపుగా ఉంది.

"నీ కాపురం బాగుపడిందంటే అంతకంటే మాకింకేం కావాలమ్మా" సిద్దయ్యతో పాటు నేనూ గుండెపొరల్లోంచి ఊపిరి పీల్చుకు న్నాను.

పాపం పైడితల్లి గదిలోంచి బయటకు రాలేదు.

సిద్దయ్యకు టెలిగ్రామొచ్చింది. అతని భార్య ఆరోగ్యం బాగాలేదనే వార్తను మోసుకొ చ్చింది.

మధ్యతరగతి ప్రభుత్వోద్యోగికి నెలలో మొదటి పదిరోజులు కరెన్సీ కరకర. మధ్య పదిరోజులు చిల్లెర గలగల. చివరి పదిరో జులు అప్పుల ఆరాటం. ఇది అనుభవం చెప్పిన నగ్నసత్యం. అయినా ఎప్పుడు ఏ ఆపద ముంచుకొస్తుందో తెలీదుగదా! నెలా ఖరు రోజులు. చేతిలో చిల్లిగవ్వలేదు.

ఎప్పుడూ చలాకీగా తాను నవ్వుతూ, ఎదుటి వారిని నవ్వించే సిద్దయ్య మొహం వాడిపోయింది.

"నా భార్యంటే నాకు ప్రాణమన్నా. మా బాబు వయసు నాలుగు నెలలు దాటిం దంతే. పెళ్లైన మూడేళ్ల నుండి నా భార్య నన్నిడిచి వారం రోజులుండలేదు. నేని క్కడకొచ్చి చాలా రోజులైంది గదా. ఇప్పుడే మైందో ఏమో" బాధపడిపోతున్నాడు సిద్దయ్య.

"నీకు తెలుసు. నా దగ్గర కూడా డబ్బు ల్లేవు. కానీ నువ్వు వెంటనే మీ ఊరెళ్లి రావాలి సిద్దయ్యా"

"అదే ఎట్లా అన్నా? ఈ రోజుల్లో ఊరు దాటి అడుగుతీసి అడుగెయ్యాలంటే డబ్బు ఖర్చు మా ఊరికెళ్లి రావాలంటే కనీసం రెండొందల రూపాయలన్నా కావాలి. మనకీ ఊరు కొత్త. అప్పు గూడా పుట్టదాయె" చేతులు పిసుక్కుంటూ కాలుగాలిన పిల్లిలా పచార్లు చేస్తున్నాడు.

భారతీయ సంస్కృతిలో భార్యా భర్తల అనుబంధం అనుపమానంగదా! ప్రియ స్నేహితుడు బాధపడిపోతుంటే నా మానసిక స్థితి సంతులనం కోల్పోయింది.

"అవును సిద్దయ్యా. ఇది మన ఊరా, మన ప్రాంతమా? ఇక్కడ మన ఆప్తులెవరు న్నారు? బంధువులెవరున్నారు? కానీ నువ్వు వెంటనే బయలుదేరాలి. ఎలాగబ్బా" నేను గూడా చేతులు పిసుక్కోవడం తప్ప మరేమీ

చెయ్యలేకపోతున్నాను.

వారం రోజులైతే జీతమొస్తుంది. పదిరోజులైతే టర్మ్ హాలీడేస్. ఇప్పుడే ఈ పరిస్థితి. సిద్దయ్య కళ్లల్లో మంచుతెరలు మెరుస్తున్నాయి. నా గుండె పొరలో గులకరాయి దొర్లింది ఎప్పుడొచ్చి గడపలో నుంచుందో సత్తికొండ.

"యామైంది క్రిష్ణమూర్తీ? ఎందుకంత విచారం? ఏం బాధ అని అలాగున్నావు అర్జునా? " అంటూ లోపలి కొచ్చింది. మూడు ముక్కల్లో విషయం వివరించాను.

"అయ్యో పాపం!" సత్తికొండ వాలకం సత్తుపిండి ముద్దలాగైంది. "అయితే సిద్దయ్య వెంటనే వాళ్లూరెళ్ళాలి. కాని... డబ్బుల సమస్య గదా. నెలాఖరు రోజులాయే. నా దగ్గర పది రూపాయలు కూడా లేవే" పెదాలమీద చూపుడు వేలుంచుకుంది సాలోచనగా. చూపులు అటూ ఇటూ దొర్లుతున్నాయి.

అమ్మ దొంగా! డబ్బులు చేబదులడుగుతామని ముందే జాగ్రత్త పడిందన్నమాట. అయినా ఆమె మాకెందుకు చేబదులివ్వాలి? మేమేమన్నా బంధువులమా! కేవలం బాధితులం. పొట్టతిప్పలు కోసం వందలాది కిలోమీటర్లు దాటొచ్చిన సాధారణ ఉద్యోగులం.

అవసరాల్లో అక్కరకొచ్చినవాడే నిజమైన స్నేహితుడన్నారు. కాని... నేనో! నేను నిస్సహాయుణ్ణి.

ఏదో గుర్తుకొచ్చినట్టు ఫోజిచ్చింది సత్తికొండ. ఎలుక వేటలో పిల్లి పరుగులా అంగలేస్తూ చల్లగా జారుకుంది. అమ్మో నంగనాచి. తుంగబుర్ర.

సిద్దయ్య తలపట్టుక్కూచున్నాడు. ఎలాగైనా సరే. సిద్దయ్యను ఊరికి పంపించాలి. కాని ఎలా? తాకట్టుపెడదామంటే నాకు గానీ, అతనికి గానీ బంగారు ఉంగరం కూడా లేదు. నా గడియారం తాకట్టు పెడితే ఎంతిస్తారు? ఓ యాభై. అంతకంటే ఎక్కువ ఇవ్వరు. మరో విలువైన వస్తువు మా వద్ద లేనేలేదు. క్లాసులో ఎవరినైనా అడిగితే! ప్చ్ అంతా మాలాంటి వాళ్లే గదా! సత్యనారాయణను అడిగితే ఏమో అతడేమంటాడో! మిగతా ముగ్గురు మిత్రులు టెలిగ్రాం చూసి సానుభూతి ప్రకటించి పెదాలు చప్పరించారు తప్ప డబ్బుల సంగతి ఎవరూ ప్రస్తావించ లేదు.

ఛీ... ఇలాంటి కష్టాలొస్తాయని తెలిసుంటే అసలు ట్రైనింగ్‌కే రాకపోదు మేమో! అయినా కష్టాలు సుఖాలు రాత్రి - పగలు లాంటివి. ఒకదానివెంట ఒకటి పరుగెడుతుంటాయి.

"పొరపాటున ట్రైనింగ్‌కి వచ్చానన్నా!" సిద్దయ్య విసుక్కుంటున్నాడు. పేదవాడి కోపం పెదవికి చేటు అన్నట్టు ఏం లాభం? అరెరె సిద్దయ్య కళ్లు చెమ్మగిల్లాయే! తువ్వాలుతో అద్దుకుంటున్నాడు.

అయ్యో భగవంతుడా! పరిస్థితుల ప్రాబల్యం ఏనుగులాంటి మనిషిని కూడా పీనుగులా మార్చేస్తుందయ్యా. కడుపు కలిబెట్టినట్టయింది.

"నాలుగు నెలల బాలింత నా భార్యకేమైందో. ఎట్లున్నదో" అటు తిరిగిన సిద్దయ్య గొణుగుడు నాకు చెవులారా వినబడుతోంది.

"హర్నీ అసాధ్యం గూలా!" సత్తికొండ పునః ప్రవేశం.

"నీ భార్యకేమీగాదు సిద్దయ్యా, అంతా బాగుంటుంది. ఇందా మూడొందల రూపాయలు. తీసుకో. తక్షణమే మీ ఊరికి బయలుదేరవయ్యా బయలుదేరు బుల్లోడా!" సిద్దయ్య చెయ్యిలాగి అతని అరచేతిలో డబ్బులుంచింది.

ఆశ్చర్యం! మా చూపులు అలాగే నిలబడిపోయినై. సత్తికొండ వరాలిచ్చే దేవతలా, కొండంత దేవతలా కనబడింది. ఛీ! సత్తి

యవ్వనం అన్నది ఒక జీవిత దశకాదు. అది మానసికమైన స్థితి.
- స్వామి చిన్మయానంద

కొండ గురించి ఏదో అనుకున్నాను. ఆమెను పైనుంచి కింది దాకా చూశాను. చెవులు బోసిబోయినై. ఏదీ ఆ కర్ణాభరణమేదీ?

"నీ చెవికమ్మలేవీ? " అడిగాను.

"ఉన్నాయిగానీ ముందు సిద్ధయ్యను బండె క్కించి రావయ్యా క్రిష్ణమూర్తీ!" తొందర పెట్టింది.

"అయితే చెవికమ్మలు తాకట్టుపెట్టి... చేతి నిండా డబ్బులు తెచ్చి ఇచ్చినవన్నమాట". సిద్ధయ్య కళ్లల్లో కృతజ్ఞతలు.

"ఏదో ఒహటి. ముందు నువు బయలుదే రవయ్యా" అది కసురుడుగాదు. ప్రేమాభిమా నాల పొంగు.

వెంటనే బయలుదేరాము. సిద్ధయ్యను బస్సెకించి "కాకినాడ పోర్టు" పోస్టాఫీసు ముందట్నుంచి తిరిగొస్తున్నాను. అది మా ఇంటికి సమీపంలో ఉంటుంది. అందులో పనిచేసే సిబ్బందితో పరిచయముంది.

"సార్సార్!" పోస్టుమెన్ పిలుపు, ఆఫీసు గడపలో రమ్మని చెయ్యూపుతున్నాడు. కాళ్లీ డ్చుకుంటూ లోపలికెళ్లాను. సబ్‌పోస్టుమాస్టర్ చిరునవ్వుతో స్వాగతించి కూచోబెట్టాడు.

"సార్! ఈరోజు ఇద్దరు క్లర్కులు షార్ట్. పని బాగా ఉంది. ప్లీజ్ కాస్త ఈ యం.వో పేడ్ లిస్టులు రాసిపెట్టండి సార్" మర్యాదగా అడిగాడు. వెంటనే కాఫీలకు ఆర్డరిచ్చాడు.

ఆఫీసు రొటీన్ పనులు అలవాటైనవేగదా! అప్పుడప్పుడు ఆ ఆఫీసులో చిన్న చిన్న పనులు సరదాగా చేసిపెడుతుంటాం. ఆ పని తప్పలేదు. కకావికలమైన మనసు ఓ కొలిక్కి రావాలంటే ఏదో పనిలో మునిగిపోవాలి.

మనిషిగా కూచుండి పంజేస్తున్నానుగాని మనసు మాత్రం సత్తికొండ చుట్టే తిరుగు తోంది.

ఆమెకు, మాకు ఏమిటీ అనుబంధం? ఎందుకీ ఔదార్యం? ఆమె గూడా అందరి లాంటిదనుకుని పొరపాటుగా ఊహించాను. ఇది కలియుగమే కానీ కరుణామయులు గూడా ఉన్నారు.

సహాయ సహకారాలు మనిషిలోని మాన వత్వానికి ప్రతీకలు. చేతనైనంత సాయం చెయ్యడంలో ఎంత తృప్తి ఉందో అనుభవిస్తే గాని తెలీదు.

వేడి కాఫీ నరాలను వాడిగా మార్చేసింది. చకచకా లిస్టులు రాసేశాను.

ఆ తర్వాత ఇంకేవో పనులు సబ్‌పోస్టు రుతో కలిసి ఆరోజు ఎకౌంట్ టాలీ అయ్యే దాకా ఉండి బయటికొచ్చాను. ఏదో తృప్తి.

గదిలో ఒంటరినైపోయాను.

సృష్టి చాలా గొప్పది. పైవాడి లీల అంత కంటే గొప్పది.

ఏవిటో... తోడుగా ఉన్న మనిషి వెంట ఉన్నన్ని రోజులు ఆ మనిషి విలువ తెలి యదు. ఆ మనిషి దూరమైనప్పుడు... అర్థమ వుతుంది. అతడెంత దగ్గరైనాడో సిద్ధయ్య ఊరు చేరవచ్చు. అతని భార్యకెలా ఉందో!

అనుకోకుండా ఎద తెరమీద నా భార్య ప్రత్యక్షమైంది. పిల్లలు "నాన్నా రా" అంటు న్నారు. ప్చ్ నేను గూడా మా ఊరెళ్తే బాగుండు. భార్యాపిల్లలెట్లున్నారో ఏమో. నెల నెలా పంపించిన మనియార్డరు డబ్బులు సరిపోతున్నాయో లేవో! మా అమ్మానాన్నలు న్నారు గానీ నేను దగ్గరున్నట్లు ఉంటుందా!

చిన్న సంపాదనతో పెద్ద సంసారం. సంసార సాగరంలో ఎన్నో సుడిగుండాలను దాటుతూ, గండాల నెదిరిస్తూ మమ్మల్ని చది వించిన అమ్మానాన్నలు, అక్కయ్యల పెళ్లిళ్లతో చతికిలబడిన ఆర్థిక స్తోమత. నా భార్యా పిల్లల్ని అదనపు భారంగా భావిస్తున్నారేమో! మెదడులో రక్తనాళాలు దడదడలాడ్తున్నట్టని పించింది. రాత్రంతా కలత నిద్ర. మనసంతా గందరగోళం.

ముసురుకుంటున్న ఆలోచనలతో క్లాసుకె ళ్లాను. పలుకరించిన మిత్రులకు కృత్రిమ సమాధానాలిస్తున్నాను. అతలా కుతలమైన మానసిక పరిస్థితి శరీరాన్ని కుంగదీస్తోంది. ఒళ్లు వేడెక్కింది. ఇంటర్వెల్‌లో టిఫిన్ చెయ్యాలన్పించలేదు. తిరిగి అందరితోపాటు

క్లాసులో కూచున్నాను.

మనసుకూ శరీరానికి మహత్తరమైన సంబంధముంది. ఒకటి కోపిస్తే ఇంకొకటి ప్రకోపిస్తుంది. ఒకటి శాంతిస్తే మరొకటి సంతోషిస్తుంది. నా విషయంలో గూడా అదే జరిగింది.

పాఠం వింటూనే ఉన్నాను. అంచెలంచెలుగా జ్వరం బలం పుంజుకుంది. నరాల శక్తిని పీల్చి పారేస్తోంది. వేటగాడిని నమ్మించి అమాంతం మీద దూకిన పులిలా ఒక్కసారే చలి ముంచుకొచ్చింది. వజవజ వణికిపోతూ బెంచిమీద వాలిపోయాను. అయినా చలిపులి పొత్తికడుపులోంచి పరుగెత్తుకొస్తోంది. మూల్గుతున్నాను. నా పక్కనే కూచున్న సత్యనారాయణ

"ఆయ బాబోయ్! అల్లాగైపోయారేవిటీ?" అంటూ లేచి నుంచున్నాడు.

జ్వరం. లేవబోయాను. కుదరలేదు. వణుకు తగ్గించుకోవాలనే ప్రయత్నం విఫలమైంది.

"ఏమైంది? ఏమైందండీ?" అంటూ ఇన్స్ట్రక్టర్ నా వద్దకు నడిచొచ్చాడు. ఒళ్లు తడిమి "అరెరే... జ్వరం" అని కాఫీ తెప్పించి తాగించాడు.

పారిపోతున్న సత్తువను పగ్గాలుపట్టి ఆపేసినట్టైంది. చలిపులి పారిపోయింది. కాని తలనొప్పి. విపరీతమైన తలనొప్పి.

"నేనింటికెళ్తాను సార్" అడిగాను.

"ముందు డాక్టరుకు చూపించుకుని ఆ తర్వాత ఇంటికెళ్లాలి" సలహా ఇచ్చి పంపించాడు.

సిద్దయ్యను ఇంటికి పంపించేసరికి తలప్రాణం తోకకొచ్చింది. ఇంకా డబ్బెక్కడిది? నేరుగా గదికొచ్చాను.

కాళ్లూ చేతులు లాగేస్తున్నాయి. తలనొప్పి. తల పగిలి ముక్కలైపోదు గదా! నరాలు ఎగిరెగిరి పడుతూంటే "హమ్మా హయ్యా" అని మూల్గుతూ పడుకున్నాను. ఒళ్లంతా వేడిగా... నిప్పుల్లో కూరుకుపోతున్నట్టు మండిపోతోంది. అంతా అయోమయం.

భగవంతుడా! నా కెవరున్నారిక్కడ? సిద్దయ్య గూడా లేడే!.. ఇప్పుడేదీ గతి! ఎరగని ఊళ్లో మొరగని కుక్కనైపోయానే.

"య్యాఎందీ! య్యాఎంది క్రిష్ణమూర్తీ. ఏవిటా మూల్గులు?" పరుగులాంటి నడకతో వచ్చింది సత్తికొండ. నా నుదుటిమీద చెయ్యేసి గబుక్కున వెనక్కు లాక్కుంది.

"వామ్మో జొరం ఇంత జొరం ఎందుకొచ్చిందీ?" గుండెలు బాదుకుంది. "మాయదారి జొరం... ఒళ్లు కాలిపోతోంది"

"ఏమో ముందు చలొచ్చింది. ఆ తర్వాత జ్వరం" అవస్థలన్నీ చెప్పేశాను. అంతా గమనించిన గిరిజ అమృతాంజనం తెచ్చి తల్లి చేతికిస్తూ పక్కన కూచుంది.

"ఆస్పత్రికెళ్దామా పెద్దన్నయ్యా?" ఆందోళనగా అడిగింది.

"తర్వాత చూద్దామమ్మా..." అనగలిగాను.

సత్తికొండ ఏ మాత్రం ఆలస్యం చెయ్యలేదు. నా పక్కనే కూచుండి అమృతాంజనం సీసా తెరిచింది. మునివేళ్లతో అమృతాంజనం అందుకుంది. నుదిటిమీద, నెత్తిమీద, కాళ్లకూ, చేతులకూ, అరికాళ్లకూ వరుసగా రాసేస్తోంది.

"మాయదారి లోకమమ్మా. ఎవరి దిష్టి తగిలిందో ఏమో! పొద్దున చక్కగా వెళ్లి మధ్యాహ్నంకాక ముందే జొరంతో తిరిగొచ్చాడు" అంది కూతురుతో. గిరిజకేదో సైగ చేసింది. గిరిజ గబుక్కున లేచి వెళ్లిపోయింది.

ఆ అమ్మాయి నా గదిలో చాలాసేపు కూచుండడం బాగుండదు గదా! అనుకుంటున్నాను. ఐదు నిమిషాల్లో ఓ చేతిలో ఉప్పు, మరో చేతిలో ఎండు మిరపకాయలతో తిరిగొచ్చింది గిరిజ. ఓహో దిష్టి తీసేటందుకా!

"ఇరుగు దిష్టి, పొరుగు దిష్టి" ఇంకేదో అంటూ రెండుచేతుల్ని నాచుట్టూ తిప్పింది. ఉప్పులో నన్ను ఉమ్మెయ్యమంది. నామకార్థం ఉమ్మేశాను. చకచకా బయటికెళ్లిపోయింది.

అరగంట తర్వాత తలనొప్పి, కాళ్లూ చేతుల

నొప్పులు తగ్గుముఖం పడుతున్నాయి.

"ఇహ చాలు చాలు సత్తికొండా!" సత్తికొండ చేతులు పట్టి ఆపేశాను. "జ్వరం తగ్గిపో తుంది గదా!"

"గమ్మున కాస్సేపు పడుకో. ఇప్పుడే లేవ మాక."

హెచ్చరిస్తూ మోకాళ్లు పట్టుకుని మెల్లిగా లేచింది. నాకు తెలీకుండానే నిద్రలోకి జారు కున్నాను. గంట తర్వాత మెలకువ. ఒళ్లంతా చెమట పట్టేసింది. కొన్ని క్వింటాళ్ల బరువు నెత్తిమీంచి దించుకున్నట్టు ప్రాణం తేలికైంది.

సత్తికొండ ఎవరు... నేనెవరు? కన్నత ల్లిలా నాకెందుకు సపర్యలు చెయ్యాలి? ఉన్న ఊరికి, కన్నవారికి, కట్టుకున్న దానికి అల్లంత దూరంలో ఉన్న నా మీద... గిరిజకెందుకింత దయ?

ఆకాశంలో ఆడుకుంటున్న మబ్బులు కిటికీ లోంచి కన్పిస్తున్నాయి. నా కళ్లల్లో నీళ్లూరుతు న్నాయి. కన్నీటికీ మబ్బు హృదయమే గదా! మనసుకంటిన మలినాన్ని, కడిగేసే శక్తి కన్నీ టికి మాత్రమే ఉందన్న వాస్తవం తెలిసొ చ్చింది.

"హమ్మయ్య!" గిరిజ ప్రత్యక్షమైంది మళ్లీ. గుండెలమీద చెయ్యేసుకుని "ఇప్పుడెట్లా ఉంద న్నయ్యా?" అడిగింది.

"ఫరవాలేదమ్మా. ఒళ్లు తేలికైంది. నొప్పులు శాంతించినై." అంటూ లేచి గోడకొరిగి కూచు న్నాను. సత్తికొండ వచ్చి

"ఆయ్. మంచి పనైంది. జొరం తగ్గినట్టేనా?" అంటూ నా నుదుటిమీద అర చెయ్యి ఆనించింది.

"అంతా ఈచేతి చలువ" ఆ చెయ్యి అందు కుని కళ్లకద్దుకున్నాను. గుండె పొంగుకొ చ్చింది. కృతజ్ఞతగా చూశాను.

"అయ్యో... నా చేతిలో ఏముంది క్రిష్ణ మూర్తీ! అంతా ఆ సచ్చనారాయణసామి దయ" గుండెలనిండా ఊపిరి పీల్చుకుంది. ఆమె కళ్లల్లోని కారుణ్యం, మాటల్లోని ఆప్యా యత, స్పర్శలోని మాతృత్వం అమ్మ ఒడిలో పసిపాపనై పొరాడుతున్న అనుభూతి. చలించి పోయాను.

"ఇప్పుడెళ్దాం పద... డాక్టరు దగ్గరికి" అని లాక్కెళ్లింది. డాక్టర్ మందులు రాసిచ్చాడు. తెలిసిన వారి మెడికల్ షాపులో మందులు తెచ్చి ఇచ్చింది. డబ్బులు ఫస్టుకిద్దామంది. డాక్టర్ ఫీజు తానే ఇచ్చింది. ఇంటికొచ్చేసరికి గిరిజ వేడిపాలు, బ్రెడ్‌తో తయారుగా ఉంది. మాతోపాటు గదిలోకొచ్చి

"ముందు ఇది తిను పెద్దన్నయ్యా" అంది పాలగిన్నెను నా ముందుకు తోస్తూ. బ్రెడ్ ముక్కను పాలల్లో అద్ది నానోటికందించింది సత్తికొండ. నిజానికి నాకు ఆకలిగా లేదు. కాని తల్లీ కూతుళ్ల బలవంతమ్మీద మూడు నాల్గు ముక్కలు నమిలి మింగక తప్పలేదు. కడుపులో ఆసరాగా ఉంటేనేగదా కాలూ, చెయ్యి ఆడేది. అరచేత్తో మూతి కడిగి సత్తి కొండ తన కొన కొంగుతో పెదాలను అద్దు తూంటే తల్లి, చెల్లి, ఇల్లాలు మూడు మూర్తుల ఏకరూపంగా అనిపించింది. మళ్లీ ఆలోచన... ఈమె ఎవరు? నేనెవరు? ఈ ఋణం తీరే దెలా?

గుండె పొంగుకొచ్చింది. ఆర్ద్రత కంటినీరై, బిందు రూపమైంది. మబ్బు తెరల్లోంచి చూస్తున్నాను.

"ఏవిటి క్రిష్ణమూర్తీ అట్టా సూత్తున్న వేటి?" అడిగింది.

అప్పటికే నా గుండె కరిగి కళ్లను తడిపే సింది గదా.

"పూర్వ జన్మలో మీకు ఋణపడుంటాను. అదింకా పెరుగుతోంది" చేతులు జోడిం చాను.

"అదేటీ?" గమ్మత్తుగా నవ్వింది. ఆ నవ్వు పెదాలకే పరిమితమైంది. అయినా అందులో ప్రేమ, వాత్సల్యం కలగలిపి వినిపించినై. "ఈ మాత్రానికి ఋణం గిణం అనాలా! మీరు మాకు చేసిన సాయంముందు ఇదెంత? పడు కోవయ్యా క్రిష్ణా హాయిగా పడుకో" మంద

లిస్తూ దిండు సరిజేసి వెళ్లిపోయింది.

"ఏదన్నా అవసరముంటే కేకెయ్ పెద్దన్నయ్యా!" అంటూ గిరిజ తల్లిననుసరించింది.

గిరిజ ద్వారా విషయం కనుక్కుని "అయ్యో పాపం" అన్నారు శ్రీమతి రాజయ్య, శ్రీమతి ఆనందం. అది నాకు వినిపించింది. శ్రీమతి కాశీనాథ్ గదిలోంచి బయటకు రాలేదు. కాకినాడలో ఉన్న దూరపుబంధువుల ఇంటికెళ్లొచ్చింది రోహిణి. సత్తికొండ ద్వారా విషయం తెలుసుకోగానే

"ఏమైందన్నయ్యా?" అంటూ గదిలోకొచ్చింది.

"ఆc... ఏముందమ్మా, ఏదో జ్వరం. చలి జ్వరం" పెదాలు చప్పరించాను. కాని సత్తికొండ అంతా చెప్పేసింది గదా!

సాయంత్రం లోకాభిరామాయణం కాశీనాథ్, రాజయ్య, ఆనందం, సత్యనారాయణలకు రోజుట్లాగే మా గదిలోనే పొద్దుగడిచింది. సమయానికి గుర్తుచేసి టాబ్లెట్లు వేసుకునేదాకా పట్టుబట్టింది సత్తికొండ.



రాత్రి ఎనిమిదిన్నరకు వరంగల్ మెట్టయ్య, అనంతపూర్ వేణుగోపాల్‌లు పలుకరించేందుకొచ్చారు.

"భలే తమాషా ఉందే!" నా పక్కన కూచుంటూ అన్నాడు వేణుగోపాల్. "మార్నింగ్ క్లాసుకు వచ్చినప్పుడు బాగానే కన్పించారు గదా అంతలోనే ఏమైందీ?"

"అదే పాపం! చలి జ్వరమటండీ!" సత్యనారాయణ జవాబిచ్చాడు. "ఒక్కరోజు జ్వరం ఆరునెలల బలాన్ని లాగేస్తుందటా. చూడండి గురూగారెలా డీలా పడిపోయారో"

"ఏదో మామూలు జ్వరమే అన్పిస్తుంది గాని అశ్రద్ధ చెయ్యొద్దు" మెట్టయ్య అందుకున్నాడు. "డాక్టర్ మందులు రాసిండు గదా. రేపు సండే ఫుల్ రెస్ట్. ఎల్లుండికి నార్మలైపోతుంది."

కాస్సేపు ఆమాటా, ఈమాటాతో గడిచింది.

మూడోరాజు సిద్దయ్య నేరుగా క్లాసులో కనబడ్డాడు. అతణ్ని వెంటనే పలుకరించాలనీ, అతని భార్య ఆరోగ్యం గురించి తెలుసుకోవాలనీ మనసు ఉబలాటం.

ఇంటర్వెల్‌లో తానేవచ్చి నా పక్కన కూచున్నాడు.

"ఏందన్నా జ్వరమొచ్చిందటా! మొహమంతా ఎట్లానో ఉంది" దోసె, ఉప్మా ప్లేటు నా చేతికందిస్తూ తానే పలకరించాడు.

కాంటీన్ మా మిత్రులతో కిటకిటలాడ్తోంది. మాకు తోడుగా టెలీఫోన్ ట్రెనింగ్ కొచ్చిన కొత్త బ్యాచు ట్రైనీస్ గూడా రద్దీని పెంచేస్తున్నారు.

"చలి జ్వరం వచ్చింది. నువ్వెళ్లాక ఏదోలా ఐపోయినాను. సరే నీ భార్యకెట్లా ఉంది? అసలేమైంది?" దోసె ముక్కకు ఉప్మా దట్టిస్తూ అడిగాను. దోసె ఉప్మా కాంబినేషన్ బాపు-రమ చిత్రం సాహిత్యంలాగుంది. రుచంటే అదే.

"ఏమీ లేదన్నా, నామీద బెంగతో అట్లయింది. ఈ మూడ్రోజుల్లో నార్మలైపోయింది. తీసుకెళ్లి పుట్టింట్ల దింపేసి వచ్చిన" తేలిగ్గా నవ్వేశాడు. నా మనసు తేలికై మామూలు స్థాయికొచ్చింది. రొటీన్ వైపు మళ్లింది.

ఇంటికొచ్చాక సత్తికొండ అంతా చెప్పేసింది. "ఎంత పనైందన్నా. సమయానికి నేను గూడా లేను." అంటూ బాధ పడ్డాడు. సత్తికొండవైపు మొదట కృతజ్ఞతగా తేరిపార జూసి ఆ తర్వాత జోకాభిరామాయణంలోకి

దింపాడు. మొదటి తేదీనాడు మొట్టమొదట సత్తికొండ కర్ణాభరణం విడిపించుకొచ్చాం. చిల్లర బదుళ్ళు తీర్చేశాం.

★ ★ ★

సెలవు లనగానే నవనాడుల్లో నూతన శక్తి గంతులేసింది. జ్ఞాపకాల పొరల్లో విద్యార్థి జీవితం సెలవుల సంఘటనలు కళ్ళ ముందు కదలాడాయి. వారం రోజులు టర్మ్ హాలీడేస్ ప్రకటన వినగానే వరాల మూట దొరికినట్టనిపించింది.

సిద్ధయ్యా, నేను సెలవుల్లో ఊరికెళ్ళాలని ఉత్సాహంగా తయారవుతున్నాం. సత్యనారాయణ తప్ప ఫ్యామిలీస్‌తో ఉన్న మిత్రులంతా అక్కడే ఉండాలని నిర్ణయించుకున్నారు.

"వారం రోజులు సెలవులని దర్జాగా పెళ్ళాంతో ఇంటికెళ్ళి రావాలంటే నెల జీతం గోవింద గొడుతుంది. అటెన్క పైసలకోసం పరేషానై పోవాలే" తన నిర్ణయాన్ని గట్టిగా సమర్థించుకున్నాడు రాజయ్య. "మీరు ఒంటి గుంటిరిగదా. పొయ్యిరాండ్రి" సలహా గూడా పారేశాడు.

"ఇహ రెండు పుంజుడుల రోజుల్దాకా కన బడరన్న మాటా" మా ముందుకొచ్చి నుంచున్న సత్తికొండ డల్‌గా కన్పించింది. "గిరిజ గూడా వాళ్ళింటికెళ్ళిపోయింది. సిద్దులూ!" అంటూంటే గొంతు గోడలకు ఏదో పాకు తున్నట్టు వినబడింది.

"అరెరే గిరిజను పంపించేది కాకుంటే"

"పంపనంటే కుదురుద్దా! అల్లుడుగారిప్పుడి ప్పుడే దారిలోకొస్తున్నాడు గదా. మరో మూడు నాలుగు రోజుల్లో తిరిగొస్తే బావుం డేది" ఆరాటం అన్యాపదేశమైంది.

"అమ్మో అది మాత్రం కుదరదు" అనే శాను.

సూటుకేసుతో తయ్యారై వచ్చిన సత్యనారాయణను అడిగాను. "పుంజుడు అంటే ఏమిటి సత్యనారాయణ గారూ? "

"చెప్పవయ్యా ధర్మరాజా" సత్తికొండ కూడా అడిగింది. ఆమె సృష్టించిన పంచపాండవుల్లో సత్యనారాయణ ధర్మరాజు.

"ఓహో తెలంగాణా ప్రాంతంలో ఈ పదం వాడరన్నమాట. పుంజుడు అంటే నాలుగు"

"అదా!" సిద్ధయ్య సూటుకేసుతో బయటి కొస్తూ "తెలంగాణాలో దాన్ని కుచ్చం అంటారు. అవును. రెండు కుచ్చాల రోజుల తర్వాతనే తమరి దర్శనం చేసుకుంటాం సత్తి కొండ!" హుషారుగా చెయ్యూపాడు.

"తమరు, చమురు అంటూ తమాషాచేస్తే మెడకాయ మీద తలకాయ దక్కదు. జాగర్త. అయినా ఈ మొనగాడి కోసమెవ్వరూ ఇక్కడ కాచుక్కూచుండలేబుల్లోడా!" అని అంటుందని ఆమెవైపు నా చూపులు మళ్లాయి.

అంచనా తారుమారైంది. సత్తికొండ మొహము పగటి కలువలా ముడుచుకుపో యింది. నుదిటిమీద గీతలు మెడకింద ముడతలు స్పష్టంగా కనబడుతున్నాయి.

పాపం! మనసులో ఎలా ఉందో ఏమో! మా ఇద్దరిని మార్చి మార్చి చూస్తూ "క్రిష్ణ పరమాత్మా! క్షేమంగా ఎల్లి లాభంగా తిరిగి రండి. అర్జునా! నీ భార్య ఆరోగ్యం జాగర్త! కానీ నువ్వో రోజు ముందొస్తే ఏమవుద్దటా!" అంది ఆ మాటల్లో ఆత్మీయతాభిమానాలు కలబోసుకున్నాయి.

అనూహ్యంగా సిద్ధయ్య వాలకం గంభీర మైంది.

"ప్రయత్నిస్తా సత్తికొండా" చూపులు నేలకు వాలాయి. రెండడుగులు ముందుకేసి ఆగిపో యాడు.

"మేమెళ్లొస్తామన్నయ్యా!" అంటూ రోహిణి సత్యనారాయణ వెంట బయటకు నడు స్తోంది. "ఆటో రెడీగా ఉంది. మీరు కూడా రైలుస్టేషన్‌కేగా, కలిసెళ్దాం రండి!" అంది వెనక్కు తిరిగి.

"ఒక్క ఆటోలో లగేజీ మీరు ముగ్గురు, వీళ్లిద్దరూ ఊహుఁ! కుదరదుగానీ మీరెళ్లం డమ్మా." సత్తికొండ సర్దిచెప్పింది. వీళ్లింకాస్సేపుంటే నీ సొమ్మేమైనా పోయిందా అన్నట్టుగున్నాయా మాటలు.

"తొందరగా వెళ్దామన్నా" సిద్దయ్య రమ్మంటున్నాడు.

"ట్రైన్‌కు ఇంకో గంట టైముందిగదా!" అంటూ సూటుకేసుతో బయటికొచ్చి గదికి తాళం వేశాను.

ఏదో గుర్తుకొచ్చినట్టు సత్తికొండ గబాల్న వెనక్కు తిరిగింది. "అర్జునా కాస్తాగవయ్యా. ఐదు నిమిషాల్లో కాఫీ కలుపుకొచ్చేత్తా. కాస్సేపలాగే నుంచో. ముందుకెళ్లావో నామీద ఒట్టు" అంటూ గదిలోకెళ్లింది.

ఇద్దరమూ మొహాలు చూసుకుంటూ నుంచున్నాం. అన్నట్టుగానే ఐదారు నిమిషాల్లో కాఫీ గ్లాసులతో తిరిగొచ్చింది సత్తికొండ. అంతరంగ తరంగాల్లోని ఓ తరంగం. "సత్తికొండ నొదిలి పోతున్నావుగదూ!" అని నిలదీసింది. కాఫీ చప్పరిస్తూ "కాఫీ రుచి అద్భుతం. అమృతంలాగుంది" అన్నాను. అనుకోకుండా నా కనుబొమ్మలెగిరిపడ్డాయి. సిద్దయ్య పెదాలమీద ముసిముసి నవ్వు.

"అది నీ అభిమానం క్రిష్ణా" నల్లని పెదాల మీద తెల్లని చిరునవ్వు చెమక్కుమంది, కానీ, ఆ నవ్వులో జీవంలేదు. యాంత్రికంగా తలూపింది.

"అదేంగాదు. అన్న సరిగ్గా చెప్పిండు. కాఫీయే కాదు, నీ దగ్గర ఏం మంత్రబల ముందో గానీ నీచేతి వంటకాలు చాలా రుచిగా ఉంటై" అంటూ ఖాళీగ్లాసు పక్కనపెట్టాడు సిద్దయ్య.

సుప్రభాత సమయాన తూరుపు లోగిలిలా సత్తికొండ మొహం చప్పున విచ్చుకుంది. "ఎల్లగానే ఓ ఉత్తరం ముక్క రాయండయ్యా!" గోముగా అడిగింది.

"తప్పకుండా!" కోరస్‌గా జవాబిస్తూ బయటికొచ్చాం. స్టేషన్ కొచ్చేసరికి గోదావరి ఎక్స్‌ప్రెస్ మా కోసమే ఎదిరిచూస్తున్నట్టు సిద్ధంగా ఉంది. రాత్రి ప్రయాణం. మేమిద్దరం విజయవాడ దాకా కలిసి వెళ్లాలి. ట్రెయిన్లో ముచ్చట్లు. ఇతివృత్తం సత్తికొండనే.

రాత్రి రెండు గంటలకు సిద్దయ్య విజయవాడలో దిగిపోయాడు. మళ్లీ ముందుకు ప్రయాణం. కిటికీ తెరిచి కూచున్నాను. బయట నేలమీద మల్లెపూలు పరిచినట్టు పరుచుకుంది వెన్నెల. రైలు ముందుకు పరుగెడుతూనే ఉంది. వెన్నెల స్నానాలు చేస్తూ చెట్లు వెనక్కు పరుగెడుతున్నాయి. గుట్టలు, పుట్టలు నవ్వుకుంటున్నాయి.

ఆకాశమైదానంలో వెలుగులు విరజిమ్ముతూ చంద్రుడు సజావుగా సాగిపోతున్నాడు. చందమామరావే, జాబిల్లిరావే... నానమ్మ ఒడిలో కూచుండి పాలబువ్వ తింటున్న పసితనం గుర్తుకొచ్చింది.

కిటికీలోంచి కనువిందు చేస్తున్న ప్రకృతి అందాలు పులకలు రేపుతున్నాయి. కుడిచేతి వేళ్లమీద ఏదోపాకుతున్నట్టనిపించింది. ఉలిక్కిపడి చెయ్యెత్తి దులిపి పారేశాను. వెంటనే ఆటువైపు మళ్లింది చూపు.

"వారెవ్వా కృష్ణమూర్తీ!" నా పక్కన కూచున్న టిప్‌టాప్ జంటిల్‌మేన్ పగలబడి నవ్వుతున్నాడు. అతని పక్కన అందాల భామ ఆల్చిప్పల్లాంటి కళ్లు ఆనందజ్యోతుల్లా మెరుస్తున్నాయి.

"ఎవరబ్బా!" నా చూపులతన్ని ఆసాంతం తడిమాయి.

"గుర్తుబట్టలేదా? " నా చెయ్యందుకుని చెంపకు రాసుకున్నాడు. జ్ఞాపకాల పొరల్లో ఓ మెరుపు మెరిసింది.

"అరె భగవాన్! నువ్వా! ఇప్పుడు ఇట్లా ఎక్కడినుండి ఎక్కడికి? " విద్యార్థి జీవితం గుర్తుకొచ్చింది.

"అవును... అక్షరాలా భగవంతరావునే. విజయవాడలో ఇంజినీర్‌గా పనిచేస్తున్నాను. గవర్నమెంటు జాబ్. హాయిగా ఉంది. ఈ మధ్యనే పెళ్లైంది. ఈమె నా అర్థాంగి. హైదరాబాద్‌లో పుట్టిపెరిగింది. వీళ్లనాన్న కూడా ఇంజినీరే. ఇప్పుడు వీళ్ల పుట్టింటికే వెళ్తున్నాం." మాటల్లో హుందాతనం.

అందాల భామ మోము పున్నమి కలువలా విచ్చుకుంది.

బడిలో భగవంతరావు నా క్లాసు మేటు. కవ్వింపులు నవ్వింపుల ఒరవడిని కాలగతి ఎలా మురిపిస్తుందో మరిపిస్తుందో! దానికి నిదర్శనం భగవాన్. నాతో ఎన్నడూ పోటీకి రాడనుకున్న ఆవరేజ్ స్టూడెంట్. ఇప్పుడు చేతులనిండా సంపాదిస్తున్న ఇంజనీర్. మా క్లాసుమేట్స్‌లో ఇద్దరికి మెడిసిన్‌లో, మరో ఇద్దరికి ఇంజినీరింగ్‌లో సీటు దొరికింది. చదువుల తల్లి కరుణాకటాక్ష వీక్షణాలలో నడయాడిన నాకు, భగవాన్‌కు ఇంజినీరింగ్‌లో మెరిట్ ప్రకారం సీట్లు లభించాయి. కాని ఏంలాభం? దేవత వరమిచ్చినా పూజారి వరం నాకు లభించలేదు. ఆ రోజుల్లో కాసింత కాసుల గలగల వినిపిస్తే నా ఇంజినీరింగ్ క్లాసులో అడ్మిట్ చేసుకునే వారు. పన్నెండు వందల రూపాయలు అడ్మిషన్ ఫీజుగా చెల్లించాలి. పన్నెండు వందల రూపాయల కోసం పడరాని పాట్లు, అయిన వారితో తిట్లు, పేదరికంతో భవిష్యత్తుకు తూట్లు. మనసారా ఏడ్చి ఊరుకొమ్మన్నాయి. సీటు దొరకడమే సింహాసనం లభించినంతగా ఫీలైన భగవాన్ వెంటనే జాయినైపోయాడు.

"ఇంజినీరింగ్‌లో సీటు అంటే నువ్వదృష్టవంతుడివి అన్నారెందరో. కాని పేదరికం, ఫార్వర్డ్ కాస్ట్. కాడి జోడెడ్లుగా మారి నా బతుకు బండిని అయోమయం బాటలో నడిపిస్తాయని ఎవ్వరూ ఊహించలేదు. ఆ సమయంలో పన్నెండొందల రూపాయలు మానాన్న సమకూర్చగలిగినా, ఎవరన్నా అప్పిచ్చినా ఇంజినీరింగ్ మొదటి సంవత్సరం గట్టెక్కేది. ఆ తర్వాత మెరిట్ స్కాలర్‌షిప్‌తో మిగతా కోర్సు పూర్తయ్యేది. ఈ పాటికి ఇంజినీర్ హోదాలో వెలిగేవాణ్ని.

ఆశలు ఆకాశంలో విహరిస్తుంటే, నుదుటి రాత పాతాళానికి తొక్కేసింది. మధ్యతరగతి మంటల్లోనే మాడిపొమ్మని శపించింది. మనసు వికలమైంది.

"ఏంది కృష్ణమూర్తీ... అట్లా బొమ్మలెక్క చూస్తున్నావేందీ? ఇంకా పూర్తిగా గుర్తుకు రాలేదా!" కరచాలనంతో చెయ్యి కదిలించాడు భగవాన్.

ఆరాటానికి, అదృష్టానికి మధ్య నలిగిపోయిన ఆనాటి పరిస్థితులు నెమరుకు రాకుండా సర్దుకోవాల్సి వచ్చింది.

"మా బాగా గుర్తుబట్టానబ్బా. అన్ని సంవత్సరాలు ఒకే క్లాసులో కూచున్నాం. నిజ జీవితంలో మన క్లాసులు మారిపోయినై గదా! నిన్ను అంత తొందరగా మరిచిపోతానా".

"వెరీఫైన్ చెప్పు... ఎక్కడున్నావ్, ఏంజేస్తున్నావు? నీ మాటతీరులో మాత్రం మార్పు లేదబ్బా" నవ్వేశాడు.

నా జీవన చదరంగంలో ఆశల గుర్రాల పరుగులు, ఆటంకాల పరిణామాలు, ప్రస్తుత జీవన పరిమాణం వివరంగా చెప్పేశాను. మా మాటల మధ్యన శిరీష కల్పించుకుంది. శిరీష కుసుమ పేశల సమానమైన ఆమె సంస్కారానికి జోహార్లర్పించాల్సిందే. ఆమె



**ఎదురుచూడద్దు**

ఓరోజున ఓ యువకవి శ్రీశ్రీతో మాట్లాడుతూ 'యువతకు మీరిచ్చే సందేశం ఏమిటి?' అని అడిగాడు.

వెంటనే శ్రీశ్రీ 'ఏవరి సందేశాలకోసం ఎదురు చూడద్దని' అంటూ రకీమని బదులిచ్చారు.

మాటల్లో స్వచ్ఛమైన స్నేహశీలత వ్యక్తమైంది. కలుపుగోలుతనం కట్టి పడేసింది.

"ఈ కృష్ణమూర్తి మా క్లాసులో ఫస్ట్ ఇన్ ఫస్ట్. చిచ్చరపిడుగు. అంతే కాదు కవిత్వం, కథలు గూడా ఇతని కలం నుండి జాలువారుతుంటాయి" అంటూ పరిచయం చేశాడామెకు. చేతులెత్తి నమస్కరించిందామె.

"మీరదృష్ణవంతులు. కళామతల్లి కరుణ అందరికీ లభించదు గదా!" చిరునవ్వుతో ప్రారంభించి గలగలా మాట్లాడింది. ఆధునిక సాహిత్యం గురించి ఆమెకెంతో అవగాహన ఉంది.

మాటామంతీ రైలుతోపాటు సమయం గూడా పరుగులు తీసింది. కాజీపేట స్టేషన్ వచ్చేసింది. ఒళ్లు విరిచి, సూటుకేసు అందుకుని రైలు దిగాను. నాలుగ్గైంది.

ఇంకా తెల్లవారలేదు. ఆరింటికి హన్మకొండ నుండి మా సిద్దిపేటకు మొదటి బస్సు. ఇంకో రెండు గంటల సమయం... బలవంతంగా గడపాలి.

కొద్దిసేపు కాజీపేట రైల్వేస్టేషన్‌లో కాళ్లు కదిపి అటూ ఇటూ తిరిగాను. "చాయగరం చాయగరం" చాయవాలా పిలుపు కర్ణపేయంగా వినబడింది. గబగబా కాలకృత్యాలు తీర్చుకుని వేడి టీ సేవించాను. ఐదైంది. స్టేషన్ బయటికొచ్చాను. లోకల్ బస్సెక్కి హన్మకొండ చౌరస్తాలో దిగాను. సూటుకేసును గట్టిగా పట్టుకుని కాలినడకన హన్మకొండ బస్‌స్టేషన్ చేరుకున్నాను. సిద్దిపేట బస్సు సిద్ధంగా ఉంది. చేతిగుడ్డతో సీటు తుడిచి కూచున్నాను.

సగటు జీవి బతుకుబాటలో... శృతి తప్పిన పాటలా సిద్దిపేట బస్సు కంకర రోడ్డు మీద తంటాలు పడుతూ పరుగెడుతోంది. ఎగుడుదిగుడు రోడ్డు నా బతుకు బాటలాగే ఉంది. బాట ఎలాగున్నా ప్రయాణం ఆగదు గదా!

భగవాన్ భార్య నన్నో అదృష్టవంతుడిగా మార్చెయ్యడంలోని ఆంతర్యమేమిటి? ప్రభుత్వం నిర్వహించిన క్లాసు పరీక్షల్లో ఫస్ట్ క్లాసులో పాసైనంత మాత్రాన ఏం లాభం? జీవన గమనంలో చివరి వరుసలో ఉన్నాను. ధనం మూలం ఇదం జగత్ సామెత కొంత వరకు నిజమే.

ఎక్కడి నుంచో పిల్లనగ్రోవి... మురళీ గానం చెవుల కింపుగా వినబడుతోంది. కిటికీ లోంచి బయటకు చూశాను. చల్లని గాలి తరగలను చీల్చుతూ చూపులు అటూ ఇటూ చెంగలిస్తున్నాయి. రోడ్డు పక్కన విశాల మైదానములో పశువుల మంద. బాలభానుని సుప్రభాత కిరణాలు ఆలమందల కొమ్ములకు బంగారు పూతలు పూస్తున్నాయి. మంద మధ్యన దున్నపోతు. దానిమీద పదేళ్ల పిల్లవాడు ఒంటి మీద బుడ్డగోచి తప్ప మరేమీ లేదు. పెదాల మధ్య పిల్లనగ్రోవి ఏడు రంధ్రాల్లోంచి సప్తస్వరాలు జాలువారుతున్నాయి. మురళీగానం కమ్మగా స్వరాలు నరాలను కదిలిస్తున్నాయి. చిత్త చాంచల్యం మాయమైంది. ఆ ఆనందనందనవన విహారము ఎంతో సేపు సాగలేదు. బస్సు ముందుకెళ్తోంటే మురళీరవం వెనక్కు వెళ్తోంది. ఆ అనుభవం బాపతు అనుభూతితో సిద్దిపేటలో బస్సు దిగి మా ఊరు చింతమడ్క... బస్సులో దూరాను. పదిన్నరకు బస్సు దిగాను. కాళ్లీడ్చుకుంటూ మూడు కిలోమీటర్లు నడిచి ఇల్లు చేరాను.

"నాన్నొచ్చిండు నాన్నొచ్చిండు" ఐదేళ్ల నా సుపుత్రుడు ఎదురొచ్చి నా కాళ్లను చుట్టేశాడు. అంతరాళాల్లో అణిగిమణిగి ఉన్న పుత్రవాత్సల్యం పొంగి చేతుల్లోకొచ్చింది.

"నాన్నా అర్జునా!" అమాంతం లేవనెత్తి గుండెలకు హత్తుకున్నాను. ఎదనిండా ఆనంద సందోహం. గబగబా లోపలి నుండి వచ్చిన నా భార్య కళ్లల్లో వెలుగు... బుగ్గల మీద నునుసిగ్గులు పొటమరిస్తున్నాయి. ఆర్నెల్ల కూతురు ఉయ్యాలలో హాయిగా నిద్రబోతుంది.

సంతోషం ఉద్వేగం ఉత్తేజం కనుగుడ్ల చుట్టూ ఆనంద బాష్పాలు అలుముకుని చూపు మసకబారింది.

"బాగున్నావా నాయనా?" అమ్మ నన్ను ఒడిలో చేర్చుకుంది. అమ్మ ఒడి... అమృతం సేవించినట్టుంది". పిల్లలిక్కడ, నువ్వక్కడ... ఇంకెన్ని రోజులు రా ఈ ట్రైనింగ్?"

"మూడునెలలు గడిచినై. మరో మూడు నెలలమ్మా" ఆ తర్వాత మూడు నెలలు హైద్రాబాద్‌లోనే ప్రాక్టికల్ ట్రైనింగ్" అనగానే నాన్న అందుకున్నాడు. "హైదరాబాద్‌లోనైతే కోడల్ని, పిల్లల్ని తోలుకపోవచ్చు అత్తగారింట్ల హాయిగా ఉండొచ్చు".

నాభార్య చూపులు నన్ను ఆపాదమస్తకం తడుముతున్నాయి. అప్పటి సంగతి అప్పుడు చూసుకోవచ్చు గదా అంటున్నాయా చూపులు.

కలిమికి దూరమై, కరువుకాటకాలకు చేరు వైన మెతుకు జిల్లా (నేతిబీరకాయలో నెయ్యెంతో, మెతుకుల జిల్లాలో మెదకు అంత అంటుంటారు పెద్దలు) మారుమూల విసిరే యబడిన మా ఊరికి ప్రగతి అంటే ఏమిటో పిసరంత గూడా తెలీదప్పటికి.

బాల్యమిత్రుల పలుకరింపులు, పెద్దమను షుల చల్లని మాటలు మూడ్రోజులు మూడు నిమిషాల్లో గడిచిపోయినై. కాకినాడ కబుర్లు అందరికీ చెప్పేశాను.

నాల్గోరోజు విద్యుత్ శాఖలో పనిచేస్తున్న మా తమ్ముడొచ్చాడు- హైద్రాబాద్ నుండి.

"కాకినాడ సముద్రమేమంటుంది బావ గారూ?" మరదలు మర్యాదగా పలుకరిం చింది.

"ఏమంటుందమ్మా. మీ సంసార సాగరం నాకంటే లోతైనది. జాగ్రత్త సుమా అని హెచ్చరించింది".

హాపీగా నవ్వుకున్నామంతా.

మే మాసం. ఎండలు జోరందుకున్నాయి. మిడిమిడి జ్ఞానంతో మిడిసిపడుతున్న పండి తుని గంభీరోపన్యాసం వీలున్న, అక్షరజ్ఞానం లేని అర్భకుల్లా నోరుదెరిచిన పొలాలు, నీళ్ల లేక బావురుమంటున్న మోట బావులు, తడి కోసం తహతహలాడ్తున్న ఇంటి బావులు గుండెల్ని గుబగుబ లాడిస్తున్నాయి. నిప్పులు చెరుగుతున్న పగటి ఎండకు జడిసి జనాలు ఇంటి నుండి బయటకు రావడం లేదు. నాలుగో రోజు ఇంట్లోనే నలుగురి మధ్య గడి చింది.

ఐదోరోజు, తమ్ముడి వెంట చిన్ననాటి స్నేహితులతో మామిడి తోటలోకెళ్లాను. తోట తల్లిఒడిలా చల్లగా ఉంది. కొమ్మల నిండా వ్రేళ్లాడుతున్న మామిడి కాయలతో మామిడి చెట్టు నిండు గర్భిణిలాగుంది. చెట్టు నీడ చెమట ధారల్ని మింగేస్తుంది. కొందరు చెట్టెక్కి మామిడికాయలు తెంపి కిందికి జార విడుస్తూంటే, మరికొందరు అవి నేల మీద రాలి పగిలిపోకుండా గోనెసంచులు లాఘ వంగా విసురుతూ, కాయలనందులోకి దింపు కుంటున్నారు. ఆ కాయలే మాగి, అమృత రసాన్నందిస్తాయి. నేనో పక్క గోనెసంచి పరుచుక్కూచున్నాను.

ఆ ప్రక్రియనలాగే చూస్తూ ఎంత సేపుం డాలి? చెట్టు మీదే మాగిన రెండు పళ్లనప్ప టికే లాగించాను. తెంపిన తర్వాత మాగిన పండుకంటే చెట్టుమీద మాగిన పండు రుచి అమోఘం. అమృతమంటే అదేనేమో.

"ఆ మాత్రం పని నువ్వు చెయ్యలేవా?" అదృశ్యశక్తి ఏదో నన్ను నిలదీసింది. నేనూ ఓ చెట్టెక్కాలని నిర్ణయించుకున్నాను. గబగబా కాండము కానిన కొమ్మసాయంతో పైకి ఎగ బాకాను. కాని... నరమాంసం వాసన చూసిన రాక్షసమూకల్లా ఎర్రగండు చీమలు పరుగెత్తుకొచ్చి నా ఒంటిపైకి పాకి చిటపట కుట్టేస్తున్నాయి. అమ్మో తేళ్లు కుట్టిన మంట. గబుక్కున దిగి పాంటూ, షర్టు విడిచి దులి

ప్రారబ్ధం బంధువులను సమకూరుస్తుంది. ఎన్నిక స్నేహితులను ఇస్తుంది.

– కాటో



**ఉ'దారుడు'**

హరికథ పితామహులు ఆదిభట్ల నారాయణ దాసు గురించి ఒకాయన ఓ పుస్తకం రాసి అభిప్రాయం కోసం శ్రీశ్రీకి పంపారు. అందులో- ఆదిభట్లపైగల అభిమానంతో ఆ రచయిత ఆయన శృంగారవిషయాల్నికొద్దికొద్దిగా ప్రస్తావించడంతోపాటు -వివాహానికి ముందు ఎలా ఉన్నా పెళ్లయ్యాక ఆయన ఏకపత్నీవ్రతులు కితాబిచ్చారు.

'పుస్తకం బాగుంది.. అయితే దాసుగారికి ఏకపత్నీవ్రతం అంటగట్టి మీరు ఆయనను కించపరచలేదుగానీ కొంచెపరిచారు.. దారలెందరో గల ఉదారులాయన..' అంటూ జవాబు రాశారు శ్రీశ్రీ.

కొంచెపరచడం.. దారలు(భార్యలు) ఎందరోగల ఉదారులు అనడం శ్రీశ్రీ గడసరితనానికి మెచ్చుతునకలు!

పేసుకున్నాను.

కాయలు తెంపుతున్న వాళ్లు, సంచుల్లో నింపుతున్న వాళ్లు పకపకా నవ్వుతుంటే- తల తీసేసినట్టనిపించింది.

"మామిడి చెట్టెక్కడమంటే దోమల్ని కొట్టడం కాదు కృష్ణమూర్తీ" చెట్టుమీదున్న బాల్య స్నేహితుడు నవ్వాపుకుంటున్నాడు. ఒడుపుగా , జాగ్రత్తగా ఎక్కాలె, లేకపోతే ఎర్రచీమలు ఆగం జేస్తయ్..." ఏవేవో జాగ్రత్తలూ చెబుతున్నాడు.

"అదే చెడ్డీ బనీను మీద స్నానం జేసి రాపో అన్నయ్యా, ఆ పక్క బావిల నీళ్లున్నయిలే" తమ్ముని సలహా. ఆ సలహాను ఆర్జెంటుగా పాటించకపోతే చీమలు కొరికి కప్పబెట్టేలాగున్నాయి. ఎంత దులిపినా లాభం లేదని తేలిపోయింది.

బావి దగ్గరికి పరుగెత్తాను. ఆ దిగుడు బావిలో నీళ్లున్నాయి. తల్లి ఒడిలో పసి బాలుడిలా అరగంటసేపు ఈదులాడి, మనసారా స్నానం చేసి తిరిగొచ్చాను.

"అమ్మో! అన్ని చీమలొక్కట్టై ఎగబడి నన్ను చంపుకుతిన్నై కదా, మీరంతా చెట్టుపైకెక్కి అంతసేపు కూచుండికాయలెట్లా తెంపుతున్నారు? " అడిగాను చెట్టుమీదున్న తమ్ముణ్ణి.

"చెట్టు మీదికి ఎటువైపు ఎక్కాలెనో, ఎక్కడ చేతులెయ్యాలెనో ముందే చూసుకుని ఒడుపుగా ఎక్కాలె. చీమలు దగ్గరకొచ్చేలోగా అక్కడుండగూడదు. అట్లా తప్పించుకుంటు కొమ్మల మీదికి రావాలె... కట్టెకు కట్టిన ఈ జాలలతో కాయలు తెంపాలె. అలవాటైతే కష్టమనిపించదన్నయ్యా" తన అనుభవసారాన్ని ఒలక బోశాడు.

డిగ్రీ చదువు పూర్తవగానే ఉద్యోగం దొరక్క వాడు చాలాకాలం ఇంటి వద్ద ఉన్నాడు. అదే కాలం కలిసొచ్చి అలాంటి పనులు నేర్పించింది. అటు డిగ్రీ పూర్తయిందో లేదో ఉద్యోగమొచ్చి నా ఒళ్లో వాలింది. అదీ సంగతి. ఇహ జీవితంలో మామిడి చెట్టు ఎక్కవద్దనుకున్నాను.

ఎండపూటంతా మామిడి తోటలో కరిగిపోయింది. సాయంత్రమైంది. మాటలతో, మామిడి కాయల మాటలతో ఇంటికి తిరిగొస్తున్నాం. అప్పటికే వాతావరణంలో వేడి తీవ్రత తగ్గుముఖం పట్టింది. బాట పక్కనే

చెట్ల కొమ్మలు వయ్యారంగా తలలూపుతున్నాయి. సూర్యుడు ఆరోజుకు పరుగులు చాలించి పడమటి తలుపులు తడుతున్నాడు. ఆకాశమార్గాన పక్షులు వరుసలు కట్టి పయనిస్తున్నాయి.' అప్పటి వరకు అడవిలో కడుపారమేసిన పశువులు లాఘవంగా కొమ్మలాడిస్తూ ఇంటిముఖం పట్టాయి. గాలితో కలిసి పైకెళ్లిన గోధూళి ఎర్రతెర పరుస్తోంది. జుల్లాయి పాటలు పాడుతూ పశువుల కాపరులు వెంట నడుస్తున్నారు. దృశ్యం కన్నుల పండువుగా ఉంది. అప్పుడన్పించింది - పల్లెటూళ్లో పర్మినెంట్‌గా ఉంటే బాగుంటుందని కాని భవిష్యత్తులో ఎలాగుంటుందో గదా!

రాత్రికి కడుపునిండా భోజనం, కంటినిండా నిద్ర అయినా మర్నాడుదయమే తలనొప్పి ప్రారంభమైంది. ఎండతో పాటు తలనొప్పి ముదిరింది. ఒళ్లు వేడెక్కింది. మధ్యాహ్నం నుండి మంచమ్మీదే ఉండిపోయాను. అమ్మ నా నుదుటికి అమృతాంజనం పట్టిస్తూ "నిన్న ఎండపూట బయటున్నాడు గదా. జ్వరమందుకుంది. ఎండ దెబ్బ తగిలింది" అంది. ఆ తర్వాత అమృతాంజనం నా భార్య చేతికిస్తూ "పెయ్యంతా రాయి"మని బయటికెళ్లింది. గదిలో మేమిద్దరమే మిగిలాము.

నా భార్య కాళ్ళకూ, చేతులకూ అమృతాంజనం రాస్తుంటే కళ్లల్లో సత్తికొండ కదలాడింది. మగత నిద్రలో చెదురుమొదురు కల. సత్తికొండ చల్లని చెయ్యి నా ఒంటిని తడుముతోంది. మగతలో కలవరించానట.

మెలకువొచ్చాక నా భార్య వాలకం అదోలా కనబడింది. "ఎవరండీ ఆ సత్తికొండ? ఆడనా, మగనా? " భుజాలు పట్టి కూచోబెట్టి సూటిగా కళ్లలోకి చూసింది. అయితే నన్ను నిలదీస్తుందన్న మాట.

అందుకే అన్నారేమో అనుమానం ముందు పుట్టి ఆ తర్వాత ఆడది పుట్టిందని జవాబు చెప్పి తీరాలి గదా!

"ఆడమనిషే నీకెట్లా తెలిసింది? "

మనసులో దుమారం చెలరేగిందేమో గుండెలు బాదుకుంది. " ఓహో ఆడమనిషి కాబట్టే ఆమె పేరును అన్ని సార్లు కలవరించారా! అక్కడ ఆడ దోస్తీ కుదిరిందా? ఎన్ని రోజుల నుండి నడుస్తుందా బాగోతం? ' రెచ్చిపోయింది. అరచేత్తో నోరుమూశాను. సత్తికొండ వ్యక్తిత్వం గురించీ, ఆవిడ సేవల గురించి పూసగుచ్చినట్టు చెప్పాను. అంతావిని

"ఆహా... ఆ సత్తికొండ ఉత్తమురాలే..." అంటూ లెంపలేసుకుంది. "నేనట్లా అనుకోలేదు" అని తనను తానే తిట్టుకుంది.

మిగతారోజులు మందకొడిగా గడిచాయి.

"కాకినాడలో ఇంకా చాలా రోజులుండాలెగదా. మీ ఆరోగ్యమెట్లా ఉంటుందో ఏమో" తిరుగు ప్రయాణానికి ముందు నా భార్య భయం గుప్పిట్లో బందీ అయింది.

"అక్కడి వాతావరణం అలవాటైంది. అయినా కొద్ది రోజుల్లో ఎండాకాలం వెళ్లిపోతుంది గదా. అంతా బాగానే ఉంటుంది. నువ్విక్కడ పిల్లల్ని జాగ్రత్తగా చూసుకో. మా అమ్మా నాన్న లున్నారనుకో" సముదాయించబోయాను.

"ఏందో నాకు భయమైతుంది నేను గూడా హైదరాబాద్ దాకా వస్తాను. మిమ్మల్ని ట్రైన్ ఎక్కించి మా అమ్మ ఇంట్లో ఉండిపోతాను" నల్లని కనురెప్పల కింద నీటి బిందువులు.

కన్నీటికీ ఒక భాష ఉంటుంది. ఆ భాష అర్థం కానట్టుంది. కాని గుండెల్లో గుండ్రాయి దొర్లింది. అశ్రు బిందువులు అద్దాల్లాంటి చెక్కిళ్లను ఒరుసుకుంటూ రాలుతూంటే "కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ ఏల యేడ్చెదో" పోతన పద్యం గుర్తుకొచ్చింది.

"ఎందుకూ? ఇక్కడేమన్నా ఇబ్బందా? మా అమ్మా" అరచేతిని నా పెదాల కడ్డంగా ఉంచింది. " ఏ తల్లి దండ్రులైనా తమ పిల్లల్ని అడ్డాలనాడే గారాబంగా చూస్తారు. గెడ్డాలనాడు ఇంకో రకంగా చూస్తారు."

"అంటే!"

"మీరక్కడ ఎన్ని తిప్పలు పడుతున్నారనే ఆలోచన రావడం లేదు. నెల జీతం మొత్తం

మీ నాన్నగారికి పంపితే బాగుంటుందటా. అప్పుడప్పుడు అత్తయ్య మాటల్లో అర్థమైపో తుంది" కొంగుతో కళ్లద్దుకుంది.

"నిజమే. చేతికందిన కొడుకుల నుండి చేతి నిండా సాయం ఆశించడం లోకసహజమే. కాని ఆశ హద్దులు దాటితే ఆరాటమైపో తుంది. ఆరాటం బలపడితే పోరాటంగా రూపాంతరము చెంది అపోహల కాస్కారమ వుతుంది. ఇది ఇంటింటి రామాయణమే పెద్దవాళ్లు ఏదేదో అంటుంటారు. మనమే సర్దుకుపోవాలి."

"అద్సరేగాని నేను"

"వచ్చెయ్ హైదరాబాద్ దాకా. కానీ"

"మళ్లీ ఆ కానీ ఏమిటి?" పెదాల మీద చిరునవ్వు.

"మరో మూడు నెలల్లో కాకినాడలో థియరిటి కల్ ట్రైనింగ్ పూర్తవుతుంది. తర్వాత మూడు నెలల ప్రాక్టికల్స్ ట్రైనింగ్ హైదరాబా ద్‌లోనే. అప్పుడు మనం తప్పకుండా మీ పుట్టింట్లోనే ఉండాలి గదా. ఇప్పట్నుంచే నువ్వూ, పిల్లలు అక్కడ అడ్డా జమాయించి కూచుంటే బాగుంటుందా?"

"బాగానే ఉంటుంది. మానాన్న సంపాదిం చిన ఆస్తిలో నాకు గూడా హక్కు లేదా? మా అన్నయ్య వదినలు నన్నెంత ప్రేమగా చూస్తారో మీకు తెలుసుగదా!" బుంగమూతి.

"తెలుసు గానీ అత్తగారింట్లో తిష్టవేసిన మహాకవి భారవి కథ తెలుసు గదా. ఎంత దగ్గరి వాళ్లైనా మూన్నాళ్లైతే మురికి చుట్ట మంటారు. కాని మనం అక్కడ మూడునె లలు ఉండాలి. నువ్విప్పట్నుంచే ఉంటే పరి స్థితి ఎట్లా ఉంటుందో ఏమోగదా!"

"మీరటు ట్రైనెక్కగానే నేనిటు బస్సెక్కు తాను. సరేనా!" నవ్వేసింది. సర్దుబాటుకు సరే నన్నాను.

అటు కరకర పొద్దు పొడుస్తూంటే ఇటు కాకినాడ పోర్టు రైలు స్టేషన్లో దిగాను. ఇల్లు చేరుకుని గడపలో అడుగు పెట్టానో లేదో సత్తికొండ చిరునవ్వుతో ఎదురొచ్చి స్వాగతం పలికింది . గిరిజ అయితే నా చేతుల్లోంచి సూటుకేసందుకుని గది దాకా తీసుకెళ్లింది. సిద్దయ్య అంతకుముందు బస్సులో వచ్చేశా డట. అతని నవ్వు ముఖం నా అలసటను మాయం చేసింది.

కాలకృత్యాలు, స్నానాదులు గబగబా ముగి శాయి. అప్పటికే మా నలుగురు మిత్రులు క్లాసుకెళ్లి పోయారట.

"త్వరగా పద సిద్దయ్యా, చాయ్ తాగే టైం గూడా లేదు" అన్నాను గదిలోంచి బయటి కొస్తూ.

"ఇంకెక్కడి చాయన్నా, మనం హోటల్ల చాయదాగి వచ్చేసరికి పావుగంటన్నా అవు తుంది. ఆలస్యమైతే ఇన్‌స్ట్రక్టర్ ఇంతెత్తు ఎగు ర్తడు. ఇంటర్వెల్‌ల తాగుదాంలే" గది తలు పులు మూసేసి తాళం వేశాడు సిద్దయ్య.

"కనీసం కాఫీ చుక్క గూడా లేకుండా క్లాసు కెళ్తే ఎట్టా అన్నయ్యా" గిరిజ కాఫీ గ్లాసులతో వచ్చేసింది "ఇదో గటగటా తాగేసి వెళ్లండి" చల్లనిచూపు.

ప్రాణం లేచొచ్చింది. అనుకోకుండా "మాతల్లే" అనేశాను. నాగుండె చప్పుడది. గిరిజ నవ్వింది.

"తల్లి కాదన్నా చెల్లి" సిద్దయ్య సవరణ. మా ముగ్గురితో పాటు సత్తికొండ గూడా నవ్వేసింది. ఆ నవ్వులో ఆత్మానందం, హాయి కలబోసుకున్నాయి.

"మీ ఆయన బాగున్నారామ్మా?" అడిగాను కాఫీ చప్పరిస్తూ.

"మా బాగా బంగారు బాబులాగున్నార న్నయ్యా" నున్నని బుగ్గలమీద సన్నని సిగ్గు లతో మొహం దానిమ్మ పండులాగైంది.

"క్రిష్ణమూర్తి" "సత్తికొండ చొరవ" "ఆ మహానుభావుడిప్పుడు ఇక్కడే ఉన్నాడు. నిద్ర లేవలేదింకా మీరెప్పుడొస్తారా అని ఎదిరి చూస్తున్నాం. ఈ వారం రోజులుగా నా మన సంతా మీ గదిచుట్టే తిరిగిందంటే నమ్మండి" గుండెలనిండా నవ్వింది. ఆ నవ్వులో నవపా రిజాతం మెరుపుంది.

"అవునన్నయ్యా! మేము మిమ్మల్ని గుర్తు చేసుకోని రోజే లేదు సుమా!" గిరిజ చిరునవ్వు చిద్విలాసంగా ఉంది.

★ ★ ★

సినిమా జీవులకు చిద్విలాస ప్రదేశం కాకినాడ. మేమైతే రెండ్రోజులకో సినిమా చూస్తూ ఆ రంగానికి చేతనైన ఆర్థికసాయం చేస్తున్నాము. కాని ఈ మధ్య సినిమా చూడక వారం రోజులైంది. మధ్యాహ్నం హోటల్లో భోంచేసి అట్నుంచి అటే సినిమా కెళ్లాలని ఇంటర్వెల్ లో తీర్మానించుకున్నాం.

అనంతపురం వేణుగోపాల్ "యోయ్ ఈ రోజు మ్యాట్నీ సినిమా కెళ్లి తీరాల" అంటూ మాకు తోడయాడు.



ఒంటిగంటకు ఇంటికి రాగానే పైడితల్లి పరామర్శించాడు.

"అదేమిటీ, ఇంటిదగ్గరే ఉన్నారేమిటీ? " అడిగాను.

"ఆయ్... మీ కోసమే నండీ"

"మా కోసమా? మేమేమన్నా మీ బాసులమా, దాసులమా? " సిద్దయ్య గది తలుపులు తెరుస్తున్నాడు.

"బాసులూ, దాసులైతేనే చూడాలా బుల్లోడా? " సత్తికొండ అతని చెయ్యందుకుంది. సిద్దయ్య కనుబొమలెగిరిపడినై

"మరి టైంపాసు కోసమా? "

"ఆ గ్యాసు కబుర్లెందుగ్గానీ మీరు త్వరగా భోంచేసి వచ్చెయ్యండి. ఓ ముఖ్య విషయం మీతో మాట్లాడాలి"

ఆరరె.. మరి సినిమా ప్రోగ్రామో మొహాలు చూసుకున్నాం.

హోటల్లో భోంచేస్తుంటే విషయం చర్చకొచ్చింది. సినిమాకెళ్దామా లేక రూముకెళ్దామా? మా పక్కన వేణుగోపాలున్నాడు. మా గడ్డు పరిస్థితి అతనికి నివేదించుకున్నాం. ఓ నిమిషం ఆలోచించి.

"భలే తమాషాగుందే!" వేణుగోపాల్ విస్తుబోయాడు.

"ఇల్లుగలావిడ కోసం ఇంత త్యాగం చేస్తారా? మూడు నెలల్లో వాళ్లకూ మీకు మధ్య ఇంత ఇది కుదిరిందా?

"ఏదో కుదిరింది గాని సినిమానా, వాళ్లింటల్లుడి ముందు ఏదో మాట్లాడ్డమా? ఏది ప్రాధాన్యం? అడిగాను.

"మన ఫేవరైట్ హీరో సినిమా గదా!" సిద్దయ్య

"నిజమే కాని పాపం సత్తికొండ. మళ్లీ ఏం సమస్య వచ్చిపడిందో అదేమన్నా అర్జంటు విషయమేమో! మనమిప్పుడు గది కెళ్లకపోతే ఆమె ఎంత బాధ పడుతుందో!"

"నిజమే నండోయ్. ఆలోచించాల్సిందే" పెరుగన్నం తింటూ సాలోచనగా అన్నాడు వేణుగోపాల్.

"అద్సరే గాని మనమిప్పుడేం చేద్దామో చెప్పండి మహానుభావా!" సిద్దయ్య సూటిగా అడిగాడతణ్ని.

ముగ్గురమూ ఆలోచనలో పడిపోయాం. చేతులు కడుక్కుని విశ్రాంతి కోసం బయట బెంచీమీద కూచున్నాం.

"ఓ పనిచేద్దామండీ" వేణుగోపాల్ వాలకం జడ్జిమెంటివ్వబోతున్న జడ్జిలాగైంది.

"చెప్పండి..."

> జీవించినంత కాలం ఎలా జీవించాలన్న పాఠాన్ని నేర్చుకుంటూ వుండు.
>
> – న్యాకంబర్

"సినిమా రేపు చూద్దాం. ముందు గదికె ళ్లండి. మీ వెంట నేను కూడా వస్తా పదండి" రాయలసీమ నుడికారం రంజుగా ఉంది "ఆయమ్మ అంత ఇదిగా అడిగింది గదా! కాదంటే బాగుండదు"

ముచ్చట్లలో మునిగితేలుతూ ముగ్గురం గదికెళ్లాము. ఇంటి గడపదాటామో లేదో "వచ్చారా. రండి. కూచోండి" పైడితల్లి వరం డాలో ఆపేశాడు. అప్పటికే అక్కడ సత్తికొండ, గిరిజ, మా నలుగురు మిత్రులు సకుటుంబ సపరివారంగా కొలువుదీరి ఉన్నారు. వాళ్లంతా లోకాభిరామాయణంలో మునిగు న్నారు. ఇదేదో ప్రత్యేక సమావేశంలాగుంది. "నీకేమన్నా తెలుసా? అని కళ్లతో అడిగాను సిద్దయ్యను. సిద్దయ్య భుజాలెగిరి పడ్డాయి. తనకేమీ తెలియదని సైగతో చెప్పేశాడు. మేము ముగ్గురం చాపమీద కూచున్నాము. మా ముందు పైడితల్లి... రామభక్త హన్మా న్‌లా మోకాళ్ల మీద గదవానించి, కాళ్లకు చేతులు చుట్టేసి కూచున్నాడు.

"ఏందీ విశేషమూ? " సత్తికొండ నడిగాను - ఆసక్తిగా సత్తికొండ దృష్టి గిరిజవైపు మళ్లింది. "ఏం లేదన్నయ్యా!" గిరిజ గొంతు సవరించుకుంది. "మా ఆయన గురించే..." "మల్లా ఏదన్నా కిరికిరి పెడ్తుండా? సతాయి స్తున్నడా? " సిద్దయ్య తీక్షణ దృక్కులు పైడి తల్లి మీదున్నాయి.

"అదేం లేదు చిన్నన్నయ్యా!" గిరిజ కొంచెం ముందుకు జరిగి భర్త పక్కకొచ్చింది. "ఈయన పనిచేస్తున్నది ప్రైవేటు కంపెనీ గదా. ఆ మేనేజరు అందరికి లాగా ఈయ నకు జీతమివ్వట్లేదు. అదేదో స్కేలు ఇవ్వ మంటే ఇవ్వట్లేదటా."

"అట్లెట్లా? అందరిలెక్క పనిచేస్తలేడా? " సిద్దయ్య అడిగాడు.

"ఇప్పుడు చేస్తున్నారుగాని... అప్పుడు చెయ్యలేదు గదా. గత రెండున్నర నెలల నుండి బుద్ధిమంతుడిలా వెళ్లి అందరిలాగే పంజేస్తున్నాడు" గిరిజ మొహం ముడుచు కుంది.

"ఆయ్ ఇప్పుడు పర్మనెంట్ చేసి జీతం పెంచమని అడిగితే ఆ మేనేజర్ యెదవ ఏషాలేస్తున్నాడండీ" పైడి తల్లికి రోషమొచ్చిన ట్టుంది.

"నువ్వు అడిగావా? " నేనడిగాను.

"ఆయ్. ఇంతకు ముందు డ్యూటీ సరిగా చెయ్యలేదు. మరో ఆర్నెల్ల తర్వాత చూద్దాంలే' అంటున్నాడండీ. అసలు సంగతే టంటే వానికి ముడుపు ముట్టజెబితే వెంటనే చేత్తాడని మా కోవర్కర్లు అంటున్నారండీ" పైడితల్లి గొంతుకొంత స్థాయి తగ్గింది. చూపులు సత్తికొండవైపు మళ్లాయి "వాని కెంతో కొంత ముట్టజెబుతాం, డబ్బులివ్వమని మా అత్తగారి నడిగానండి."

"రెండువేల రూపాయలు కావాలటా." సత్తి కొండ వేలు ముక్కుమీదుంది. "ఏనెల కానెల అద్దెడబ్బుల్తో బతుకుతున్నదాన్ని రెండు వేలంటే మాటలా మజాకా? అంత డబ్బు నాకాడ ఎక్కడుందటా!"

"పర్మనెంట్ చేస్తే... జీతం డబులైపోతుం దన్నయ్యా" గిరిజ గొంతులో దైన్యం "ఈ సమస్యకు పరిష్కారం మీరే చూపించాల న్నయ్యా" చాక్లెట్‌కు చెయ్యిచాచిన చిన్నపి ల్లలా అడిగింది.

"దీనికేమన్నా ఉపాయముందా వేణుగోపా ల్ గారూ? " నేను అడిగాను. వేణుగోపాల్ కనుబొమ లెగిరిపడ్డెనై లోకం పోకడ మీకు తెలీదా అన్నట్టుగా!

వేణుగోపాల్ గోడకానిగాడు "లంచమనేది ఈరోజుల్లో కామనై పోయింది. ప్రభుత్వ రంగం, ప్రైవేట్ రంగం అనే తేడా లేకుండా అది సర్వవ్యాప్తమైంది. మీరోసారి వెళ్లి ఆ మేనేజర్ గారిని కలిసి అడగండి. కాస్సేపు బేరమాడండి. ఎంతో కొంత అతని మొహాన కొట్టించండి. పీడా వదిలిపోద్ది. సమస్య సామరస్యంగా పరిష్కారమవుతుంది"

"ప్చ్.. ఏం చేద్దామన్నా. విధిలేదు" సిద్దయ్య పెదాలు చప్పరించాడు. "నలుగు



## రైజ్‌టుది అకేషన్

ప్రకాశం 'స్వరాజ్య' పత్రికలో శ్రీశ్రీ కొంత కాలం పనిచేశారు. అప్పట్లో పత్రిక ఆర్థికపరిస్థితి అంత బాగాలేక యాజమాన్యం జీతాలు సరిగా ఇచ్చేదికాదు. ఆరోజుల్లో తనమిత్రులు ఎవ్వరైనా ఆఫీసుకు వస్తే శ్రీశ్రీ- కెన్‌యూ రైజ్‌టు ది అకేషన్? అనేవారు. దీనికి మామూలు అర్థం.. సమయానుగుణంగా స్పందించగలవా? అని. కానీ శ్రీశ్రీ అర్థంవేరు టీ ఇప్పించగలవా? అని. ..ఫుల్‌టుది అకేషన్ అంటే టిఫిన్ కూడా పెట్టించగలవా? అని.

ఇబ్బందులలోనూ హాస్యస్ఫూర్తి విడువక పోవడం శ్రీశ్రీ ప్రత్యేకత.

రితో నారాయణ అనాలెగదా. ఇంకో ఆర్నెల్ల దాకా పర్మినెంట్ జీతం రాలేదనుకుంటేసరి. మరి ఎంత ఇద్దాం సత్తికొండా? "

సత్తికొండ కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. అవి అశక్తతకు ఆనవాళ్లుగదా! పైసా పైసా నువ్వెంత పాపాత్మురాలివే!

అట్లా మాట్లాడ్తుంది సిద్దయ్యనేనా! లంచం లేకుండా పనిచేయించే ప్రయత్నం చేస్తే! ఏమో... సక్సెస్ కావచ్చు కాకపోవచ్చు సక్సెస్ కాకపోతే పైడితల్లి? ఓ అమాయకుడు బలైపోతాడు. కలియుగంలో ధర్మం ఒంటికాలుమీద నడుస్తుంది గదా! మిగతా మూడు పాదాలనొదిలేసి ఆ ఒక్క పాదాన్నే పట్టుకుంటే... ప్రయత్నం మానవుని వంతు, ఫలితం పైవాడి తంతు. అయినా అనుమానమే.

"ఓసోస్. భలే తమాషాగుందే!! వేణుగోపాల్ నా చెయ్యందుకుని కదిలించాడు. "మీరలా శూన్యంలోకి చూస్తే జవాబు దొరుకుతుందా? మాట్లాడండీ".

"సరే వెళ్లి అడుగుదాం సిద్దయ్యా"

"మరీ నాకాడ డబ్బుల్లేవుగందా!" సత్తికొండ తలకొట్టుకుంది. ముంగురులు సవరించుకుని మోచేత్తో కళ్లద్దుకుంది. ఆ కళ్లల్లో అమాయకత్వం గిరికీలు కొడుతోంది.

"ఫరవాలేదు. అదంతా మేం చూసుకుంటాం" తెగింపుతో భరోసా ఇచ్చేశాను.

మర్నాడు గూడా మ్యాట్నీషో కాన్సిలైంది. భోంచేసి నేను, సిద్దయ్య నేరుగా పైడితల్లి పనిచేస్తున్న కంపెనీ ఆఫీసు కెళ్లాం. అదో కార్పొరేట్ కంపెనీ కార్యాలయము. అందమైన మేడ. లోపల గోడలకు ఆకర్షణీయమైన పెయింట్. దానిమీద రంగు రంగుల ఆయిల్ పెయింటింగ్స్. నేల మీద మార్బుల్ స్టోన్స్ అద్దాల్లాగున్నాయి.

అబ్బో ఇక్కడ చాలా జాగ్రత్తగా మసలుకోవాలి. నాలో ఏదో అలజడి చిన్నపాటి భయం. ఓ గదిముందు నల్లని బోర్డుమీద "మేనేజర్" తెల్లని అక్షరాలు మెరుస్తున్నాయి. ఆ బోర్డు చిన్నదైనా అట్టహాసంగా ఉంది.

"అగ్గో మానేజర్ రూమన్నా, లోపలికి పోదామన్నా" సిద్దయ్య బోర్డువైపు చూపించాడు.

"అతణ్ణి తర్వాత కలుద్దాం. ముందు ఎం.డి.ని చూద్దాం పద" ముందుకు కదిలాను.

"హబ్బో మానేజింగ్ డైరెక్టర్నా? " సిద్దయ్య నోరు ఆ కార్యాలయం గేటులా తెరుచుకుంది "మనల్ని లోపలికి రానిస్తరంటవా? "

"ప్రయత్నం పురుష లక్షణం. పోయేదేమీ

లేదుగదా"

"కానీ సరే నీ ఇష్టం" అయిష్టంగానే నా వెంట నడుస్తున్నాడు. అయినా హుందాగానే ఉన్నాడు.

ఎం.డి. చాంబర్ ముందు పెయింటింగ్ రూముంది. అందులో కెళ్లాం. మెత్తని సోఫాలు, కుర్చీలు అట్టహాసంగా ఉంది.

"ఏం కావాలండోయ్? " నిర్లక్ష్యంగా అడిగాడు అటెండర్.

"ఎం.డి.గారితో మాట్లాడాలి" అంటూ సోఫాలో ఠీవిగా కూచున్నాను. సిద్ధయ్య నా పక్కన కూచున్నాడు.

"ఆయ్. విషయమేటండీ? "అటెండర్ అధికారదర్పం.

"అదంతా నీకెందుకూ? " కోపంగా చూశాడు సిద్ధయ్య.

"చూడు నారాయణ. ఓ ముఖ్యమైన విషయం. అది యం.డి గారికే చెప్పాలి. ఇతరులతో చెప్పగూడదు. ఇది మీ కంపెనీ పేరు ప్రతిష్ఠలకు సంబంధించిన వ్యవహారం"

పెదాలమీద చిరునవ్వు చిందులేయించాను.

"ఆయ్!" అటెండర్ కళ్లు అరచేతులంతైనాయి. చిన్నగా భుజాలెగరేసి" అయితే ఈ కాగితమ్మీద మీ పేరు వగైరాలు రాసివ్వండి" కాగితం ముక్క నా చేతికిచ్చి చేతులు కట్టుకుని నుంచున్నాడు.

మా ఇద్దరి పేర్లు, పక్కన పోస్టల్ డిపార్ట్‌మెంట్ అని రాసిచ్చాను. సోఫాకొరిగి కాలుమీద కాలేసుకుని కూచున్నాం. అది ఎ.సి. గది. ఒంటికి హాయిగా ఉంది. కొద్దిసేపట్లోనే నిద్రకమ్ముకొస్తోంది. మొహాలు చూసుకుని నవ్వుకున్నాం.

ఐదు నిమిషాల తర్వాత అటెండరొచ్చి చెప్పేశాడు.

"మీరు లోపలికెళ్లండి సార్!"

పైకి మేకపోతు గాంభీర్యం చూపిస్తున్నాను గాని వెన్నుపూసలో సన్నని వణుకు జీవం పోసుకుంటోంది. లోపలికెళ్లాం.

"రండి వెల్‌కం." ఫుల్‌సూటు, టై సింగారించుకున్న ఎం.డి. మూవింగ్ చేర్‌లోంచి ముందుకు వంగి సాదరంగా చూపించాడు కూచొమ్మని. లోపలి భయం బయటపడకుండా జాగ్రత్త పడుతూ ఠీవిగా కూచుండిపోయాను.

కూల్‌డ్రింక్స్ మా ముందుకొచ్చాయి.

"ప్లీజ్ తీసుకోండి" ఎం.డి. చిరునవ్వు.

ఖరీదైన గ్లాసులవి. అందుకోబోతుంటే చేతులు వణుకుతున్నాయి. ఆధునిక మర్యాదల్లో అతి అతిసామాన్యం గదా!

"చెప్పండి సార్" హుందాగా నవ్వేశాడు ఎం.డి.

"ఈ రోజుల్లో మనదేశంలో నీతి, నిజాయితీలతో నడుస్తుంది ఒక్క మీ డిపార్ట్‌మెంటు మాత్రమే. వెరీ సిన్సియర్ సర్వీసెస్. ఐ లైకిట్ వెరీ మచ్".

వెన్నుపూస నలుముకున్న సన్నని వణుకు మాయమైంది.

"థ్యాంక్స్. ఓ చిన్న పనిమీదొచ్చామండీ. పూర్తిగా చెప్పలేకపోయాను. ముఖం సిద్ధయ్యవైపు తిరిగింది.

"చెప్పండి. ఫరవాలేదు"

"నువ్వే చెప్పు"మని సైగచేశాడు సిద్ధయ్య. పైడితల్లి విషయమంతా వివరంగా చెప్పేశాను. తొందరగా పరిష్కరించాలని ప్రాధేయపడ్డాను.

"ఓస్ అంతేనా!" అలవోకగా నవ్వేశాడు ఎం.డి. ఇంటర్ కం ఫోన్‌లో మేనేజర్ను తీసుకుని లేబర్ ఫైల్ తీసుకుని చాంబర్‌కు రమ్మన్నాడు.

మేనేజర్ వచ్చి మర్యాదగా నుంచున్నాడు. అతని చంకలో రెండు మూడు ఫైళ్లున్నాయి.

"ఆc ఆయన పేరేమన్నారూ." ఎం.డి. బుర్రగోక్కున్నాడు.

"పైడితల్లి సార్!" ఠపీన చెప్పేశాడు సిద్ధయ్య.

"ఆc ఆ పైడితల్లి మన దగ్గర చాలా కాలం

నుండి పనిచేస్తున్నాడు గదా" దర్జాగా అడిగాడు ఫైలందుకుంటూ...

"అవున్సార్. ముందు చాలా ఇర్రెగ్యులర్‌గా ఉండేవాడు. రెండు మూడు నెలల నుండి మాత్రమే రెగ్యులర్‌గా పనిచేస్తున్నాడుసార్"! ఫైల్లో ఏదో పేజీ విప్పి ఎం.డి.కి చూపించాడు.

"కూచోండి" పక్క సీటును మేనేజర్‌కు చూపించాడు. మేనేజర్ చూపించిన కాగితాన్ని పూర్తిగా చదివాడు. ఇంకేవో కాగితాలు తిరగేశాడు. మేనేజర్ను ఏదేదో అడిగాడు.

"అమ్మో... ఐదేండ్ల నుండి టెంపరరీగానే ఉన్నాడే" ఎం.డి. భృకుటి ముడిపడింది.

"ఎస్సార్. అతడు చాలా ఇర్రెగ్యులర్‌గా ఉండేవాడు..."

మేనేజరు మాటల్ని మధ్యలో తుంచేసి "నో... అవన్నీ చెప్పొద్దు..." ఎం.డి.కేదో అర్థమైనట్టుంది "మొత్తం నూటా ఎనభై రోజులు డ్యూటీ చెయ్యలేదా? " నిలదీశాడు.

"పాపం పైడితల్లి గరీబోడు సార్!" సిద్ధయ్య చురక అంటించాడు. "పర్మనెంట్ ఆర్డర్ కోసం పైసలు ఖర్చు బెట్టలేదుసార్" అంటూ మేనేజర్ వైపు చూశాడు.

ఎం.డి. చూపులు తీక్షణమైపోయినై. 'ఏంటీ కథా' అని మేనేజర్‌ను ప్రశ్నిస్తున్నాయి.

"సారీ సర్" మేనేజర్ మొహం ఆరిపోయిన కొవ్వొత్తిలాగైంది. కత్తి వేటుకు నెత్తురు చుక్క లేదు. "ఆర్డర్స్ ఈరోజు పుటప్ చేయిస్తా సార్. స్కేలు ఇచ్చేద్దాం సార్" ఇంచుమించు వణికిపోతున్నాడు. పాపభీతి మనిషినెలా భయపెడుతుందో అర్థమైపోయింది.

"ఈరోజే కాదు. ఇప్పుడే" ఎం.డి. చూపులు కృతజ్ఞతగా నన్నూ, సిద్ధయ్యను తడిమాయి. "అతణ్ని మూడునెలలు ముందట్నుంచి రెగ్యులర్ చేస్తూ ఆర్డర్స్ వెంటనే తయారుచేయించండి. నా సంతకం తీసుకుని ఓ కాపీ వీళ్ల చేతికిచ్చి పంపండి" అంటూ ఫైల్లో ఏదో రాసి మేనేజర్‌కిచ్చాడు.

"సారీ సర్. మీరు నాతో రండి" మేనేజర్ గొంతులో ఏదో ఇరుక్కున్నట్టుంది. నుదుటి మీద చెమట తడి మెరుస్తోంది. మేమక్కడే కూచుంటే ఇంకేదన్నా ఫిర్యాదులు చేస్తామన్న భయమేమో.

"మీరెల్లి అతని ముందు కూచోండి. ఆర్డర్ కాగితం తీసుకునే వెళ్లండి" మాతో అనేశాడు ఎం.డి. "నిజాయితీకి మారు పేరైన పోస్టల్ ఉద్యోగులముందు మా నిజాయితీ నిరూపించుకోవాలి గదా!" హాపీగా అంటూ నవ్వేశాడు.

"థ్యాంక్యూ సర్!" కోరస్‌గా చెప్పేసి బయటికొచ్చాం.

మూడు నెలల ముందు నుండి పైడితల్లి ఉద్యోగం రెగ్యులరైజ్ అయింది. స్కేలు గూడా మంజూరైంది.

"మూడు నెలల అరియర్స్ రేపు తీసుకోవచ్చు అతన్తో చెప్పండి సార్" అంటూ ఆర్డర్ కాగితం నా చేతికిచ్చాడు మేనేజర్. అతని గ్గూడా థాంక్స్ చెప్పి లేవబోయాం.

"సార్! పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం అన్నట్టు... ఇంత చిన్న విషయాన్ని యం.డి.దాకా తీసుకెళ్లారు. నేరుగా నన్నే అడిగితే పనిచేసి పెట్టేవాణ్ని గదా!" వినయ విధేయతలొలకబోశాడు మేనేజర్.

"యం.డీ. ఏమిటబ్బా! ఆయన కాదంటే కంపెనీ చైర్మెన్ దాకా వెళ్లేవాళ్లం" సిద్ధయ్య డాంబికం పోనిచ్చుకోలేదు. చెమటతో జిడ్డుగా మారిన నుదురు, చెంపలను చేతిగుడ్డతో అద్దుకున్నాడు మేనేజర్. అంతేకాదు-

"అయ్యబాబోయ్! అప్పుడు నేనీ ఉద్యోగానికి నీళ్లొదులుకోవాల్సి వచ్చేది" అంటూ లెంప లేసుకున్నాడు.

మొదట నమ్మలేదు పైడితల్లి. "ఆషికాలాడ్తున్నారు గదూ? ' అన్నాడు తల వంచుకుని. ఆర్డర్ కాగితం చేతికిచ్చాక చదువుకుని ఎగిరి గంతేశాడు.

"మా బాబులే!" బంగారు కొండ దొరికినట్టు- సత్తికొండ మురిపెం కాంచనజంగ శిఖ రాన్నంటింది.

"రెండువేల రూపాయల ఖర్చు తప్పింది. ఆపైన బకాయి డబ్బులే ఎదురొస్తున్నాయి" గుండెల మీద చెయ్యేసుకుంది.

గిరిజ గుండెలనిండా నవ్వుతూ, "మరి.. మా అన్నయ్యలంటే అల్లాటప్పా గాళ్లనుకున్నావా? వాళ్లు అనుకున్నది సాధించి తీరుతారమ్మా" మమ్మల్ని ఆకాశానికెత్తేస్తూ పంచదారతో మా నోరు నింపేసింది. ఆ రోజంతా పండగ వాతావరణమే. మాతోపాటు మా నలుగురు మిత్రులు గూడా సంబరాల్లో పాలుపంచుకున్నారు.

ఆరు నెలల అజ్ఞాతవాసంలో నాలుగో నెల గడిచింది. ఐదో నెలలో ప్రవేశించాం.

ట్రైనింగ్ సెంటర్ ముందున్న వెడల్పాటి కాలువలో ఎప్పుడూ పడవలు, లాంచీలు తిరుగుతుంటాయి. ప్రియుని బాహుబంధంలో సేదదీర్చుకునేందుకు పరుగెడుతున్న ప్రియురాలిలా- ఆ కాలువలోంచే గోదావరి పరవళ్లు తొక్కుతూ వెళ్లి సముద్రగర్భంలో దాగిపోతుంది.

"సముద్రుడి ఒడిలో ఒదిగిపోవాలని నదీ సుందరికెందుకో అంత ఆతృత!!" అన్నాడొకసారి గుంటూరు మిత్రుడు. ఆయనలో భావుకత్వముంది. కవితలు రాయడం ఆయన హాబీ.

"సముద్రుడు - నదీసుందరి ఇద్దరూ పరోపకారులే. పరోపకారులు ప్రేమానురాగము, అనుబంధము అతి పవిత్రమైనది. రెండింటి సంగమము మానవాభ్యుదయం కోసమే" అనేశాను.

"నిజమే. నదీ సుందరి సముద్రుడి ఒడిలోకి చేరకుంటే జనావళిని ముంచిపారేసేది" అన్నాడతడు.

"నదీ సుందరి సౌందర్యం హృదయగతమైంది. కాబట్టి పైకి కనబడదు. గంగపుత్రులు ఆ తల్లినే నమ్ముకుంటారు. కాలువల్లో చేపలు పట్టి ఒడ్డున ఎండబెడ్తారు. చేపల హృదయఘోషనెవరు వింటారు?

"మేమెవరికీ హాని చేయం. మీరు తాగే నీటిని కలుషితం చేస్తున్న పురుగుల్ని తింటూ కడుపు నింపుకుంటున్న మమ్మల్ని వేటాడి పట్టి ఎండలో మలమల మాడ్చి చంపేస్తున్న మానవులారా! మా శవాలను ఎగుమతి చేసి డబ్బు చేసుకుంటున్న మీది- శవాల మీద డబ్బులు ఏరుకునే సంస్కారం. మా ప్రాణాలతో, శరీరాలతో వ్యాపారం చేస్తున్న మానవుల్ని ఊరకే వదుల్తామా! కాచుకోండి- అంటూ దుర్వాసన వెదజల్లుతుంటాయి గదా మిత్రమా" సుదీర్ఘమైన వివరణ ఇచ్చాను. ఇద్దరమూ నవ్వుకున్నాం.

మొదటి వారం రోజులు మా ముక్కుపుటాలనదరగొట్టిన దుర్వాసన రానురాను తన ఉనికినే కోల్పోయింది. అక్కడ నివాసముంటున్న వారిలాగే మా ముక్కులు గూడా ఆ దుర్వాసనకలవాటుపడ్డాయి.

టర్మ్ హాలిడేస్‌లో విశ్రాంతి తీసుకున్న మా కోడ్ జ్ఞాపకశక్తి మరో వారం రోజుల ప్రాక్టీసుతో నార్మలైంది. ఇహ ఇప్పుడు అక్షరాలను పదాలుగా, అంకెలను సంఖ్యలుగా కలిపి మోర్స్ యంత్రం మీద పంపించడం, స్వీకరించడం (సెండింగ్ అండ్ రిసీవింగ్స్)లో ప్రావీణ్యాతనలవరచుకోవాలి. రోజువారీ ప్రాక్టీసులో ఏకాగ్రత చాలా అవసరమైంది. అది మాత్రమే కోతి స్వభావం గల మనసుకు కళ్లెం వేస్తుందని ఇన్‌స్ట్రక్టర్ ఎన్నో సార్లు చెబుతుంటాడు.

ఇటు అక్షరాలు కలిపి కొట్టాలని మనసు బిగపట్టి కూచుంటే- అది ఒకటి లేదా రెండు పదాలకు మాత్రమే పరిమితమై పోతోంది. ఆ తర్వాత మనసెక్కడో గంతులేస్తోంది. ఇహ.. కోడ్ రిసీవ్ చేసుకుని కాగితమ్మీద రాయాలంటే సప్తసముద్రాలీదినంత పనవుతుంది. ఒక్కొక్కరిని పక్కన కూచోబెట్టుకుని ప్రాక్టీసు చేయిస్తున్న

> అంతా పోయిందని అనిపించినప్పుడు భవిష్యత్తు ఉందన్న విషయాన్ని గుర్తుంచుకోండి. – లిజెట్టీ

ఇన్‌స్ట్రక్టర్‌కు మాత్రం ఓపిక, ఓర్పు ఎంతవ రకుంటాయి?

"మనసును సినిమాల దిక్కు మళ్లించక, శ్రీదేవి, డింపుల్ కపాడియాల మీదినుండి ఇక్కడికే పట్టుకు రావాలి"

"కొంచెం నా మాట వినవయ్యా"

"ఛీఛీ. ఇహ నీకీ విద్య రాదు. వెనక్కు పంపిస్తా"

"పోస్టాఫీసు ముద్రల్ని మొరటుగా కొట్టడ మలవాటైన ప్రాణాలకు సున్నితమైన కోడ్ అబ్బుతుందా? "

"కాస్త నిదానంగా, అక్షరాలను విడివిడిగా కొట్టవయ్యా" లాంటి మందలింపుల్ని వినవల సివస్తోంది. అదలింపులు, బెదిరింపులు విద్యా విధానంలో ముఖ్యపాత్ర వహిస్తాయనేది తెలి సొచ్చింది. మొదటినెలలో అనుభవించిన మానసిక వేదన మళ్లీ అనుభవిస్తున్నాం. ఏకాగ్రత ఎలా అబ్బుతుందో మరోసారి విడమరిచి చెబుతున్నాడు ఇన్‌స్ట్రక్టర్.

"బయటి ప్రపంచానికతీతంగా తపస్సు చేస్తున్న ఋషిలాగా, కవిత్వం రాస్తున్న కవి లాగా మారితేనే ఏకాగ్రత అలవడుతుంది. రోజూ ఇంట్లో ధ్యానం చెయ్యడం నేర్చుకోండి. సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్నారు గదా! సాధన చెయ్యండి"

మానసిక వేదన రగిలి రగిలి, కరిగి ఏకా గ్రతగా రూపాంతరం చెందుతుందనేది కొందరి విషయాలలో నిజమైంది. ఏకాగ్రత అలవడింది. "మనమింత దూరమొచ్చి ఇన్ని రోజులైంది గదా!" రాత్రి మా గృహసమావే శంలో నిజామాబాదు కాశీనాథ్ ప్రస్తావిం చాడు. "యానాం ఇక్కడికి దగ్గరనేట. అక్కడి వాతావరణం చల్లగా, హాయిగా ఉంటుందట. ఓసారి వెళ్లి చూసొద్దామా!"

ప్రస్తావన పరిశీలనకొచ్చింది.

"అవునవును. మన క్లాసుమేట్లు కొందరు చూసి వచ్చింద్రటా" కరీంనగర్ రాజయ్యా ఉత్సాహం "చాలా బాగుందట. చూసి తీరాలె"

"అక్కడ రోజూ సినిమా షూటింగులైత యట. అంటే.... అదెంత బ్యూటీఫుల్ లొకే శనో!" ఆనందం బలపరిచాడు.

"ఆదివారంనాడు వెళ్లొస్తే పోలా!" సత్యనా రాయణ ఓటు అటు పడింది. అందరి చూపులు సత్తికొండవైపు మళ్లాయి.

"ఆయ్... వెళ్లిరండి" సత్తికొండ హుషా రుగా ముందుకు జరిగి సిద్దయ్యకెదురుగా కూచుంది. "ఓయ్ సిద్దులూ! ఇది వానా కాలం. జాగ్రత్త!" అంది.

"వానాకాలమైనా, చలికాలమైనా మాకే మన్నా భయమా? " తానేమీ తక్కువ తినలే దనిపించుకుంటున్నాడు సిద్దయ్య "యానాం అంటే అదేమన్నా బాంబే సిటీయా... తప్పి పోయేందుకు? ఓయ్ సత్తికొండా? పోస్టల్ ట్రెయినింగ్ కోసం నేను ఢిల్లీ దాటి షహ రాన్‌పూర్ కెళ్లొచ్చాను. అయినా యానాంలో చక్కని చుక్కలున్నారా ఎగరేసుకుపోయేం దుకు? "

"ఓయబ్బో!" సత్తికొండ మూతి, చేతులు లయబద్ధంగా తిరిగాయి. ఆరు జిల్లాల అంద గాడా! ముందే రైలుబొగ్గుల్లో రామచిలుకవు. నిన్ను ఎగరేసుకు పోయి ఎవతి మాత్రం ఏం జేసుకుంటుందటా? " దెప్పి పొడిచింది.

మాకు నవ్వాగలేదు. మా నవ్వులనేమాత్రం పట్టించుకోకుండా "ఏదంటే అది చేసుకుంటుంది. అయినా నీకంటే నేనే నయం. చీకట్ల వెళ్తుంటే నా ఉనికి గుర్తుబ ట్టొచ్చు తమ రైతేనా. చీకట్లో చీకటైపోవడం గ్యారంటీ" అస్త్రం విసిరాడు.

అందరితోపాటు సత్తికొండ కూడా నవ్వుతూ "నువ్వే చెప్పవయ్యా క్రిష్ణమూర్తీ - అందచందాల్లో మా ఇద్దరిలో ఎవరు మిన్న? " సూటిగా అడిగింది.

నా నవ్వు చప్పున ఆగిపోయింది. బందరు లడ్డూ తింటుంటే రాయి పంటికింది కొచ్చి నట్టు నోరెళ్లబెట్టాను.

"ఊరుమురిమి మంగలమ్మీద పడ్డట్టు నన్న డిగితే నేనేం చెప్పాలటా? "

తప్పుకోబోయాను.

"ఉన్నమాట వాస్తవం చెప్పండిగు రూగారు!" సత్యనారాయణ డిమాండ్. మిగతా వాళ్లంతా కళ్లు, చెవులు విప్పి ఆసక్తిగా జవాబు కోసం ఎదిరిచూస్తు న్నారు.

నా చుట్టూ ఏదో ఉచ్చుబిగుసుకుం టున్నట్టుంది.

"నాకోసంగతి గుర్తుకొచ్చింది. చెప్పనా? " నొప్పించక, తానొవ్వక, తప్పించుక తిరుగువాడు, ధన్యుడు సుమతీ శతకపద్యం మదిలో మెదిలింది. ఓ ప్రయత్నం చేసి చూద్దాం.

"చెప్పవయ్యా చెప్పెయ్. మాబాగా చెప్పెయ్" సత్తికొండ ప్రోత్సాహం. కొంగు సవరించుకుని గోడకొరిగింది.

"ఓసారి వైకుంఠములో శ్రీమహావిష్ణువు కులాసాగా లక్ష్మీదేవి, జ్యేష్టాదేవి... ఇద్దరు భార్యలతో సరససల్లాపాలాడుతున్నాడట"

"ఆ ఇద్దరిలో పెద్దభార్య ఎవరన్నా? " సిద్దయ్య ఆసక్తి.

"జ్యేష్టాదేవి. ఆమెనే జేష్టక్క, దరిద్ర దేవత అంటాం"



## లక్ష్యం నెరవేరింది

ఓరోజున ఓ పెద్దకవిగారొచ్చి శ్రీశ్రీతో- 'ఏవయ్యా శ్రీశ్రీ.. నువ్వేమో కవిత్వానికి ఛందస్సువద్దన్నావ్.. గణయతిప్రాసలతో నిమిత్తం లేదన్నావ్.. వస్తువు ఏదైనా పర్లేదన్నావ్.. అలాగే నువ్వు మంచికవిత్వం కూడా రాశావ్.. కానీ నువ్వుచెప్పావంటూ ప్రతిఅడ్డమైన వెధవా ఏవేవో గిలికేస్తూ తామూ కవులమే అంటున్నారు.. ఇప్పుడు ఇంటికొక కవి తయారయ్యాడు ఆ చెత్తంతా వినలేక చస్తున్నాం' అన్నాడు నిష్ఠూరంగా.

'అలాగా.. అయితే నా లక్ష్యం నెరవేరిందన్న మాట' అన్నారు శ్రీశ్రీ కూల్‌గా సిగరెట్ పీలుస్తూ.

"ఆయ్.. లచ్చిందేవి సంపదల తల్లాయె..." గాల్లోకి చేతులెత్తి దండం బెట్టింది సత్తికొండ.

"ఆc అప్పుడు సరసం కొంత మితిమీరి విరసానికొచ్చింది. ఫలితంగా 'నీకంటే నేను అందగత్తెను'. అంది జ్యేష్టాదేవి. 'కాదు. నీకంటే నేనే అందగత్తెను' అని లక్ష్మీదేవి ఛాలెంజికి దిగింది. ఇలా అందగత్తెను నేనంటే నేనని ఇద్దరూ వాదులాడుకొంటుంటే శ్రీ మహావిష్ణువు తమాషా చూస్తున్నాడటా."

"వారెవ్వా ఇద్దరు పెళ్లాల ముద్దుల మొగుడు గదా!. ఆ తరవాత ఏమైందీ? " రాజయ్య రంగంలోకి దిగాడు.

"మన అందచందాలన్ని మన పతిదేవులకు తెలుసు కాబట్టి మనిద్దరిలో ఎవరు అందంగా ఉన్నామో శ్రీ మహావిష్ణువు వారే పతిదేవులే చెప్తారన్నారు. అది వాళ్ల జాయింట్ అగ్రిమెంటు. పాపం! శ్రీ మహావిష్ణువు పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుకలాగైపోయింది"

"ఎరక్కపోయి ఇరుక్కుపోయాడు పాపం!" సత్యనారాయణ విరగబడినవ్వాడు.

"అవును పాపం. ఒకరు అందగత్తె అంటే ఇంకొకరికి కోపం. ఆయనేమీ చెప్పలేక గుడ్లు తేలేశాడు. ఎవరాదుకుంటారా అని అటూ ఇటూ చూస్తున్నాడటా"

"ఆహాహా! శ్రీ మహావిష్ణువుకే ఓ ఆపద్బాంధవుడవసరమయాడు" కాశీనాధ్ ఆశ్చర్యం.

"అవును. నారదుడొచ్చాడట. ఈ సంగతేమిటో తేల్చుమని నారదుణ్ని ఆదేశించాడు శ్రీ

మహావిష్ణువు.

"పాపం నారదమహర్షి గూడా ఎరక్కపో యివైకుంఠానికొచ్చి ఇరుక్కుపోయాడన్నమాట" రోహిణి నవ్వింది.

"అవునమ్మా. అంతటి శ్రీమన్నారాయణుని ఆదేశం పాటించక తప్పదు. పాటించి నిజం చెబితే - ఇద్దరు అమ్మవార్లలో ఒకరు అంద గత్తె అంటే ఇంకొకరికి కోపమొస్తుంది. ఎలా గబ్బా అని ఆలోచిస్తున్నాడు"

"పాపం! ముందు నుయ్యి వెనక గొయ్యి..." అంతా వింటున్న శ్రీమతి రాజయ్య ముక్కుమీద వేసుకుంది.

"అవునమ్మా. అప్పుడా నారదుడు అమ్మగా రలకు దండంబెట్టి 'దయచేసి మీరిద్దరు ఏడడ గులు అటు నడిచి తిరిగి రండి' అన్నాడట. అమ్మవార్లు ఇద్దరూ అటువెళ్లి తిరిగొచ్చారట. అప్పుడన్నాడట నారదుడు 'లక్ష్మీదేవమ్మ వస్తుంటే అందంగా ఉంటారు. జ్యేష్టాదేవమ్మ వెళ్తుంటే అందంగా ఉంటారు! అని చాకచ క్యంగా తీర్పునిచ్చి తప్పుకున్నాడటా..."

అందరం కలిసి హాయిగా నవ్వుకున్నాం.

దాంతో సత్తికొండ ప్రశ్న అడుగంటింది.

వచ్చే ఆదివారం యానాం విహారయాత్ర కెళ్లి రావాలని ఏకగీవ్రంగా నిర్ణయించు కున్నాం. మా నిర్ణయాన్ని సత్తికొండ ఆమో దిస్తూ "యావండోయ్! యానం తప్పక చూడాల్సిందే. కాని... అదంతా లంకల మయం. ఎదురు లంక, మధ్యలంక... ఇలా ఎన్నో లంకలున్నాయి. పడవలో వెళ్లాలి. ఎప్పుడు భయమేసినా ఆ అన్నవరం సచ్చనా రాయణసామికో దండంబెట్టుకోవాలి" సలహా లిచ్చింది.

"అవును సత్తికొండా! నాదో అనుమానం" సిద్దయ్య దృష్టి సత్తికొండ మీదుంది. అందరూ అది గమనిస్తున్నారు.

"ఏందయ్యోయ్! అనుమానం పాతరోగమ న్నారు. అదేంటో కక్కెయ్ మారాజా!"

"నువ్వెప్పుడన్నా యానాం వెళ్లావా? వెళ్తే ఎప్పుడు వెళ్లావు? ఒంటరిగా వెళ్లావా, జంటగా వెళ్లావా? "

"నేనా!" సత్తికొండ మొహం లైటు వెలుతు రులో పున్నమి రేయి కలువలా వికసించింది. వెలుతురు కిరణాలు పెదాలమీద పడి పరావ ర్తనం చెందుతున్నాయి. "మా ఆయన అచ్చం నీలాగే ఉండేవాడు సిద్దులూ. రంగు ఎరుపే కాని ఆకారం నీలాంటిది. మా పెళ్లైన కొత్తలో రెండు మూడుసార్లు జంటగా వెళ్లొచ్చాను. అప్పుడు గూడా సినిమా షూటింగులవుతుం డేవి. పొద్దున్నే బయల్దేరి వెళ్లి పొద్దంతా అక్కడే చిలకా గోరెంకల్లా తిరుగుతూ ఊసు లాడుకునే వాళ్లం. చీకటిపడేసరికి కాకినాడ గూటికి చేరుకునేవాళ్లం... అలౌకికానందాన్ని నుభవిస్తూ చెబుతోందని - శూన్యంలోకి చొచ్చుకుపోయిన చూపులే చెబుతున్నాయి. బహుశః అవి ఆమె జీవితములోని మధుర ఘట్టాలయుండాలి.

"అయితే అదృష్టవంతురాలివే" సిద్దయ్య లేవబోయాడు.

"ఆయ్ ఆ అదృష్టమెన్ని రోజులుందిలే" మొహం ఎలా విచ్చుకుందో అలా ముడుచుకు పోయింది. "యానాం మన ఆంధ్రలో లేదు. అక్కడ విస్కీ, బీరు చాలా చీప్‌గా దొరుకు తాయి. అటుపోయినప్పుడల్లా మా ఆయన కొన్ని సీసాలు తెచ్చుకుని రోజూ తాగేవాడు.' ' అంటూ లేచి నడుమును తమాషాగా కది లిస్తూ తన గదిలో కెళ్లిపోయింది.

ఎవరి జీవితాలెటు తిరిగినా కాల ప్రవాహం ఆగదుగదా! ఆదివారం రానే వచ్చింది.

నలుగురు మిత్రులు జంటలుగా, మేమి ద్దరం - అంతా కలిసి యానాంకు బయలు దేరాం.

ప్రకృతి ఒడిలో పల్లవించి పులకిస్తున్న యానాం కేంద్రపాలిత ప్రాంతమైన పాండిచేరి

మీ బుద్ధినీ, వివేకాన్నీ ఔన్నత్యం వైపుకు తీసుకువెళ్లే మార్గాన్ని ఎన్నుకోండి
- మహాత్మాగాంధీ

భాగం. అక్కడున్న వాళ్లంతా తెలుగు వాళ్లే. రాష్ట్రాల విభజన సమయములో ఏం జరిగిందో ఏమో కాని యానాం పాండిచేరిలో చేరిపోయింది, కాని కాకినాడకది ఇరవై కిలో మీటర్లే సుమారు.

పల్లెల గుండెల మీంచి ప్రయాణిస్తోంది బస్సు. రోడ్డుకిరువైపులా పచ్చదనం ఒళ్లు విరుచుకుంటోంది. ఏపుగా పెరిగిన వరిమొక్కల పెదాలను ముద్దాడుతూ, కొబ్బరి చెట్ల కొంగుల్ని రెపరెపలాడిస్తూ, పండ్ల తోటల పరువాలను స్పృశిస్తూ వస్తున్న పిల్లతెమ్మెర తరంగాలు ఒంటికి గిలిగింతలు పెడుతున్నాయి. పచ్చని చేల నిండా పసిడి పంటలు అందిస్తానని ధాన్యలక్ష్మి చేస్తున్న నాట్యర వళి... కనువిందు చేస్తోంది. హృదయోల్లాసం ఉబికొస్తోంది.

ఉదయం తొమ్మిదికల్లా బస్సు యానాం బస్టాండులో ఆగింది. అప్పుడే అమెరికాలో విమానం దిగుతున్నంత ఉత్కంఠతో బస్సు దిగాం. ఆకాశంలో మబ్బుల మాటున దోబూచులాడుకుంటున్న సూర్యుడు కిరణాలు వెదజల్లుతున్నాడు. ఆ కిరణాల ఇంద్రజాలం పున్నమి వెన్నెలలా కనిపిస్తోంది. కొద్ది దూరం నడిచి పడవ ఎక్కాం.

సరంగులు తెడ్డు వేస్తుంటే పడవనీటి మీద వయ్యారంగా వెళ్తోంది. పాయలుగా పారుతున్న నదీ సుందరి ఒంపుసొంపుల్ని, వయ్యారి నడకను కన్నుల పండువులా చూస్తూ మధ్య లంక చేరుకున్నాం.

చుట్టూరా నది కాలువ, మధ్యన ఇసుక భూమి చుట్టకుదురులాగుంది. అదే మధ్య లంక. అక్కడ ఎటుచూసినా చెట్టు చేమ, గుడిసె ఇల్లు ఏదీ కనబడలేదు. లంక నిండా తెల్లని ఇసుక పేరుకుపోయింది. అడుగుతీసి అడుగు వెయ్యడం కష్టంగా ఉంది. అటుపక్క ఏదో సినిమా షూటింగ్ జరుగుతున్నట్టుంది - జనాలు గుంపులుగా మూగారు.

నదిలో, నాటు పడవలో హీరో-రైతు వేషంలో ఉన్నాడు. అభిమానుల కభివాదం చేసి-పాత్రలో లీనమయాడు. ఒడ్డున కెమెరా, పక్కన డైరెక్టర్ ఉన్నట్టుంది. కట్, ఓకే, వెరీ గుడ్ మాటలు వినబడుతున్నాయి.

ఎన్నడూ సినిమా షూటింగ్ చూడని వాళ్ల కదో సరదా. సదవకాశంగూడా. అరనిమిషం చిత్రీకరణకోసం అర్థగంట ఏర్పాట్లు. డైరెక్టర్, అసిస్టెంటు డైరెక్టర్, టెక్నీషియన్లు, పనివాళ్ళు ఎందరో ఉరుకులు, పరుగులు! అదో తమాషా. ఓ గంట గడిచిందో లేదో

"ఓర్నియవ్వ! మనం ఎగవడి చూస్తున్న సినిమా షూటింగ్ గిట్లుంటదా? " రాజయ్య నీరుగారిపోయాడు.

"అవును సోదరా! అట్లానే ఉంటుంది. నేనింతకుముందు షూటింగులు చూశాను. పరమ బోరు!" సత్యనారాయణ వ్యాఖ్యానం. అది నిజమేననిపించింది.

"చూసింది చాలు. ఇహ ముందుకెళ్దాం పదండి" అంటూ రోహిణి ముందుకు దారిదీసింది.

మళ్లీ పడవ ఎక్కాం. అది ఎదురులంక అభిముఖంగా ప్రయాణిస్తోంది. అలలమీద తేలి ఆడుతుందా నాటు పడవ. ఎటు చూసినా నీరే. నాటు పడవ నీటిమీద హంసలా నడుస్తోంది. సరంగు పాట అందుకున్నాడు. స్వచ్ఛమైన వాతావరణంలో నిండు గుండెలోంచి పొంగుకొస్తున్న జానపదం, అదే పల్లెజనాల జ్ఞానపథం. పాట, తేట తనియధారలా చెవులకింపుగా ఉంది. ఎదిరిచూస్తున్న ఎదురులంక వచ్చేసింది. పడవ దిగి ఒడ్డుకొస్తూంటే కమ్మని అనుభూతి అలరిస్తోంది.

ఎత్తుమీదున్న గ్రామం ఎదురులంక. చుట్టూ పచ్చని తోటలు, ఏపుగా పెరిగిన కొబ్బరిచెట్లు. మేం దిగింది కొబ్బరి తోటలోనే పూలచెట్లు తలలాడిస్తూ గాలి తరగలతో ఊసులాడుకుంటున్నాయి. అవి మా గురించే మాట్లాడుకుంటున్నాయేమో!

అక్కడగూడా సినిమా షూటింగ్ జరుగుతోంది. ఆరేళ్ల అమ్మాయి, తొమ్మిదేళ్ల అబ్బాయి. అందరినీ అలరించే పాటకనుగు

ణంగా గంతులేస్తూ పచ్చని చేనులో పరుగులు తీస్తున్నారు. డైరెక్టర్ సూచనలను తు.చ. తప్పకుండా పాటిస్తున్న చిన్నారుల నటనాచాతుర్యం అమోఘం. కొన్ని దృశ్యాల షూటింగ్ తర్వాత సినిమా బృందం భోజనాలకెళ్లిపోయింది. ఇతర జనాలతోపాటు మేముగూడా కాస్సేపు అటూ ఇటూ తిరిగొచ్చి కొబ్బరితోటలో కూచున్నాం. పక్కనే కూచున్న సన్నకారు సినీయాక్టర్‌తో కాస్సేపు కబుర్లు చెప్పుకుంటూంటే- అదొక థ్రిల్లుగా ఉంది. ఆ తర్వాత- నాలుగు జంటలు వెంట తెచ్చుకున్న టిఫిన్ క్యారియర్ల మూతలు తెరుచుకున్నాయి. మేమిద్దరం దూరంగా కూచుండి చూస్తున్నాం. కొందామంటే అక్కడేమీ దొరికేట్టులేదు.

"అరెరే మనమేమీ తెచ్చుకోలేదు. ఏం చేద్దామన్నా!" సిద్దయ్య గుర్తుజేశాడు. ఆ సంగతి ఆకలిగూడా గుర్తుజేస్తోంది. "నిజమే! హోటల్లోంచో, మిఠాయిషాపులోంచో ఏదన్నా పార్సిల్ తెచ్చుకుంటే బాగుండేది" అన్నాను. ఏం చెయ్యాలో అర్థం కాలేదు.

"మనమట్లా వెళ్లి గాలి తినొద్దాం పద" అన్నాడు సిద్దయ్య. ఇద్దరము లేవబోయాము.

"అయ్యో! మీరక్కడున్నారేవిటన్నయ్యా. ఇలా రండి" రోహిణి పిలిచింది. ఆ పిలుపులో ఆప్యాయత ఉంది.

"రండి మావయ్యా. ఇదిగో పూరీలు. నా పక్కన కూచోండి మావయ్యా" సత్యనారాయణ-రోహిణిల సుపుత్రుడు రామారావు లేచొచ్చి మా ఇద్దరి చేతులందుకుని లేవదీశాడు. మేము తటపటాయిస్తున్నాం.

"అదేంటి గురూగారూ! సిద్దయ్యగారూ... రండీ! అందరము కలిసి సరదాగా ఆరగిద్దాం రండీ!!" సత్యనారాయణగూడా లేచొచ్చాడు. ఇక తప్పలేదు.

క్యారేజి మూతల్లో ఉప్మా తెచ్చి మా ముందుంచుతూ శ్రీమతి రాజయ్య "మీకోసం కూడా ఏదన్నా టిఫిన్ చెయ్యమని సత్తికొండ చెప్పింది" అంది.

"అవునన్నయ్యా! ఇంతమంది ఆడవాళ్లముండి మీకీమాత్రం ఏర్పాటు చెయ్యకపోతే అన్యాయంగదూ!" రోహిణి పూరి, కూర అందిస్తూంటే "ఈ మాత్రం మీకు చేసి పెట్టకపోతే సత్తికొండ మమ్మల్ని చీల్చి చెండాడుతుంది తెల్సా!" ఆవిడ కళ్లు చక్రాల్లా తిరిగాయి.

"సత్తికొండకు మేమేమీ చెప్పము గదమ్మా!" సిద్దయ్య ముసిముసినవ్వు.

"సత్తికొండ చెప్పిందని కాదయ్యా బాబూ!" సత్యనారాయణ పూరీలాగిస్తూ "అందరమూ కలిసి పిక్నిక్ కొచ్చాం గదా. సరదాగా కలిసి తినేద్దాం..." సర్దిచెప్పాడు.

అది నిజమేనన్నట్లుగా కొబ్బరి కొమ్మల నుండి గాలి ఝుంయ్‌మని వీచింది.

శ్రీమతి రాజయ్య, శ్రీమతి ఆనందం, శ్రీమతి కాశీనాథ్‌లు గూడా సరదాగా మాట్లాడ్డం మమ్మల్ని పలకరించడం విశేషము. నా బతుకు పుస్తకములో బంగారు అక్షరాలతో రాయదగిన ఘట్టమది. జీవితాంతం మరువలేను.

అల్పాహారం పూర్తయ్యాక అలా తిరిగొద్దామని బయలుదేరాం. ఏ అదృశ్య కవి కలం నుండి జాలువారాయో సరంగుల గళాల నుండి తియ్యని జానపదగేయాలు వినబడుతున్నాయి. కొంగులు నడుముకు చుట్టుకుని పొలాల్లో వంగి కలుపుతీస్తున్న తరుణీమణులు, తోటల్లో పని చేసుకుంటున్న కూలీజనాలు ఎవరి పనుల్లో వారున్నారు. ఎంతసేపు చూసినా తనివి తీరని ప్రకృతి సౌందర్యం. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ ఎటెటో తిరిగి మళ్లీ బయలుదేరిన చోటుకే చేరుకున్నాం.

పక్కనే సినిమా షూటింగ్ ప్రారంభమైంది.

ఎండుగడ్డి వాము. చుట్టూరా సినీ శ్రామికులు, కళాకారులు. యుగళ గీతం వినిపిస్తోంది. అది అంతకుముందే రికార్డు చేసిన పాట టేపుద్వారా వినబడుతోంది. ఆడ, మగ డాన్స్ డైరెక్టర్లు ఓ సన్నివేశంలో వెయ్యాల్సిన

గంతులు వేసి హీరో హీరోయిన్లకు చూపించారు. ఆ తర్వాత కళ్లు, కాళ్లూ తిప్పుతూ ఇంకేవో సూచనలిచ్చారు.

మల్లెపూవు తెల్లదనాన్ని తలదన్నే ధోవతి, సిల్క్ లాల్చీలో హీరో, మోకాళ్లవరకు మడిచి గోచీ కట్టిన చీరలో పల్లెటూరి పడుచులా హీరోయిన్. పాటకు అనుగుణంగా గడ్డివాము మీద దొర్లుతున్నారు. అదొక సీను. ఆ తర్వాత వాళ్ళిద్దరు ఒకరిమీద ఒకరు దొర్లుతూ వాము మీంచి కిందికి రావడం మరొక సీను. అట్నుంచి హీరో, ఇట్నుంచి హీరోయిన్‌లు పరుగెత్తుకొచ్చి కౌగలించుకోవడం. ఇంకో సీను. ఇలా ఎన్నో ఎన్నో కట్ కట్ ఓకే ఓకేలు.

మా పక్కన కాశీనాథ్ జంట నుంచుంది. శ్రీమతి కాశీనాథ్

"ఛీ పాడు! పరాయి మొగోనితోని గట్ల ఎగురుతుంది. అది ఆడిదా, గాడిదా!" గొణిగింది. అది మాకు వినబడింది. వచ్చే నవ్వును ఆపుకున్నాం.

"నీకేం దెల్సు! నువ్వు గమ్మునచూడు" కాశీనాథ్ మందలింపు.

రిహార్సల్., వెంటనే చిత్రీకరణ కట్ కట్ కట్.

మా ఓపిక గూడ కట్ అయిపోంది. బోర్ కొడుతోంది. నాకు కుడిపక్కన రోహిణి-సత్యనారాయణల జంట, వాళ్ల పక్కన రాజయ్య జంట. శ్రీమతి రాజయ్య రోహిణి వైపు చూస్తూ

"ఆడోళ్లు గింత బరిదెగిస్తరా!" అంటూ మొహం చిట్లించింది.

"అవును మల్లా 'బరిదెగితేనే భాగోతం, సిగ్గిడిచిపెడ్తేనే సినిమా యాక్టరు' అన్నారు గదా' 'రాజయ్యకు నవ్వొచ్చింది. "అయినా అదంతా నటనేగా!" అని నవ్వేశాడు.

ఆ మాటలు అక్షర లక్షలు. హాఫ్ నాలెజ్ ఈజ్ వెరీ డేంజర్ అన్నట్టుగా తెలిసీ తెలియని వారి సంగతి కూడా అంతే. అపారమైన డబ్బు పెట్టుబడి, నటనలో ఆరితేరిన కళాకారులు, సంగీత సాహిత్యాల్లో సాటిలేని మేటి అనుభవజ్ఞులు అందరి మేలు కలయిక, కళల సంగమం ఒక సినిమా.

"ఇక మనం పోదామన్నా!" అందరికి వినబడేలా అన్నాడు సిద్దయ్య.

"పద పోదాం" నేనొక్కడినే తయారయ్యాను.

వాళ్ళెవ్వరూ స్పందించలేదు. ఇంకా షూటింగ్ చూడాలనుందేమో! లేదా ఇంకా స్నేపు తిరుగుతారేమో!

మేమిద్దరమే పడవ ఎక్కి వచ్చి ఎదురులంకలో దిగాం. అప్పటికి సాయంత్రం నాలుగైంది. కన్ను మూసి తెరిచేలోగా ఇసుకమీదున్న ఎండ మాయమైంది. ఆకాశం నిండా నల్లని మేఘాలు ప్రత్యక్షమైనాయి. ఆశ్చర్యం టప టప... టప... టప... చినుకులు.

చినుకులు కావవి పలుగురాళ్లముక్కలు ప్రారంభమైన వెంటనే జోరందుకున్నాయి. వెంటనే గాలి దుమారం భయంకరమైన గాలి. నేలమీదున్న ఇసుక ఎగిరిపడుతోంది. మా మొహాల నిండా, శరీరాలనిండా ఇసుకనే.

అటూ ఇటూ చూస్తే ఏముందీ? అంతా ఎడారి. ఏదారీ లేదు. గాలి, వర్షం పోటీలు పడుతున్నాయి.

"అరెరే ఇక్కడికొచ్చి ఇరుక్కుపోయినం" భయం భయంగా అన్నాను. సిద్దయ్యతో పాటు నేను మెలికలు తిరిగిపోతున్నాను.

"అవునన్నా జనాలంత ఒడ్డుమీది పడవల్ల దూరి పోయింద్రు. మనమెట్లా? "

మామూలు వర్షం కాదది, కుండపోత వర్షం. ఆకాశానికి చిల్లులు పడినట్లు ధారల వర్షం. రెండు నిమిషాల్లో తడిసిముద్దయిపోయాం. అంతవరదాకా సినిమా షూటింగ్ జరుగుతుండేది. సినిమావాళ్లెవ్వరూ కనబడటంలేదు. గుండె గూటిలో దుమారం చెలరేగింది. అటూఇటూ- ఎటెటో పరుగెత్తాం. అంతా చీకటిలాగుంది. మొత్తుకుంటున్నాం

లబలబలాడుతున్నాం. అంతా అరణ్య రోదనం. మెరుపుల్లో కనబడుతోంది. పడవల కిందిగూడా జనాలు దాగున్నారు. వజవజ వణుకుతూ పడవల చుట్టూ తిరిగాం. కూచునేందుకు కాదు గదా- నిలబడేందుకు కూడా స్థలం లేదు.

ఏం చెయ్యాలి! ఇసుక కింద నీరు. అడుగు తీసి అడుగు వెయ్యాలంటే అసాధ్యమైపోతోంది. ఒకరి చెయ్యి ఒకరం గట్టిగా పట్టుకుని లంకనడుమకొచ్చాం. వాన జోరుమీదుంది. గాలి తన ప్రతాపం చూపిస్తూ విసిరి సిరికొడుతోంది. నిలదొక్కుకోవడం కష్టమైంది.

అదొక ప్రళయం. ఎన్నడూ కనీవినీ ఎరగని ప్రకృతి పరిహాసము. శరీరమే కాదు, గుండెకూడా తడిసిపోయింది.

"అన్నా ఇంగమనం బతుకలేమన్నా చచ్చిపోతామిక్కడే" సిద్దయ్య నన్ను గట్టిగా వాటేసుకున్నాడు. నేనూ అలాగే చేశాను. "తుఫాను వచ్చినట్టుంది. ఇంగ ఈ ఉప్పెన మనల్ని మింగేస్తుంది సిద్దయ్యా! మనం భార్యాపిల్లల్ని చూడమిక" అంటూంటే నా గుండె జారిపోయింది. భోరుమని ఇద్దరమొకేసారి ఏడుపు లంకించుకున్నాం. అది వినేవారెవరు?

నీటికీ, కన్నీటికి అనుబంధం ఎలాంటిదో గాని మా కన్నీటిని వాననీరు వెంట వెంట కడిగేస్తోంది. దుఃఖం గుండెల్లో వర్షం కురుస్తోంది.

"ఇంత బతుకూ బతికి ఇక్కడ చావుమని రాసిందేమో ఆ దేవుడు"

"అవును సిద్దయ్యా! మనకిట్లా రాసిపెట్టుంది".

వెన్నుపూసలో పురుడుపోసుకున్న వణుకు శరీరమంతా వ్యాపించింది. చలి, వణుకు, వర్షం, భయం, భయణ భయం. శరీరంలో శక్తి నశించింది. ఇద్దరమూ ఇసుకలో కూలబడిపోయాము.

"గట్లైతదని సత్తికొండ గూడా చెప్పకపాయె..." సిద్దయ్యలో వణుకు "అగో నా భార్య. నా కళ్లల్ల తిరుగుతుందన్నా. భగవంతుడా... భారమంతా నీదే!"

నా పనీ అంతే. భార్యాపిల్లలు తలపుకొస్తున్నారు. అమ్మా, నాన్నలు, తమ్ముళ్లూ, అక్కాచెల్లెళ్లూ...

"బంధువులారా ఇక సెలవ్" గొంతు గోడల్ని చీల్చుకొచ్చిన ఆర్తనాదము లంకంతా మార్మోగవచ్చు సత్తికొండ మాట గుర్తుకొచ్చింది. సత్యనారాయణస్వామిని తలుచుకుని అతనిపైనే భారం వేశాను. అలా ఎంతసేపు గడిచిందో.

నేలకు వేల్లాడుతున్న నాతల ఒకేసారి పైకి లేచింది. మెడనరాల్లోకి ఆ శక్తి ఎలా వచ్చిందోమరి! జ్ఞానోదయ మవగానే మనిషిలోంచి తొలగిపోతున్న భ్రమల్లా- ఆకాశాన్నావరించిన మేఘాలు మబ్బులతో సహా మాయమవుతున్నాయి. పదవి కోల్పోయిన ప్రజానాయకుడి పటాటోపంలా- జోరు తగ్గిన చినుకులు తుంపరగా మారాయి. నది ఒడ్డువైపు చూపులు పరుగులు తీశాయి. ఓ లాంచీ ఒడ్డుకొచ్చి సినిమా ట్రూపు నెక్కించుకుంటోంది. ఏదో ఆశ- ప్రాణంమీది ఆశ- ప్రాణ వాయువులా పైకొచ్చింది. సిద్దయ్య గూడా అదే స్థితిలో ఉన్నట్టుంది. అతని చెయ్యి పట్టుకుని లేస్తూ

"లే సిద్దయ్యా! ఉరుకుదాం పద. ఆ లాంచీ దిక్కుపదా!" అటుచూపిస్తూ చెవిలో చెప్పాను. చీకట్లో చిరుదివ్వెలా సిద్దయ్య కళ్లల్లో వెలుగు... నరాల్లోని శక్తినంతా కూడదీసుకుని పరుగు లంకించుకున్నాం. ఎవర్నీ ఏమీ అడక్కుండా నేరుగా వెళ్లి లాంచీలో కూచున్నాం. ఎవరన్నా వచ్చి లేపుమన్నా లేచేది లేదు.

సినిమా ట్రూపు మమ్ముల్ని ఎక్స్ట్రాలుగా భావిస్తుందో లేక ఆపద సమయం గదాని అభ్యంతర పెట్టలేదో- మమ్మల్నెవ్వరూ పట్టించుకోలేదు. బయట తుంపర గూడా తగ్గిపోయింది. వాతావరణం మామూలైంది. ఎండ

వచ్చేసింది. ఇసుక మెరుస్తోంది.

సినిమావాళ్ల మాటలబట్టి తెలిసింది. ముఖ్యతారాగణాన్ని, టెక్నీషియన్లను ఎక్కించుకుని లాంచీ వర్షానికి ముందే వెళ్లిందటా. వర్షం జోరు, గాలి హడావుడివల్ల వెంటనే రెండో[ట్రి]ప్పు కుదరలేదటా.

ప్రాణాలు బిగపట్టుకుని యానంలో దిగాం. ఇంతవరదాకా ఏమీ జరగనట్టుగా వాతావరణం పొడిగానే ఉంది. అప్పుడు గుర్తుకొచ్చింది గడియారం ఉంది. చేతిమీద సురక్షితంగా ఉంది. ఐదున్నర చూపిస్తోంది. ఒంటిమీద తడిసిన బట్టలు పొడిబట్టలుగా మారాయి. ఎండ ప్రభావం వల్ల మొహాలు చూసుకుని విస్తుబోయాం. చావలేదు. నిజంగానే బతికున్నాం. కాస్సేపు అటూ ఇటూ తిరిగాం. పోస్టాఫీసు కనబడింది. ప్రాణం లేచొచ్చింది. లోపలికెళ్లి మమ్మల్ని మేమే పరిచయం చేసుకున్నాం. సబ్ పోస్ట్‌మాస్టర్ నవ్వుతూ రిసీవ్ చేసుకుని కూచోబెట్టాడు.

"కాకినాడకొచ్చిన మన టెలిగ్రాఫ్ ట్రైనీలంతా సరదాగా ఇక్కడికొచ్చిపోతుంటారు సార్." అని అటెండర్‌ను పిలిచి కాఫీకార్డరిచ్చాడు. ఇంకేవేవో డిపార్ట్‌మెంటల్ విషయాలు చెబుతున్నాడు.

"మేము మీకు శ్రమ ఇస్తున్నాంసార్!" అంది నా మొహమాటం.

"ఇప్పుడు కాఫీ ఎందుకు సార్!" సిద్ధయ్య అనేశాడు.

"అబ్బే అలాగంటే ఎలాసార్? మనమంతా పోస్టల్ మెషన్‌లకు పరికరాలము. ప్రతి ఆర్నెల్లకో బ్యాచ్, అంటే ముప్పైమంది ఆవ్రేజ్ నెలకు ఐదుగురు మిత్రులు పరిచయమవుతున్నారు. ఐదారు కాఫీలు... అదేమంత భారమా? "

సబ్‌పోస్టుమాస్టరు గణాంక వివరాలు బుర్రలో గిరికీలు కొడుతూంటే కాఫీలు సేవిస్తూ కబుర్లు చెప్పుకున్నాం.

తిరిగి బస్టాండు కొచ్చేసరికి నలుగురు మిత్రులు- సపరివార సమేతంగా కన్పించారు.

"ఆహా! మీరెప్పుడొచ్చింద్రు? ఎట్లావచ్చింద్రు? " రాజయ్య ఆశ్చర్యం వెలిబుచ్చాడు. "మీకోసం మేమక్కడ చూసినం"

మా అవస్థనంతా విడమరిచి చెప్పాలంటే సిగ్గేసింది.

"వర్షం పడుతున్నప్పుడు మీరెక్కడున్నారు? ఎట్లా వచ్చింద్రు? " సిద్ధయ్య అడిగాడు.

"వర్షం షురూ కాంగానే ఇంటి వరండాల జొచ్చినం తగ్గేదాకా అక్కణ్నే ఉన్నం. ఆ తర్వాత పడవెక్కి వచ్చేసినం" ఆనందం ఉల్లాసంగా చెప్తున్నాడు. "ఆ సినిమా వాళ్లంతా పెద్దబంగళాల కెళ్లిపోయింద్రు".

అందరమొకేసారి బస్సెక్కాం

కలిసివచ్చిన వారితో కొద్దిసేపు విడిపోయిన చిన్న నేరానికి పెద్దశిక్షనే అనుభవించాము... బస్సుతో పాటు ఆలోచనలు పరుగెట్టాయి. ప్రమాదం నుండి రక్షించినందుకు పైవాడికి మనసులోనే నమస్కరించాను.

కాకినాడ చేరుకున్నాం క్షేమంగా.

రాత్రి యధావిధిగా మాగదిలో సమావేశమైనాము. యానాం విశేషాలు వినాలని సత్తికొండకు ఆసక్తిగా ఉన్నట్టుంది.

"యానాం ఎలా ఉంది? ఏమన్నది సిద్దులూ? " ఉత్సాహంగా అడిగింది. సిద్ధయ్య జవాబియ్యలేదు.

"చెప్పు బుల్లోడా యానాం హంగులు, అక్కడేమేంచూశారు... సినిమా షూటింగులెలాగున్నాయి? " రెట్టించి అడుగుతూంటే కనుబొమలు గమ్మత్తుగా ఎగిరిపడ్డినై.

నలుగురు మిత్రుల మొహాల్లో ఆనందం తాండవిస్తోంది. మా మొహాల్లో మరపురాని అనుభవరేఖలు దోబూచులాడుతున్నాయి. మృగాల మధ్య మౌనతాపసుల్లా కూచున్నాము. ఏం చెప్పాలో... ఎలా చెప్పాలో...!

"య్యామైందీ? " ఆందోళనగా అడిగింది సత్తికొండ. "య్యామైంది క్రిష్ణమూర్తీ? " మాకు దగ్గరగా వచ్చి కూచుంది.

యానాం వెళ్లేప్పటి సరిగమల్ని, తిరుగుప్ర

యాణం పదనిసల్ని అన్నీ చెప్పేశాం. మా అవస్థలు విని విస్తుబోయా రంతా. ఆడవాళ్లు ముక్కుమీద వేలేసు కున్నారు.

"అబ్బే బాడ్ లక్కండీ" సత్యనారా యణ పెదాలు చప్పరించి గోడకొరి గాడు. "మీరు కూడా మాతో ఉంటే బాగుండేది గదా!" ముక్తాయింపుగా అన్నాడు.

సత్తికొండ మఖకవళికలు వేపకాయ కొరికినట్టు వింతగా మారాయి. "అది కాదు ధర్మరాజా! సత్యనారాయణను కోపంగా చూస్తోంది. "మీరేమో పెళ్లా లను చంకలేసుకుని పేరంటానికెళ్లి నట్టు వెళ్లారు. వాళ్లేమో ఒంటరిగాళ్లు. వాళ్ల మంచీచెడు చూసే బాధ్యత మీకులేదా? "

పాపం! సత్యనారాయణ చూపులు నేలకు వాలాయి.

"అంతా కలిసొచ్చాంగదా. కలిసి వెళ్లాలని మీకనిపించలేదు. వీళ్లనో కంట కనిపెడితే బాగుండేది గదా. మిమ్మల్ని నమ్మి ఈ అమాయకుల్ని మీవెంట పంపడం పొరపాటైంది గందా!" సత్తికొండ ధుమధుమలాడ్తోంది.

"మేమేం జేస్తాం? " కాశీనాథ్‌కు రోషమొచ్చి నట్టుంది.

"అందరం కలిసేపోయినం. కలిసే షూటింగ్ చూసినం. కలిసే టిఫిన్ చేసినం. ఆ తర్వాత షూటింగ్ చూసేటప్పుడు వీళ్లెక్క డికో మాయమైంద్రు. దొరకబట్టి ఆపేతం దుకు వాళ్లేమన్నా బుడ్డపోరగాండ్లా? " తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంటున్నాడు. రాజయ్య, ఆనందంలు కూడా తమ నిస్సహా యతను వెలిబుచ్చారు.

"అదంతా మా దురదృష్టం. దానికెవ్వరూ బాధ్యులు కాదు" నేను కల్పించుకున్నాను.



## ఒకరిని మించి ఒకరు

సిన్మాల్లో మాటలు పాటలురాసి మంచిపేరు తెచ్చుకున్న సదాశివబ్రహ్మం ఓరోజు మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌కు వచ్చారు. అక్కడే ప్లాట్ ఫారం మీద తచ్చాడుతూ సిగరెట్ పీలుస్తూ కన్పించారు శ్రీశ్రీ. ఊరికెళ్తున్నాడేమో అనుకు న్నారు సదాశివబ్రహ్మం. కానీ లగేజీ ఏమీ కన్పించలేదు. అందుకే నర్మగర్భంగా

'శ్రీశ్రీగారూ ఏమిటి ఊరికేనా? ' అని అడిగా రాయన.

శ్రీశ్రీ ఏమన్నాతక్కువ తిన్నాడా వెంటనే- 'అవును.. ఊరికే' అన్నారుతాపీగా. ఆ జవా బుకు సదాశివబ్రహ్మం పగలబడినవ్వారు.

ఆమాటా, ఈమాటా చెప్పి ఒడుపుగా విషయం దారిమళ్లించాను. కానీ... సత్తికొం డకు తృప్తికలగలేదని ఆమె బుసబుస వాల కమే చెబుతోంది.

"ఈరోజు పొద్దున లేవగానే ఎవరి మొహం చూశావో సిద్దులూ" లేవబోతూ అడిగింది.

"నేనా. ఎవల మొకం చూసినా" సిద్దయ్య బుర్రగొక్కున్నాడు. "ఆ మొకం అద్దంలెక్క ముద్దుగుంటుంది. నున్నగా మసిగుడ్డలా అచ్చం ఆడకోతి మొకం" కావాలనే అట్లా అంటున్నాడని మాకు తెలుసు.

"అయితే నా మొకమేనా? " సత్తికొండ ఎడ మచెయ్యి నడుమ్మీదుంది. కుడిచెయ్యి గాల్లోకి

మనుషులకు సంబంధించిన అన్ని వ్యవహారాల్లో బలం రహస్యం ఏకాగ్రతలో దాగి ఉంటుంది. – ఎమర్సన్

లేచింది.

"ఏయ్ సిద్దులూ! నా మొహం చూశావు కాబట్టే బతికి బట్టకట్టావు. లేకపోతే ఈ పాటికి టపా కట్టేసేవోడివి... తెల్సా! నీ బతుకు ఎందుకూ కొరగాకుండా పోయేది పాపం!" బింకంగా నవ్వుతూ తన గదిలోకెళ్లి పోయింది.

మాక్కావల్సిందే అదే.

గాంభీర్యాన్ని పులుముకున్న వాతావరణం తేలికైపోయింది. అందరి మొహాలు చిరున వ్వుల్ని సంతరించుకున్నాయి.

సగటు మనిషి జీవన యానంలో సుఖసం తోషాల దోబూచులాటలుంటాయనీ, కష్టాలు - కన్నీళ్లు కలకాలం ఉండవనీ నిరూపిస్తూ మరోనెల గడిచింది. తినగ తినగ వేము తియ్యనుండు అన్నట్టు మోర్స్‌కోడ్ సరదాగా మారుతోంది. పదాలను, అంకెలను మోర్స్ యంత్రమ్మీద పంపించడం, రిసీవ్ చేసు కోవడం ముందట్లాగా కష్టమనిపించడంలేదు.

"మీరేమీ భయపడాల్సిన అవసరంలేదు. 'అభ్యాసం కూసువిద్య' అన్నారు పెద్దలు. ఇలాగే ఇంకొంచెం సమయం పెంచి రోజూ అభ్యాసంచేస్తే ఇంకా సులువైపోతుంది" ధైర్యం నూరిపోశాడు ఇన్‌స్ట్రక్టర్. ముందట్లాగా ఆయన మాతో దురుసుగా మాట్లాడటంలేదు. మాటల్లో మర్యాద- మన్నన ఉట్టిపడుతోంది.

టెక్నికల్ క్లాసులు రెగ్యులర్‌గా సాగుతు న్నాయి. మోర్స్ యంత్ర నిర్మాణము, దాని పరికరాలు, మోర్స్ కీ విప్పి బిగించడము, సర్క్యూట్ల రకాలు - అంతరాయాలు విడమ రిచి చెబుతున్నారు. వింటున్నకొద్దీ ఆసక్తి పెరుగుతోంది.

గడచిన కాలము మా క్లాసుమేట్స్‌ను మరింత దగ్గర చేసింది. అందరి గదులకు అందరం వెళ్లి మనసులు విప్పి మాట్లాడుకుం టున్నాం.

తెలుగునేల నాలుగు చెరగులా పరిఢవిల్లిన భాషకు మా క్లాసు సంగమ స్థానం. కోటి రతనాల వీణ నుడికారాలకు తెలంగాణ అమాయకత్వం, రతనాల వెలుగులను విర జిమ్మే రాయలసీమ రాజసం, కళింగాంధ్ర కలుపుగోలు యాస, వెన్నలాంటి కమ్మదనం మేళవించిన కోస్తా - కోనసీమ స్వచ్ఛత... మా భావ వ్యక్తీకరణలో గోచరిస్తూంటే - అందరం అందరికీ అర్థమవుతున్నాము.

సినీ స్ట్రీట్ ఎ.సి. థియేటర్లో 'చిల్లర దేవుళ్లు' సినిమా రిలీజైంది. మొదట "ఆ పచ్చి తెలం గాణ భాష మాకేమర్థమవుతుందీ?" అని దీర్ఘాలు దీసిన మిత్రులు ఆ సినిమా చూశాక హాపీగా ఫీలయ్యారు. కాకపోతే... అక్కడ క్కడ దొర్లిన హిందుస్తానీ మాటల కర్థాలు మమ్మల్ని అడిగి తెలుసుకున్నారు. అదే అను భవం హిందీ సినిమా చూసేలా ప్రోత్సహిం చింది. నాకు చెరో పక్కన కూచున్న సత్యనా రాయణ, వేణుగోపాల్‌ల సౌకర్యార్థం దుబా సీగా మారాల్సి వచ్చింది. అయినా నాకది తృప్తిగా ఉంది.

రోజుట్లాగే ఆరోజు లైటు వెలుతురు సాక్షిగా మా గదిలో కూచున్నాం. పాత సినీ తారల ప్రావీణ్యత, కొత్త తారల సింగారాలు, హీరోయిన్ల హొయళ్ళ గురించి మాటామంతి జరుగుతోంది. సత్తికొండ హుషారు, సిద్దయ్య జోరు, రాజయ్య, కాశీనాథ్‌ల కలుపుగోలు కబుర్లు మా మనసుల్ని సరదా పరదాల మీద ఆడిస్తున్నాయి.

ఆకాశంలో మబ్బులు కూడా కనబడకుండా కురిసిన అకాల వర్షంలా "హలో అంతా బాగున్నారా?" అంటూ మెట్టయ్య సాక్షాత్క రించాడు. అందరమూ వింతగా చూశాం.

"రండి. రండి మెట్టయ్యగారూ!" సత్యనా రాయణ స్వాగతం పలికాడు. సత్తికొండ తప్ప మిగతా ఆడవాళ్లంతా తమ గదుల్లో దూరిపోయారు.

"రా దోస్త్. రా కూచో" పక్కకు జరిగి చోటి చ్చాడు సిద్దయ్య. అతని పక్కన కూచుంటూ.

"మీ రూములల్ల బాగుంటదన్నా. మంచిగ టైంపాసైతది. మేమైతే రూములల్ల ఉండలేక ఎటెటో తిరిగొస్తున్నాం" అంటూంటే

మెట్టయ్య మాట నూతిలోంచి వచ్చినట్టనిపి స్తోంది. చిరునవ్వు అరువు తెచ్చుకున్నట్టుంది.

సత్తికొండ నిశిత దృక్కులు మెట్టయ్యను తడుముతున్నాయి. మాకాశ్చర్యంగా ఉంది.

"మనమిక్కడుండేది ఆఫ్టరాల్ ఆరునెలలు" చెయ్యి సిద్దయ్య భుజమ్మీదేసి చెబుతున్నాడు సత్యనారాయణ. "అందులో అంటే ఈ ఆరు నెలలు - ఎక్కడెక్కడినుండో వచ్చిన వాళ్లమూ కలిసి ఉంటే కలదు సుఖము" ఇంకేదో చెబుతున్నాడు.

"సరేగాని, అబ్బాయా!" సత్తికొండ కనుబొమలు విచిత్రంగా ఎగిరిపడ్డాయి. మెట్టయ్య వైపే ఉంది చూపు.

"నువ్వు మా ఇంటికి ఇంతకుముందు చాలాసార్లు వచ్చావు గదూ!" నిలదీస్తున్నట్టు అడిగింది.

"అవును. మొదటి నెలల చాలాసార్లు వచ్చిండు. ఈయన మా వరంగల్ పెద్దన్న..." సిద్దయ్య సగర్వంగా అన్నాడు.

"ఆయ్! వరుస బాగానే ఉంది గానీ... ఏనుగులా ఉన్న మనిషి పీనుగులాగై పోయా డేటీ? " ముక్కుమీద వేలేసుకుంది. కనుబొమలు అర్ధచంద్రాకారాలైనాయి.

నిజమే. శారీరకంగా మెట్టయ్యలో చాలా మార్పు వచ్చింది. ఆనాడు... అడ్డం, పొడవుల్లో అందరికంటే మిన్నగా ఉన్నమనిషి, ఒంగోలు దున్నలాగున్న మెట్టయ్య బక్కపలుచగా మారి డీలాపడిపోయాడు.

"మరి... కాకినాడ టౌనంటే సామాన్యమా! ఇది ఆంధ్రా పారిస్ గదా!" సిద్దయ్య దీర్ఘాలు దీస్తూ సత్తికొండవైపు కవ్వింపుగా చూశాడు. "చూడు మా మెట్టన్న గుడ్డలు తొడిగిన అస్థిపంజరంలాగయ్యాడు"

"అయితే మరి పీనుగులాగున్నవాళ్లు ఏనుగులా అయిపోవాల గందా!" సత్తికొండ సవాలు.

"ఆc... ఆc.. అవుతారు. ఎండబోసిన చేపలకంపు, బుడంపేట బురదగుంటలు సింహం లెక్కున్నోడు చిట్టెలుక లెక్క అయిపోతడు" రెచ్చిపోబోయాడు.

"ఆగవయ్యా ఆగు. వచ్చేత్తన్నా" ఎడమ చెయ్యి ఊపుతూ ముందుకు జరిగి కూచుంది. "చాపలకంపు మొదట్లోనే ఉంటుంది. ఆ తర్వాత అదే సొంపు. కానీ ఈ బాబుకు బుడంపేట బురద బాగా అంటుకున్నట్టుంది. ఏవయ్యా మా పక్కవీధి చిలకల్ని ఎన్నిసార్లు పలకరించావు? " సీరియస్‌గా అడిగింది మెట్టయ్యను.

సత్తికొండ ఏదో సరదాకంటుందనుకున్నాం గాని మెట్టయ్య మొహంలో సడెన్‌గా రంగులు మారాయి. చూపులు నేలకు వాలాయి. దోషిలాగైపోయాడేమిటీ!

కూచున్న వాళ్లమంతా మట్టిబొమ్మల్లా- నిశ్చేష్టులమైపోయాం. రెండు నిమిషాల మౌనం తర్వాత

"నిజం చెప్పవయ్యా బాబూ! పక్కవీధి భూలోక స్వర్గమనుకుంటున్నావా? అది పెళ్లాం లేనోళ్ల పెన్నిధి కావచ్చు కాని సుఖరోగాల నిధి గూడా" అనుమానంగా చూస్తోంది అతని కళ్లల్లోకి.

అర్జంటు పనేదో గుర్తుకొచ్చినట్టు మెట్టయ్య "సరే వస్తా"నని చటుక్కుని లేచి నుంచున్నాడు. ముందే పొడగరి. బక్కపలుచనై రివటలాగయ్యాడు.

"కూచో బాబూ, కూచో, నా మాటలు జాగర్తగా వినిపో. లేకపోతే తవరు తిరిగి వెళ్లేది వరంగల్‌కు కాదు. వల్లకాడుకు" సీరియస్ వార్నింగ్.

నెత్తిమీద పిడుగుపడ్డట్టు మెట్టయ్య 'ఆc' అంటూ నోరు తెరిచాడు. గుండెలు బాదుకుంటూ కూచున్నాడు. నుదుటిమీద చెమట ట్యూబులైటు వెలుతురులో మెరుస్తోంది. కళ్లల్లో ఆందోళన కొట్టొచ్చినట్టు కనబడుతోంది.

అరెరే! అందుబాటులో సుఖముందని ఆబగా అనుభవించాడన్న మాట. ఇంద్రియాల బలహీనతలకు మానవ మాత్రులు బానిసలు. చిత్తంలో స్థితప్రజ్ఞత లేకపోతే

బతుకు వెతల కథనే.

నిజానికి మాకే గుండెలు ఝల్లుమన్నాయి.

"నిజమా. నిజమా మెట్టయ్యా. సత్తికొండ అనుమానం నిజమేనా?" భుజాన్ని ఊపుతూ అడిగాను.

"ఆమెది అనుమానం కాదన్నా. నిజమే. నలుగురికి తెలిస్తే నవ్విపోతరు. పొరపాటు జరిగిపోయింది." మెట్టయ్యా సిగ్గుతో తలవం చుకున్నాడు.

పొలమారినట్టు- గొంతు గురగురలాడింది. గెడ్డం తడుముకుంటూ నుదురు కొట్టుకుంటు న్నాడు. "నా ఆరోగ్యం బాగా లేదన్నా. అదే చెప్తాంటే సిగ్గుబోతుంది."

"ఓర్నియవ్వ! మరిప్పుడెట్లా?" సిద్దయ్యా అదిరిపాటు. మెట్టయ్యను పైకిలేపాడు. పాపం! కళ్లల్లో నీళ్లూరుతున్నాయి. చెంపల మీంచి రాలిపడుతున్నాయి. అయ్యో పాపం! అన్పించింది.

"ప్చ్ వెనకా ముందు ఆలోచన లేకుండా, ఎంత పనిచేసిన వన్నా!" సిద్దయ్యా చేతిగుడ్డ మెట్టయ్యా కళ్లను తుడుస్తోంది. "మాతోనే ఉంటే మా రూముల ఉందువు గదా!"

"అయిందేదో అయిందిగాని తరుణోపాయం ఆలోచిస్తే బావుంటుంది" సత్యనారాయణ సలహా. "పొట్టకూటికోసం ఉద్యోగాలు చేస్తున్నాం. ఇంక్రిమెంటు కోసం ఇంత దూర మొచ్చినం. ఫ్యామిలీతో వస్తే ఖర్చులకు తట్టు కోలేమని ఒంటరిగా వస్తే ప్చ్ ఇలాగైంది."

"అందరి మనసులు ఒక్కరకంగా ఉండవు గదా. పాపం... ఉండబట్టలేక ఉరుకులాట. ఫలితం... ఇది." సిద్దయ్యా సింపతీ.

సత్తికొండ బుగ్గలు నొక్కుకుంది.

"ఓలమ్మో, వెంటనే ఓ మాంచి డాక్టర్ను సంప్రదించు. వైద్యం చేయించుకో. ఓయ్! చిలకలమీదికి మనసు మళ్లితే శరీరమనే పంజరంలో పేణమనే చిలక ఎగిరిపోతుంది. జాగర్తబ్బాయా!" చివరి మాట మమ్మల్ని చూస్తూ అనేసింది. ఆ హెచ్చరిక మాగ్గూడా వర్తించాలని ఆవిడ ఉద్దేశమని మాకర్థమైపో యింది.

అంతటితో ఆరోజు సమావేశం ముగి సింది.

మర్నాడు మెట్టయ్యను స్పెషలిస్ట్ డాక్టరు వద్దకు తీసుకెళ్లాం. రక్తపరీక్ష, మూత్రపరీక్షల తర్వాత మందులు రాస్తూ డాక్టరు "ఇంకా నయం. ఈ సుఖరోగం బాగా ముదిరితే ఆ భగవంతుడు కూడా కాపాడలేడు" అంటూ చీటీ చేతికిచ్చాడు. "వీటిని క్రమం తప్పకుండా వాడితే పది రోజుల్లో మామూలు మనిషైపో తారు. లేకపోతే ప్రమాదం. అందుబాటులో ఉన్నాయి గదాని అన్నింటినీ అనుభవిస్తే అధోగతే. ఆ అలవాటు పూర్తిగా మానుకో వాలి" గట్టి హెచ్చరిక. మొట్టికాయ లాగుంది.

"ఫ్రెండ్స్ చాటుమాటు వ్యవహారం నేటుకొ చ్చింది. నలుగురికీ తెలిస్తే నా ఇజ్జత్ పంచ నామా ఐతది. ప్లీజ్ ఈ సంగతి ఎవ్వరికీ చెప్పొద్దు." మా చేతులు పట్టుకు బతిమా లాడు మెట్టయ్యా.

"కాని... డాక్టర్ చెప్పింది బాగా గుర్తుం చుకో" నా హెచ్చరిక కూడా జోడించాను. "ఆస్తిపోతే ఫరవాలేదు, తిరిగి సంపాదించుకో వచ్చు. ఆరోగ్యం పోతే కొంత నష్టం. కాని శీలం పోతే అంతా నష్టమే." ఆంగ్ల సామెతను ఆంధ్రీకరించి చెప్పాను.

వారం రోజులు సెలవుబెట్టి మెట్టయ్యా గది లోనే ఉండిపోయాడు. అతని రూమ్మేటును అనుమానం తొలిచేసింది. అంచెలంచెలుగా ఆ అనుమానం పెనుభూతమైంది. నలుగురి నోట్లో నాని మరికొంత మందిని చేరుకుంది.

అదిగో పులి అంటే ఇదిగో తోక- అనే రోజుల్లో అంత పెద్ద వార్త అణిగి మణిగి ఉంటుందా! ఆనోటా ఈనోటా క్లాసంతా గుప్పుమంది. పాపం! వారం రోజుల తర్వాత క్లాసుకొచ్చిన మెట్టయ్యా అవమాన భారంతో తలెత్తుకోలేకపోయాడు. అందరితో తప్పిం చుకు తిరుగుతున్నాడు.

మెట్టయ్యా కేసు శృతిమించి రాగానపడింది గాని కోర్కెల గుర్రాలకు కళ్లెం వేయలేక మరి

కొందరు క్లాసుమేట్సు బుడంపేట బురద అంటించుకున్నారని తెలిసింది. వాళ్లంతా తేలుకుట్టిన దొంగల్లా ఉండిపోయారు. ఎందుకైనా మంచిదని డాక్టర్ను సంప్రదించారు.

అప్పటికింకా ఎయిడ్స్ భూతం మన దేశానికి దిగుమతి కాలేదుగాని అయితే ఎన్ని ఘోరాలు జరిగిపోయేవో. ఒక్క మాట నిజం. మెట్టయ్య ఉదంతం అందరికి చెంపపెట్టులా పనిచేసింది. ఎవరి జాగ్రత్తలో వారున్నారు.

రాత్రి రోజువారీ సమావేశంలో సత్తికొండ కనబడలేదు. వెలితిగా ఉంది.

"సత్తికొండ లేకపోతే సమావేశం బోసిబోతుంది" సత్తికొండ కూచుండే స్థలాన్ని కళ్లతో చూపిస్తూ సత్యనారాయణ గుర్తుజేశాడు.

"నిజమే నండోయ్. ఆవిడెక్కడా? " సాలోచనగా అంది రోహిణి.

"అవును గదా సత్తికొండ లేకపోతే దేవుడు లేని జాతర లెక్కున్నది. ఎక్కడికి వోయిందటా!" సిద్దయ్య ఎదలో ఏమవుతుందోగాని హోంవర్కు చేసుకుంటున్న చిన్నారి రామారావును పిలిచి "అయ్యా! ఎన్టీరామారావుగారు" అడగబోయాడు.

"కాదు. నా పేరు యం.రామారావు." పిడుగులా స్పందించాడు చిన్నారి. మేమతణ్ని గారాబంగా ఎన్టీఆర్ అని పిలుస్తాము.

"ఏదో ఒక రామారావు లేవయ్యా అల్లుడా! మన సత్తికొండ నీకేమన్నా కనబడిందా? "

"ఓ మాబాగా కనబడింది మావయ్యా. అదిగో వాళ్ల గది ఉంది గదా అందులో ఉంది మావయ్యా" ఓ చిరునవ్వు విసిరేసి తుర్రుమన్నాడు.

"మనందరికంటే ముందొచ్చి కూచునేది. ఇయ్యాల్ల ఎందుకు రాలేదో!" రాజయ్య నెత్తిగొక్కున్నాడు.

"ఐతే మనమే వాళ్ల రూములకు పోదాం పదండి."

ఆనందం ప్రతిపాదన.

"అవునవును" అంటూ ఒకరి వెంట ఒకరం అంతా ఆ గదిలో ప్రవేశించాం.

వాతావరణం- పాత సినిమాలో విషాద సంఘటన దృశ్యంలాగుంది. సత్తికొండ, గిరిజ, పైడితల్లి ముగ్గురు మూడు వైపుల కూచున్నారు.

"గదేందీ! పొయ్యిరాళ్ల లెక్క ముగ్గురు మూడు దిక్కుల కూచుండి ఏం జేస్తున్నరబ్బా? " సిద్దయ్య ముందు వెళ్లి గిరిజ- సత్తికొండల మధ్య కూచున్నాడు. "గట్ల మూగదయ్యాల లెక్క ఉన్నరేందీ? "

"ఏందమ్మా గిరిజా! ఏదన్నా సమస్యనా? " ఎటో చూస్తున్న గిరిజనడుగుతూ పైడితల్లి పక్కన కూచున్నాను. వాళ్లు ముగ్గురు నిర్లిప్తంగా మొహాలు చూసుకుంటున్నారు.

"అరె గట్ల మొకాలు చూసుకుంటే మాకేం దెలుస్తదటా. సంగతేందో కుండ పలగ్గొట్టినట్టు చెప్తే అర్థమైతది" అంటూ కాశీనాథ్ నా పక్కన కూచున్నాడు. మిగతా వాళ్లు కూడా కూచున్నారు. గచ్చునేల చల్లదనం శరీరంలో ప్రవేశించి తలదాకా పాకుతోంది. విద్యుత్కాంతి కిరణాలు అందరినీ అందరికీ స్పష్టంగా చూపిస్తున్నాయి. బయట తుంపరగా ముసురు పడ్తోంది.

"అది కాదండీ గిరిజ గర్భవతిగదా! ఐదో నెలగందా." పైడితల్లి నోరు విప్పాడు. గిరిజ తలను ఆప్యాయంగా నిమిరింది రోహిణి. గిరిజ బుగ్గలు ఎర్రమందారాలైనాయి.

"అయితే ఏమిటటా? " సత్యనారాయణ అడిగాడు.

పైడితల్లి మొహాన్ని సిగ్గు ఛాయలు అలుముకున్నాయి.

"అదేనండీ అదేదో సీమంతం చెయ్యాలంటున్నారు మా అత్తగారు. అందుకోసమే దిగులుగా కూచున్నారండీ."

"తొలి చూలుగదా. సీమంతం చెయ్యాల్సిందే" అంటూ గిరిజ చెయ్యందుకుని మృదువుగా నిమిరింది రోహిణి.

"ఐదో నెలలో అమ్మాయికి సీమంతం చెయ్యాల్సిందే గదా!" ఉత్సాహంగా రెట్టిం

చింది. "దిగులెందుకటా సంతోషించాలి."

"అవునూ మంచిరోజు చూసి ఆ ముచ్చట జరిపిస్తే పోలా!" హావభావాలేవీ ప్రదర్శించ కుండా అలవోకగా అనేశాడు సత్యనారాయణ.

"ఊ!" సత్తికొండ నిట్టూర్చింది "అంతా బాగానే ఉంది గానీ, అల్లుని నోట్లో శని ఉందన్నారు." పైడితల్లి వైపు చేతులు తిప్పింది. పైడితల్లి మొహం తిప్పుకున్నాడు.

"పాపం! మా ఆయనేమన్నాడే అమ్మా" గిరిజకు రోషం పొడుచుకొచ్చినట్టుంది.

"అది కేవలం సామెతనమ్మా" గిరిజను సముదాయించాల్సి వచ్చింది. "అయినా సీమంతం చెయ్యడమొక సమస్యనా? " సత్తి కొండ నడిగాను. "వెంటనే చేసెయ్యాలె"

"అలాగలాగే! చెయ్యాలని నాకుంది" సత్తి కొండ గొంతులో గాంభీర్యం "కాని పేరంటం చేసేందుకు మాకు బంధువులెవరున్నారు? నా తల్లి గిరిజ పది కాలాలపాటు పసుపు కుంకాలతో చల్లగా ఉండాలి. సీమంతం పను లన్నీ ముత్తైదువులే చెయ్యాలగందా!" గర్భ కుహరంలోని పొంగు కళ్లల్లో కనిపించింది.

"దానికేం భాగ్యం. మేమున్నాంగదా" రోహిణి దృష్టి శ్రీమతి కాశీనాథ్‌ను తడి మింది. ఈ మధ్యనే శ్రీమతి కాశీనాథ్ కలు పుగోరుగా మాట్లాడ్తోంది ఆడవాళ్లతో.

"అవును. మేము నల్గురం లేమా అన్ని పనులు మేమే చేస్తాం" శ్రీమతి కాశీనాథ్ భరోసా పలికింది.

"నిజమే. ముహూర్తం పెట్టెయ్యండి గురూ గారూ!"

అంటూ సత్యనారాయణ తన గదిలోకెళ్లి తిథి, వార, నక్షత్రాల క్యాలెండర్ తెచ్చి నా చేతికిచ్చాడు.

కొద్దిపాటి సంప్రదింపులతో ముహూర్తం నిశ్చయమైంది. వచ్చే ఆదివారం పంచమి మంచిరోజు. ఆ రోజే సీమంతోత్సవం. అంతా సరేనన్నారు.

"గీమాత్రానికే ఆస్తులన్నీ ఎవరో దోచుకు పోయినట్టు గట్ల కూకుండి పోతవా సత్తి కొండా? " అన్నాడు సిద్దయ్య లేస్తూ

"ఊహుఁ సత్తికొండ వొర్రి సత్తుపిండే" కవ్వించాడు.

"చాల్చాలు లేవయ్యా సన్నాసీ!" సత్తికొండ లో సంతోష తరంగాలు. "ఇక చూత్తానుగదా తవరెట్లా చేత్తారో" చేతులు, మూతి తిప్పే సింది.

మర్నాడు క్లాసులో మరో చర్చ

ట్రైనింగ్ పూర్తి కావస్తోంది. వచ్చే ఆదివా రము అందరమూ కలిసి సింహాచలం వెళ్లి అప్పన్న దర్శనం చేసుకోవాలని. మేము ఆరు గురం విడిగా చర్చించుకున్నాం.

"మనల్ని నమ్ముకుని సత్తికొండ కూతురు సీమంతోత్సవం పెట్టుకుంది గదా. మనమ టువె ళ్తే ఇదెట్లా? " రాజయ్య గుర్తు చేశాడు.

"అవునవును. అసలే అయిన వాళ్లెవరూ లేరని అల్లాడిపోతోంది. మనం కూడా ఉండ మంటే సత్తికొండ గుండాగి గుటుక్కుమం టుందేమో!" సిద్దయ్య భయం.

"అప్పన్నను... అందరి మొక్కులు అందు కుంటున్న సింహాచలం నరసింహుని దర్శిం చుకోవాలని మాకూ ఉంది కాని వచ్చే ఆది వారం కుదరదు" మా తీర్మానం ప్రకటిం చాను.

"ఫరవాలేదు, మీరు వెళ్లిరండి." సత్యనారా యణ చెప్పేశాడు మిగతా వారితో.

ప్రాక్టీసుతో అందరి మనసులు తాబేలు అవయవాల్లా ముడుచుకుపోయియున్నాయి గదా. సింహాచలంలో వారికి, సీమంతోత్సవ ములో మాకు మంచి రిలీఫ్ దొరుకుతుంది.

పండగకోసం సందడి ప్రారంభమైంది. నలుగురు మిత్రుల భార్యలు ఏకమై సత్తికొం డతో సంప్రదించారు. కొనాల్సిన సరుకుల జాబితా తయారైంది. గిరిజను వెంటబెట్టు కుని బజారుకెళ్లి సరుకులన్నీ కొనేశారు. చుట్టుపక్క ల ఇళ్లలోని ముత్తైదువులను పేరంటానికాహ్వానించారు.

అనుకున్న ఆదివారం రానే వచ్చింది.

అందరమూ పనుల్లో మునిగిపోయాం. ఫలితంగా గుమ్మాలకు మావిడి తోరణాలు పచ్చని పండగకి, అతిథులకు స్వాగతం పలుకుతున్నాయి. సరికొత్త అలంకరణలతో పాత ఇల్లు కొత్త పెళ్లికూతురులా ముస్తాబైంది. మా గది ముందు వరండాలో ప్రత్యేకమైన వేదిక వెలసింది. వేదిక చుట్టూ పూలదండలు వేళ్లాడుతున్నాయి. ఆనందం, కాశీనాథ్, రాజయ్యల భార్యలు గిరిజను ముస్తాబు చేస్తూంటే రోహిణి వేదిక ఏర్పాట్లను పర్యవేక్షిస్తోంది. పేరంటానికొచ్చిన ముత్తైదువులకు స్వాగతం పలికి కూచోబెడుతోంది. వేదిక మీద మహారాజా కుర్చీ కొలువుదీరి ఉంది.

స్వయంగా రంగంలోకి దిగి సత్తికొండ వంటకాలు తయారు చేస్తోంది. సిద్ధయ్య, పైడితల్లి ఆమెకు సహాయం చేస్తున్నారు. పై పైనులు మిగతావారం చూస్తున్నాం.

సుముహూర్తానికి సమయమాసన్నమైంది.

గాజుల గలగలలు, కాలి అందియల సవ్వడులు లయబద్ధంగా వినబడుతున్నాయి. ముగ్గురు ముత్తైదువల మధ్య గిరిజ రాజహంసలా అడుగులేస్తూ వస్తోంది. వసంతాగమనములో ప్రకృతి కన్యలా గిరిజ చూడముచ్చటగా ఉంది. ఆకుపచ్చని సిల్కుచీర, అదేరంగు బ్లౌజు, నల్లనాగులా మిలమిల మెరుస్తూ గుండెల మీదాడుకుంటున్న జడ, కళ్లకు కాటుక, బుగ్గన చుక్క తీర్చిదిద్దిన ముఖారవిందం సిగ్గుల బుగ్గలతో కళకళలాడ్తోంది.

ఆమ్మో గిరిజ దివినుండి భువికి దిగివచ్చిన దేవతలాగుంది. వైకుంఠములో శ్రీ మహాలక్ష్మి ఇలాగే ఉంటుందేమో!

ఆరుగురం ఓ పక్కన కుర్చీల్లో కూచున్నాం.

సత్తికొండ ఆనందం అంతా ఇంతాకాదు. నాయమ్మే... నాతల్లే నా బంగారుకొండ అంటూ పరవశిస్తూ మెటికలు విరుచుకుంది. ఉన్నంతలో చక్కగా తయారైన సత్తికొండ వయసు పదేళ్లు తగ్గినట్టనిపిస్తోంది. మొహం ఫోకస్ లైటులా వెలిగిపోతోంది.

రోహిణి ఎదురెళ్లి గిరిజ చెయ్యందుకుంది. చెవిలో ఏమందో ఏమో కాని... వెంట ఉన్న ముత్తైదువులు ముసిముసి నవ్వులు రువ్వుతున్నారు. గిరిజను మహారాజా కుర్చీలో కూచోబెట్టారు. పెళ్లీడు కొచ్చిన ఆడపిల్లలు చెవులు కొరుక్కుంటున్నారు.

నలుగురు మిత్రుల శ్రీమతుల సదవగాహన సమయస్ఫూర్తి అందరినీ ఆకట్టుకుంటోంది.

ఆ నలుగురు గిరిజకు బొట్టుపెట్టి కొత్తగాజులు తొడిగారు. రంగురంగుల గాజులు హంగులు విరజిమ్ముతున్నాయి. కాళ్లకు పసుపు రాశారు. జడనిండా పొడవాటి మల్లె దండ తురిమారు. పాటలు పాడుతూ పళ్లు ఫలహారాలతో కొంగు నింపారు. ఇటు కన్నెపిల్లలు ముత్తైదువుల కాళ్లకు పసుపు రాస్తుంటే అటు గిరిజకు మంగళహారతి ఇస్తున్నారు. పేరంటం పాట - ఆమనిలో కోయిల పాటలాగుంది.

ఆ తర్వాత గిరిజకు రెండు పక్కల ఇద్దరేసి ముత్తైదువులు చేతులు పట్టుకుని కుర్చీలోంచి లేవదీశారు. ఆ క్షణాన గిరిజ కైలాసం నుండి దిగివచ్చిన పార్వతీదేవిలాగుంది. మొదట దేవుని ఫొటోకు నమస్కరించి ఆ తర్వాత పైడితల్లి పాదాలకు నమస్కరించి ఆశీస్సులందుకుంది. మెల్లిగా అడుగులో అడుగులేస్తూ సత్తికొండ దగ్గరికొచ్చింది.

ఒలింపిక్స్‌లో స్వర్ణపతకం సాధించిన క్రీడాకారిణికిమల్లె సత్తికొండ గుండెల్లోని సంతోష తరంగాలు మొహమ్మీదికొచ్చాయి. ఆనంద బాష్పాలు అశ్రుధారలై జలజలా రాలిపడుతున్నాయి.

"మొదట అన్నయ్యల దీవెనలందుకో తల్లీ!' ' అంది మమ్మల్ని చూపిస్తూ.

"అదెట్లా? " నేను వారించాను. మొదట కన్నతల్లి. ఆ తర్వాతే మిగతావారు. అమ్మ

> ఆత్మ నిగ్రహం వినయానికి దారితీస్తుంది.
>
> – సంస్కృత సూక్తి

పాదాలకు దండంపెట్టి ఆశీస్సులందుకో గిరిజా!"

"అలాగే, పెద్దన్నయ్యా!" అంది గిరిజ.

ఆనాడు గుండెల మీదాడుకున్న పసి కూన గిరిజ తన ఒడిలో పారాడిన చిన్నారి. నేడు తల్లికాబోతున్న గర్భిణి. తల్లికి పాదాభివందనం చేసింది గిరిజ.

వణుకుతున్న చేతులతో కూతురు భుజాలను పట్టి లేపి గుండెలకు హత్తు కుంది సత్తికొండ. రెండు నిండు గుండెల్లో- అష్టమ సముద్రం అలలై పొంగిందేమో ఓ నిమిషం. తన్మ యత్వం, అలౌకికానందం... నిశ్శబ్ద శబ్ద తరంగాలను, గుండె చప్పుళ్లను వింటూ అలాగే హత్తుకుపోయారు తల్లీ కూతుళ్ళు. నాలుగు కళ్ళు నయా గరా జలపాతాలైనాయి. చూస్తున్న వారి ఎద పొదలలో అనిర్వచనీయ మైన అలజడి.

అవి అమృత ఘడియలు. విడదీ యరాని ఆత్మీయతానురాగబంధాలు. నా మనోనేత్రాలు ఆ చెల్లిని అనురాగ వల్లిగా దర్శించాయి. గిరిజ తల నిమురుతూ మనసారా ఆశీర్వదించాను.



## ఏది మేలు?

సుమారు రెండు దశాబ్దాల క్రితం ఆంధ్రరాష్ట్రాన్ని క్షుద్రసాహిత్యం ఉగ్రరూతలూగిస్తున్న రోజులు..

ఆ సాహిత్యాన్ని మెచ్చుకుంటూ శ్రీశ్రీ ఇత్యాదులు రాసిన విప్లవకవిత్వాన్ని దుయ్యబడుతూ ఒకాయన 'పదండి ముందుకు పదండి ముందుకు అంటారు కొందరు కానీ వారు మాత్రం ఎప్పటికీ వెనకే ఉంటారు' అంటూ శ్రీశ్రీని అన్యాపదేశంగా ఎత్తిపొడిచారు.

తర్వాత కొన్నాళ్లకు ఫలానా ఆయన ఇలా అన్నారు మీరేమంటారు అని శ్రీశ్రీని అడిగితే- 'నిజమే.. ముందుండి క్షుద్రసాహిత్యాన్ని నడిపించే కంటే వెనకుండి విప్లవసాహిత్యం నడిపించడం మేలుకదా' అన్నారు తడుముకోకుండా.

సిద్దయ్యేతే "గిరిజమ్మా! నాకు తోడబుట్టిన అక్కాచెల్లెళ్ళు లేరు తల్లీ. నువ్వాలోటు తీర్చినావమ్మా!" అంటూ గిరిజ చేతుల్ని కళ్లకద్దుకున్నాడు.

నలుగురు మిత్రులు, వారి శ్రీమతులు ఆనంద నందన వనములో విహరిస్తున్నట్టు హాపీగా ఆశీర్వదించారు.

ఆ తర్వాత పేరంటానికొచ్చిన ముత్తైదువులకు, కన్నె పిల్లలకు గిరిజ చేతుల మీదుగా పూలు, పళ్లు, ఫలహారాల వాయినాలిప్పించారు. అందరికీ పాద నమస్కారం చేయించారు.

పరమేశ్వరుని సన్నిధిలో మనుషులంతా సమానమేనని పండగలు పబ్బాలు, పేరంటాల ద్వారా నిరూపించే భారతీయ సంస్కృతికి మనసులోనే హాట్సాఫ్ చెప్పుకున్నాను.

పేరంటమయాక గుర్తుకొచ్చింది, ఆకలికి తట్టుకోలేక కలకలం బయలుదేరిందనీ, కడుపులో పేగులు నకనకలాడుతున్నాయి.

"వాయ్ సిద్దయ్యా!" సత్తికొండ చేతులు నడుమ్మీదున్నాయి. "భోజనానికి రండయ్యా. ముందు మగవారు కూచోండి. ఆడంగులు వడ్డిత్తారు"

"ఆ తర్వాత ఆడోళ్లు కూచుంటరు మొగోళ్ల

వడ్డించాలె" అంటూ శ్రీమతి కాశీనాథ్ సత్తి కొండ పక్కన జేరింది.

రోహిణి నవ్వుతూ "లేడీస్ ఫస్ట్ అన్నారు కదా. ముందు మనమే భోంచేద్దామండీ" సవరణ ప్రతిపాదించింది.

"ఓయ్యస్. యావండోయ్! మగవాళ్లకు ఓపిక ఎక్కువుంటుందండీ" పైడితల్లి దాన్నో ఛాలెంజిగా స్వీకరించాడు.

"మేము ఆకలికామాత్రం ఆగలేమనుకున్నారా! ఆనాటి నుండి నేటిదాకా వంటావార్పు వడ్డనలో మొగాళ్లదే పైచెయ్యండి" ఒంటిమీదున్న కొత్త పాంటు - షర్టును చూసుకుంటూ విస్తళ్లు అందుకున్నాడు. ఏమిటీ పైడితల్లి అత్యుత్సాహం!

"అబ్బో. నా ఆకలి ఆకాశాన్నంటుతుందబ్బా" అంటూ సత్యనారాయణ మొహం చూశాను - ఆశగా.

"కొంచెం తట్టుకోండి గురూగారూ. పావు గంటలో ఆడవాళ్ల భోజనాలైపోతాయి. మిగిలిన స్వీట్సూ- హాట్సూ అన్నీ మనవే గదా!" సత్యనారాయణ ఆశజూపాడు. నోట్లో నీళ్ళూరుతున్నా 'సరే'ననక తప్పలేదు.

"మీరు కూచోండమ్మా" అంటూ రోహిణి చెయ్యి బట్టి కూచోబెట్టింది. సత్తికొండ మిగతా ఆడవాళ్లను గూడా పిలిచింది వచ్చి కూచోండని.

సత్తికొండ తప్ప ఆడవాళ్లంతా వరుసగా కూచున్నారు. నడుములు బిగించి మేము వడ్డనకు దిగాం.

ఆ రోజు అదో విశేషం. ఆడవాళ్లు, మగవాళ్లతో ఒకే కుటుంబ సభ్యుల్లా మెదలడం, సాన్నిహిత్యంగా మాట్లాడ్డం. ముందే మేము భోజనానికి కూచుంటే వాతావరణమలా ఉండేది కాదేమో! ఆడవాళ్లు లేవగానే మగవాళ్లు.

సత్తికొండ, సిద్ధయ్యా పక్కపక్కన కూచున్నారు. సిద్ధయ్యను కొత్తగా చూస్తూ "తినడంలో నాతో పోటీకొస్తావా బుల్లోడా?" సవాలు విసురుతున్నట్టు సత్తికొండ కనుబొమలు ఎగిరిపడ్డాయి. సిద్ధయ్యా కాదనలేదు.

"ఎంతెంత తింటారో తినుండ్రి" శ్రీమతి రాజయ్యా స్వీట్సు తీసుకొచ్చింది. "వడ్డనకు మేమున్నాం గదా తినుండ్రి" కొంగు నడుముకు బిగించుకుంది.

పాపం సిద్ధయ్య పిడికెడు మెతుకులు కడుపులోకెళ్లగానే పీకలదాకా తిన్నాననుకుంటాడు. అలాంటి అర్భకుడు పోటీకి దిగుతాడా! అదేమిటో తన ఒళ్లు తానే కింది నుంచి మీద్దాకా చూసుకుని "పోటీకి సై" అనేశాడు.

ఆడవాళ్లు చకచకా వడ్డిస్తూ తమాషా చూస్తున్నారు.

"సరే. మరి పోటీ నిబంధనలేమిటటా!" రోహిణి పోటీని గట్టిపరుస్తోంది. ఆమె గూడా కొంగు నడుముకు బిగించుకుంది. చూద్దాం తమాషా అనుకుంటున్నాం.

"వెరీ సింపుల్" చిటికెల పందిరి కింద చలాకీ సోగ్గాడులా చిటికేశాడు సిద్ధయ్య. "ఎవరు తక్కువ తింటే వారు విజేత. పోటీలో గెలిచినట్టు. గెలిచిన వాళ్ళకు ఓ లడ్డూ అదనంగా వడ్డించాలె. అంతే" గర్వంగా ఛాతీ విరిచి ప్రకటించాడు. సత్తికొండవైపు ఛాలెంజిగా చూశాడు.

గొల్లున నవ్వుతున్నారంతా. సత్తికొండ కళ్లు అరచేతులంతైనాయి. గాలిదీసిన ట్యూబులా నీరుగారిపోయింది.

"ఓసోస్! అయితే ఈ పోటీ నాకొద్దు బాబూ" మూతి ముప్పై వంకర్లు తిరిగింది. 'సినిమాకు తీసుకెళ్లురా మొగుడా' అంటే సినిమా థియేటర్ చూపించి వెనుదిరగమన్నాడట ఎవడో!"

"అయ్ మరి నాతో పోటీకి దిగడమంటే మాటలా మజాకా" విజయగర్వంతో మీసాలు తిప్పేశాడు.

పొట్ట చెక్కలయ్యేలా పగలబడి నవ్వామంతా.

నవ్వుల పువ్వుల స్నానాలతో గడిచిందా రోజు. ఆ రోజు గిరిజ, సత్తికొండ, పైడితల్లి

అనుభవించిన ఆనందం అంతా ఇంతా కాదు.

కాకినాడలో ట్రెయినింగ్ కాలపరిమితి నెలల్లోంచి రోజుల్లోకొచ్చి, కౌంట్ డౌన్ ప్రారంభమైంది. పాతిక రోజుల్లో ట్రెయినింగ్ ముగియబోతోంది. మా క్లాసుమేట్స్ రోజూ కాలెండర్‌చూస్తూ రోజులు లెక్కబెట్టుకుంటున్నారు.

ఫైనల్ పరీక్షలు దగ్గరకొస్తున్నాయి. హైద్రాబాదు నుండి ప్రత్యేకాధికారులొచ్చి పరీక్షలు నిర్వహిస్తారట. ఏమో పరీక్షల్లో ఏమవుతుందో! మోర్స్‌కోడ్ పూర్తిగా ఒంటబట్టింది కాని ప్రావీణ్యత ఓ పట్టాన అబ్బడం లేదు. కొందరి పరిస్థితి ఇంకా దారుణంగా ఉంది. వెనకబడిన వారికి ప్రత్యేకంగా ప్రాక్టీసు చేయిస్తున్నారు.



**నా ఉద్దేశమూ అదే..**

ఓ గొప్ప తెలుగుకవి శ్రీశ్రీతో మాట్లాడుతూ 'శ్రీశ్రీ నువ్వేమన్నా అనుకో.. ఈ శతాబ్దానికి నేనేనయ్యా గొప్పకవిని' అన్నారు కొంచెం దబాయింపు ధోరణిలో.

'అవును.. నేనూ అదే అనుకుంటున్నా' శ్రీశ్రీ సమాధానం.

అంతకుముందు ఆదివారం సిద్దయ్య, గుంటూరు సుబ్బారావులతో కలిసి దాక్షారామం వెళ్లొచ్చాను.

అలనాడు దక్షప్రజాపతి కావించిన దక్ష యజ్ఞం, యజ్ఞవాటిక ద్వాదశ జ్యోతిర్లింగాలలో అదొకటి. పవిత్రమైన నదీ తీరాన వెలసిన భీమేశ్వరుని లీలావిలాసము, దివ్య మంగళ స్వరూపము, కళ్లారా చూస్తుంటే సాహితీ క్షేత్రములో అమృత కవితా ధారలు ప్రవహింప చేసిన వేములవాడ భీమకవి, మల్లన, శ్రీనాథుడు లాంటి కవిదిగ్గజాల మనోజ్ఞభావాలు, కవితా సౌందర్యము మనసులో మెదిలాయి.

గర్భగుడిలో ప్రాణవట్టము ముట్టుకోగానే ఒళ్లు జలదరించింది. ఎదనిండా పులకింతలు.

పరమేశ్వరా! 'ఏమిటయ్యా నీలీల? అడిగిన వారికి సకల సంపదలు, భోగభాగ్యాలిస్తావు. నువ్వేమో ఏమీ లేని వాడిలా స్మశానంలో విహరిస్తుంటావు. భక్తులకు భూషణాలు, స్వర్ణాభరణాలు ప్రసాదిస్తావు. నువ్వేమో విషనాగుల నలంకరించుకుంటావు. పట్టుపుట్టాలు మాకిచ్చి నువ్వేమో పులితోలు ధరిస్తావు. పౌడర్లు, సెంటు, సుగంధ ద్రవ్యాలు మనుషులకిచ్చి విభూతి రేఖలతో నువ్వుంటావేమిటయ్యా జంగమయ్యా! అడిగినదే తడవుగా అందరికీ అన్నీ ప్రసాదించే భోళా శంకరా! నా మనసునే నైవేద్యంగా స్వీకరించి నాకు మోక్షమార్గం చూపించు స్వామీ. మోసాలు, ద్వేషాలు, దోషాల నిలయమైన కలియుగంలో ఇమడలేను. నన్ను నీలో కలిపేసుకోవయ్యా పదిహేనడుగుల స్ఫటిక లింగాన్ని ప్రార్థించాను.

ఏమిటో... పరమాత్మని సన్నిధిలో మాత్రమే పాపపుణ్యాలు గురుకొస్తాయి. నరనరాలలో పాకిన పశ్చాత్తాపం కరిగి కళ్ల నుండి జలజలా రాలి ప్రాణవట్టము మీద పడుతుంటే నన్ను నేనే నియంత్రించుకోవాల్సి వచ్చింది.

లడ్డు, పులిహోర, ప్రసాదం కొని ముగ్గురం ఆరగిస్తుంటే "ఏంటి గురూగారూ! గర్భగు

డిలో అంతసేపు అలాగే ఉండిపోయారు. ఏద్దైనా 'మొక్కుకున్నారా'" సుబ్బారావు అడిగాడు.

ఏమని చెప్పాలి? ఎలా చెప్పాలి? చతుర్విధ పురుషార్థాలలో చివరిది మోక్షం. అది ఎవరికివారు సంపాదించుకునేదే తప్ప మరొకరితో పంచుకునేది కాదు గదా - అని ఉన్న విషయం చెబితే ఉన్మాది అనుకుంటారేమో.

"నిజంగా ఏం కోరుకున్నావన్నా?" లడ్డు ముక్క నా నోటి కందిస్తూ అడిగాడు సిద్దయ్య.

"ఏముందబ్బా! ఇల్లూ-సంసారాలొదిలి ఇంతదూరమొచ్చినం గదా! దాక్షారామం దర్శనమైపాయె. అన్నవరం కూడా వెళ్లొస్తే బాగుంటుందిగదా!" విషయం దారి మళ్లించాను.

"నిజమే నండోయ్! ఓ ఆదివారం వెళ్లొస్తే పోలా!" ఆలయ శిఖరాన్ని చూస్తూ, పులిహోర నోట్లో వేసుకుంటున్న సుబ్బారావన్నాడు.

"అవునన్నా. సత్తికొండతో కలిసివెళ్తే అన్నీ చూపిస్తుంది." సిద్దయ్య బలపరిచాడు.

మర్నాడు రాత్రి గృహ సమావేశములో ఈవిషయం సత్తికొండ చెవిలో పడింది. సత్తికొండ సంతోషం అంతా ఇంతా కాదు. మేము అలా అడిగామో లేదో-

"ఆయ్ అదేం భాగ్యం సిద్దులూ! అసలు...నేనే అడుగుదామనుకుంటున్నా, ఆదివారం ఉదయం బండికెళ్లి సాయంత్రానికొచ్చేత్తే సరి" తేల్చి పారేసింది.

అయితే మా నలుగురు మిత్రులు అదే ఆదివారాన్ని ప్రాక్టీసు కోసం కేటాయించుకున్నామన్నారు. రాలేమన్నారు. వస్తే వాళ్లు జంటగా రావాలి. ఖర్చులూ కూడా సమస్యనే గదా!

"బండికొద్దు. బస్సులో పోయొద్దాం" సిద్దయ్య సవరణ. నాకు కూడా అదే బాగనిపించింది.



"ఆయ్ బాబోయ్!" సత్తికొండ చెయ్యి గుండెల మీదుంది. "నేను ఎడ్డమంటే నువ్వు తెడ్డమంటావని నాకు తెలుసు బుల్లోడా గత జన్మలో నువు మొండి మొగుడివి నేనే గయ్యాళి పెళ్లాన్నయుంటాను." ఎగబడింది. సిద్దయ్య తక్కువతిన్నాడా...

"ఆc అదంతా నాకు దెల్వది. రైలు కోసం పడగాపులు గాయాలె. బస్సులు చాలా ఉన్నాయి" మొండికేశాడు.

"తుస్సు తుస్సుమనే బస్సుకెల్దామంటావేటి. టయానికి రైలుబండి ఉందిగదా."

"ఆc రైలంటే... అదే మన్నా పూలరధమా!"

మిత్రులు, వారి శ్రీమతులు వారి వారి గదుల్లో కెళ్లిపోయారు. ఇంత చిన్న విషయాన్ని అంత సాగదీయాలా!

"అబ్బబ్బా! బస్సులో వెళ్లినా, రైల్లో వెళ్లినా... వెళ్లేది అన్నవరమే గదా!" ఇద్దరినీ మందలించి సర్దిచెప్పడం నా వంతయింది.

ఆదివారం తెల్లవారకముందే బయలుదేరదీసింది సత్తికొండ. "బేగెల్లాలి లేకపోతే కొండ మీద రద్దీకి మనం తట్టుకోలేం" అంటూ తొందర పెట్టింది.

మసక చీకట్లనూ, మబ్బు పరదాలనూ చీల్చుకుంటూ వెలుగురేఖలూ భూమ్మీద కొస్తున్నాయి. వాతావరణం బూడిద రంగు కొచ్చింది. ఆర్టీసి బస్టాండు బయట ప్రైవేట్ బస్సెక్కాం. ప్రకృతి సోయగాలను పరిశీలిస్తూ ఎనిమిది గంటలకు అన్నవరంలో దిగాం.

"క్రిష్ణమూర్తీ" సత్తికొండ భక్తితో సత్యనారాయణ స్వామి కొండకు మొక్కుతూ "అన్నవరం సామంటే అల్లాటప్పా సామి కాదు బాబూ! తన్మయంగా చెబుతోంది. "కొండెక్కి వచ్చిన వారికి కోరిన వరాలిస్తాడీ సచ్చన్నారాయణసామి. అందుకే ఈ కొండను రత్నగిరి అన్నారు. ఈసామే మా కులదైవం. ఈసామి చల్లని చూపు ఉంటే చాలు ఎన్ని కష్టాలొచ్చినా ఎదిరించవచ్చు.." కొండ మెట్లు భారం... పైకి కనబడనీయకుండా గలగలా మాట్లాడుతోంది. అది గమనించి సిద్దయ్య

పక్కకెళ్లాడు. సిద్దయ్య చెయ్యిని ఆసరాగా పట్టుకుంది. మెట్లు ఎక్కుతూ మూల మలుపు చేరుకున్నాం.

"కొంచెం సేపు రెస్టు తీసుకోరాదు!" సిద్దయ్య సలహా ఇచ్చాడు. ఎందుకైనా మంచిదని.

అహం దెబ్బతిన్నట్టుగా చటుక్కున చెయ్యి వదిలేసి వేగంగా అడుగులేయబోయింది. ఆయాసం ముంచుకొచ్చి ఆరాటాన్ని వెనక్కు నెట్టేసింది. బేలగా నుంచుండి మొహం చూసింది.

"ఓయ్ సత్తుపిండీ!" సిద్దయ్యకు సందు దొరికింది. "ప్రిస్టేజికి పోతే ప్రాణాలకు ఇబ్బంది. కూచో ఇక్కడ" అర్డరేశాడు కళ్లతో సైగచేస్తూ.

"ఆయ్. నువు గూడా కూచో బుల్లోడా!" అంటూ మూలమెట్టు మీద కూచుంది. "అప్పుడే నీ కాయాస మొస్తున్నట్టుంది. ఏవిటో ఈ కాలం కుర్రోళ్లు... పైన పటారం, లోన లొటారం" దమ్ము దీస్తూ కవ్వింపు విసిరింది.

"మా తల్లే..." సిద్దయ్య పెదాలు గమ్మత్తుగా అదిరాయి. "ఆయాస మొస్తుంది నాక్కాదు, నీకు సత్తికొండా! ఇట్లానే ఇంకా స్టేపు నడిస్తే సత్తికొండ పచ్చికుండ ఐపోవడం ఖాయం" చేతులతో పాటు నడుము గూడా గమ్మత్తుగా తిప్పేశాడు. "నీదంతా మొగుణ్ని కొట్టి మొరపెట్టుకునే గయ్యాళి బాపతులాగుంది" మూతి తిప్పేశాడు.

అరెరే... సత్తికొండకు కోపమొస్తుందేమో!... భయమేసింది. కాని లోపలి నుండి కొత్త ఉత్సాహం పొంగుకొచ్చినట్టు సత్తికొండ భళ్లున నవ్వేసింది. వెంటనే మొహం గంభీరమైంది. "ఏ జన్మలో ఏ పాపం చేశానొ వీర వెంకట సచ్చన్నారాయణ సామి నా మొగుణ్ని అంత బేగి తీసుకెళ్లి పోయాడు మొగుణ్ని కొడుతానన్నా, మొగుడితో దెబ్బలు తిందామన్నా... నాకా అదృష్టం లేకుండా చేశాడయ్యా" సజల నయనాలను కొనకొంగుతో అద్దుకుంది.

సిద్దయ్య జాలిచూపులు సత్తికొండ నభిషేకిస్తున్నాయి. ఆమాట ఎందుకన్నానా అని బాధపడుతున్నట్టుందతడు.

"మన చేతిలో ఏముందీ? పుట్టిన ప్రతి మనిషిగిట్టక తప్పదుకదా!" నేను సముదాయింపుకు దిగాను. "జాతస్యహి. ధృవో మృత్యుః ॥గీతాశ్లోకం... తాత్పర్యంతో సహా వివరించాను. "ఎవరెక్కడ తనువు చాలిస్తారో ఎవరికీ తెలియదు "మనమంతా ఆ దేవుడు చేసిన బొమ్మలం..."

అలా పావుగంట గడిచింది. ఆయాసం మాయమైంది.

"ఆయ్... అంతా ఆ దేవుని లీల. క్రిష్ణమూర్తీ! ఇహ పదండి" అంటూ సిద్దయ్య చెయ్యి అందుకుంది. "ఇదిగో సిద్దులూ! పిచ్చి పిచ్చి డైలాగులు చెప్పమాక" హెచ్చరిస్తూ అతని పక్కన నడిచింది - పైదాకా. పైన జనసందోహం - జాతరలాగుంది.

అమ్మోయ్! వీర వెంకటసత్యనారాయణ స్వామి దర్శనం కోసం రోజూ ఇంతమంది భక్తులొస్తారా! ఆశ్చర్యమేసింది.

ఎత్తైన కొండ. కొండపక్కనే పౌరాణిక గాథాలహరులతో పారుతున్న పవిత్ర పంపా నది. కొండమీద దేవాలయం. విశాలమైన ఆవరణ. శుచీశుభ్రతగల పరిసరాలు... ఆహ్లాదకరంగా ఉంది. దర్శనం కోసం క్యూలో నుంచున్నాం.

ముందు సిద్దయ్య, సిద్దయ్య వెనక సత్తికొండ, ఆమె వెనుక నేను నలుదిక్కులా చూపులు సారిస్తూ అడుగు ముందుకు వేస్తున్నాం.

పాప వినాశని అనిపించుకున్న పంపానదిలో స్నానంచేసి తడిగుడ్డలతో వచ్చాము. ఒంటిమీది గుడ్డలు ఇంకా ఆరిపోలేదు.

పుట్టుక నుండీ కాటి వరకూ సక్రమమైన, సరైన జ్ఞానాన్నే అర్థించు.
– మహమ్మద్ ప్రవక్త

మాట్లాడకుండా ఉండడము సత్తికొండ తత్వా నికి సరిపడదు. సిద్దయ్యగూడా అంతేగదా!

"యావయ్యోయ్ సిద్దులూ!" అంటూ నావైపు చూసింది. అంటే ఆమె చెప్పబోయేది ఇద్దరం వినితీరాలన్న మాట. "పంపానది అంత పవిత్రమైంది గదా. దాని పూర్వచరిత్ర తెలుసా? " హుషారుగా అడిగింది.

పూర్వచరిత్ర ఏమో కాని సిద్దయ్య ఇటు తిరిగి అటు అడుగులేస్తున్నాడు. "పంపాన దిల ఈతకొడుతుంటే చిన్నప్పుడు తల్లి ఒడిల ఆడుకున్నట్టనిపించింది. బయటకు రావాల న్పించలేదు. స్వచ్ఛమైన నీళ్లు ఆడపిల్ల నవ్వులా గలగలా పారుతున్నెగదా. ఒడ్డున కూచున్న సత్తికొండను చూసుకుంటూ స్నానం చేస్తుంటే ఓఫ్ ఎంత బాగనిపిం చిందో". ఆ మాటల్లో సత్తికొండ నుడికించా లనే ప్రయత్నముంది.

"హయ్యో రామ!" సత్తికొండ మూతి మూడు వంకర్లు తిరిగింది. చేతులు చలాకీగా లేచాయి. "సినిమాలో హీరో లాగా నువ్వు స్నానం చెయ్యాలనుకున్నావుగాని, అరగంట ఈదులాడకముందే అలసిసొలసి పైకొచ్చావు గందా!"

"నిజంగానే సినిమా హీరోయిన్ గట్టుమీ దుంటే... అరగంటేమిటీ, ఆరుగంటలైనా ఈదులాడే వాణ్ని. తెలుసా!"

"ఆహా. అరవైజిల్లాల అందగాడు వచ్చాడని సినిమా హీరోయిని దిగొస్తుందా! చింపాంజి గూడా రాదు కానీ అలనాడు శ్రీరామచంద్రుని కోసం ఈ పంపానది ఒడ్డున్నే ఓ ముసిల్ది ఎదిరిచూస్తూ కూచుంది గదా!"

"ఆc ఆc నువుగూడా గా ముసలి శబరిలె క్కనే కూచున్నవా? అయితే మరి ఎంగిలి పండ్లు తయారుగా ఉంచుకున్నావా...!" సాగ దీశాడు కావాలనే.

"ఆc... ఉంచుకున్న, మూతిపండ్లు. ఓయబ్బో... ఈ సిద్దులు శ్రీరామచంద్రుడైతే గదా నేను శబరిమాత నయేది. చాలు... చాల్లేవోయ్ అల్లరిబుల్లోడా...!"

వాద ప్రతివాదనలు సాగుతూనే ఉన్నాయి.

"సరేగాని.. మనం గర్భగుడి ముందుకొ చ్చినం" జనాల తోపులాటకు తట్టుకుంటూ గుర్తుచేశాను. "దెబ్బలాట ఆపేసి దైవాన్ని తలుచుకోండి." మందలించాను.

సత్తికొండ నాలిక్కరుచుకుని లెంపలేసు కుంది. సిద్దయ్య సరిగా మొహం తిప్పి మౌన ముద్ర దాల్చాడు.

వీరవెంకట సత్యనారాయణ స్వామి దివ్య మంగళ విగ్రహం ముందు అన్నీ మరిచి సాష్టాంగ నమస్కారం చేశాను. సిద్దయ్య, సత్తికొండ గూడా అలాగే చేశారు. మా ముందున్నాయన, ఎవరో పెద్ద ఆఫీసరట. అతని వెంట ఉన్నాయన పూజారి చెవిలో ఏదో ఊదాడు. పూజారి ముఖారవిందం శత దళాలుగా విచ్చుకుంది. అప్పటికే ఐదు టెంకా యల మొక్కుదీర్చుకుంది సత్తికొండ. "సార్. ఈ దేవాలయం చాలా ప్రాచీనమైనదండీ"తో ప్రారంభించాడు పూజారి. మేము అక్కడే ఆగి వింటున్నాము. "దీన్ని రత్నగిరి అంటారు గదా, దీనికి పురాణ నేపథ్యముంది.

మేరు పర్వత రాజుకు ఇద్దరు కుమారులు. ఒకడు భద్రుడు, ఇంకొకడు రత్నాకరుడు. ఇద్దరూ తమ పేరు చిరస్థాయిగా ఉండాలనే కోరికతో విష్ణుభగవానుని గురించి ఘోరతపస్సు చేశారు. విష్ణు భగవానుడు ప్రత్యక్షమై వారిద్దరి కోర్కె తీర్చాడు. దాని ఫలితంగానే భద్రుడు భద్రాచలంగానూ, రత్నాకరుడు రత్నగిరిగాను వెలిశారు. నైజాం లోని భద్రాచలంలో గోదావరి నదీతీరాన శ్రీరామచంద్రుడు, ఈ పంపానది ఒడ్డున రత్నగిరి మీద వీరవెంకట సత్యనారాయణుడు రెండు కొండలమీద విష్ణు స్వరూపాలే. ఈ స్వామి త్రిపాద్విభూతి మహానారాయణుడు. నారాయణ శాస్త్రాలంకారము ప్రకారము హిర ణ్యగర్భాత్మకుడై, దేవేరి అనంతలక్ష్మి సత్యవతీ సమేతుడై శ్రీ వీరవెంకటసత్యనారాయణ స్వామిగా వెలసి భక్తజన మనోరంజకుడిగా

దర్శనమిస్తున్నాడు." చెప్పేసి బలవంతపు చిరునవ్వు అతికించుకున్నాడు. ఒక చేత్తో గంట ఊపుతూ మరోచేత్తో హారతిచ్చాడు. తీర్థప్రసాదాలిచ్చాడు.

అప్పటికే మా వెనక క్యూలోనుంచున్నవారి తోపులాటలు, మోచేతి పొడుపులు శృతిమించి రాగాన పడబోతున్నాయి. నిరసనలు,



నిట్టూర్పులు బలం పుంజుకుంటున్నాయి. మరోసారి స్వామివారికి నమస్కరించి బయటికొచ్చేశాం. కొండ దిగి వచ్చేసరికి నాగ్గూడా మోకాళ్లలో నొప్పి ప్రారంభమైంది. ఉసూరుమంటూ కొండదిగగానే ఆకలి పిలిచింది.

హోటల్లో భోంచేస్తున్నాం. కొంతసేపు మౌనంగా ఉన్నాం. అన్నములో పెరుగు కలుపుకుంటూ "ఏదో మీ పుణ్యమాని చానా రోజులయాక సామి దర్శనానికొచ్చా నా తల్లి గిరిజకు మగబిడ్డ పుడితే మనవడితో సహా

మళ్లీ వస్తానయ్యా" అంటూ మౌనాన్ని చీల్చేసింది సత్తికొండ.

"ఎప్పుడూ నీ కూతురు గురించే మాట్లాడ్తావుగాని, మా పిల్లల్ని చూడవా మా ఊరికి రావా? " సిద్ధయ్య నిలదీశాడు. పాలల్లో పంచదారలా - ఆ నిలదీయడములో ఆత్మీయత రంగరించి ఉంది. హఠాత్తుగా సత్తికొండ ఆగిపోయింది. మొహం పంచరంగుల చిత్రమైంది.

"సిద్దులూ! ఇంతవరకు నన్నెవ్వరూ, ఎక్కడికీ రమ్మనలేదు. మీకూ, నాకు ఏజన్మలో ఏ బంధమున్నదో... మీ ఊరు రమ్మన్నావు. నాకెంత ఆనందంగా ఉందో తెల్సా!" కళ్లల్లో మెరిసిన మంచుపొరను కొంగుతో అద్దుకుంది.

"మా ఊరికి గూడా వచ్చితీరాలి సత్తికొండా" అన్నాను.

"నీకూ సిద్దులుకూ తేడా లేదు సామీ" అంది చేతులు కడుక్కునేందుకు లేస్తూ.

తిరుగు ప్రయాణంలో రైలెక్కాం. మా ఇద్దరిమధ్య కూచుంది సత్తికొండ. గలగలపారే గోదావరిలా ఏవో కబుర్లు చెబుతూనే ఉంది. సిద్ధయ్యను మాటలతో ఉడికిస్తూ - అతన్తో మాటలు పడుతూ హాయిగా అదో అలౌకికానందములా ఫీలవుతూ ముసిముసిగా నవ్వింది.

భారతదేశాన్నావహించిన ఎమర్జన్సీ చీకటి తొలగిపోయింది. సాధారణ ఎన్నికల రణరంగంలో సామాన్యుని ఓటు తూటాలా దూసుకొచ్చి అధికార దాహార్తుల ఎత్తుల్ని చిత్తుచేసింది.

పొద్దున్నే - సిద్ధయ్య ఇంటి నుండి తెచ్చిన బుల్లి రేడియోలో విన్నాము - ఆ వార్త. తన రేడియో తాను విని మా గదిలోకి పరుగెత్తుకొచ్చింది సత్తికొండ.

"క్రిష్ణమూర్తీ! వార్తలు విన్నావా, ఇది నిజమా? " గుండెలు బాదుకుంటూ దమ్ముతీస్తోంది..

"అవును. విన్నాను". వార్తను జీర్ణించుకునే ప్రయత్నములో నేనున్నాను. ప్రజలు తమవైపే ఉన్నారని భ్రమలో ఉన్న పాలకుల ఎత్తు చిత్తయిపోయింది. ప్రజాస్వామ్యం మళ్లీ ఊపిరిపోసుకుంది.

"మంచిగైంది సత్తికొండా!" సిద్ధయ్య తల దువ్వుకుంటూ "ఓర్నియవ్వ! మంచిపనైంది. అల్హాబాదు హైకోర్టు తీర్పును అరికాలు వెట్టింది గదూ. జబర్దస్తీగా పాలించి ప్రతిపక్ష నాయకులందర్నీ జైల్లల్లకుక్కిందికదూ" నిరసనగా కసినంతా కక్కేశాడు.

కాకినాడ సిటీలో ఆరోజంతా పండగ వాతావరణమే. క్లాసులో గూడా అదే విషయం అందరినోళ్లల్లో నానింది. పత్రికల్లో "అధికారాంతమునందు చూడవలె, ఆయమ్మ సౌభాగ్యముల్" క్యాప్షన్‌తో ప్రధాని విషణ్ణ వదనం ఫొటో వేశారు.

ప్రజాస్వామ్య పునరుద్ధరణలో నూతన ప్రభుత్వం అధికారం చేపట్టింది... ఆ కబుర్లతో మరికొన్ని రోజులు గడిచాయి. ఫైనల్ పరీక్షల కోసం ప్రాక్టీసు ఎక్కువైంది. థియరీ క్లాసులు లేవు.

ఆరోజు మేమిద్దరం ప్రాక్టీసులో మునిగి ఉన్నాం. అటెండరొచ్చి "సార్! మీ కోసం ఒకావిడ వచ్చింది. బయటనుంచోనుంది" అని చెప్పాడు. సిద్ధయ్యతో సహా బయటికొచ్చాను.

"సిద్దులూ!" సత్తికొండ కొంగునోటికడ్డం పెట్టుకుని భోరుమంది.

"ఏమైంది!" అడిగాడతడు.

"క్రిష్ణమూర్తీ! పైడితల్లికి యాక్సిడెంటయిందటా. గోర్మెంటు ఆస్పత్రిలో ఉన్నాడటా... బాబూ! గిరిజ అటుపోయిందయ్యా!"

ఆందోళనగా మొహాలు చూసుకున్నాం.

"అరెరే! అట్లనా! పద వెంటనే వెళ్దాం పదా!" అన్నాను. ముగ్గురం ఆటోలో వెళ్తున్నాము. "మా ఆయన నన్ను ఒంటరిదాన్ని చేశాడు. నా కూతురు గతి ఏమైపోతుందో ఏమో" గోడుగోడుమంటోంది. అయ్యోపాపం అనుకున్నాను. "పైడితల్లి కేమీ కాదు. ధైర్యంగా ఉండా"లంటూ ధైర్యం చెప్పాను.

ఆస్పత్రిలో పైడితల్లి మంచమ్మీద నిస్త్రాణగా పడున్నాడు. మోకాళ్లకూ, మోచేతులకూ కట్లు కట్టి ఉన్నాయి. గ్లూకోజ్ ఎక్కుతోంది. పక్కనే గిరిజ కూచునుంది.

"అన్నయ్యా చూడన్నయ్యా!" గిరిజ లేచినుంచుంది. అప్పటిదాకా ఏడుస్తూనే ఉందేమో కొంగుతో కళ్లద్దుకుంది.

గ్లూకోజ్ బాటిల్ ఖాళీ అయింది. నర్స్ వచ్చి పైడితల్లి చేతినుండి పైపు, నీడిల్ తొలగించింది. పైడితల్లి కళ్లు తెరిచాడు. చేతులెత్తి నమస్కరించాడు.

వివరాలన్నీ కనుక్కున్నాం.

పైడితల్లి సైకిల్ మీద డ్యూటీకెళ్తుంటే ఎదురుగా కారు వచ్చి గుద్దేసింది. కారు ఓనరే ఆస్పత్రికి తీసుకొచ్చి చేర్పించి, సత్తికొండ ఇంటికి కారు పంపించాడు. అదృష్టవశాత్తూ పైడితల్లి ఎగిరి రోడ్డుపక్కన పడిపోయాడట సైకిల్ చిత్తయిపోయింది.

సత్తికొండ, గిరిజలను వెంటబెట్టుకుని వెళ్లి డాక్టర్ను సంప్రదించాం.

"అదృష్టవశాత్తు పెద్దగాయాలేమీ లేవండి. మోకాళ్లు, మోచేతులు నేలకు గట్టిగా ఒరుసుకుపోయి రక్తం కారింది. ఫ్రాక్చర్‌లాంటివేవీ లేవు. కట్టు కట్టేశాం. ఇంజక్షన్ ఇచ్చి గ్లూకోజ్ పెట్టాము గదా. సాయంత్రం డిశ్చార్జి చేసేస్తాం. పేషెంటును ఇంటికి తీసుకెళ్లొచ్చు" ముక్తసరిగా చెప్పి రౌండ్స్‌కు వెళ్లిపోయాడు డాక్టర్.

అందరం తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాం.

కారు ఓనరుతో మాట్లాడాము. ఆయన సౌమ్యుడే.

"కొత్త సైకిల్ కొనిస్తాను. మందుల ఖర్చులు, మిగతా ఖర్చులు గూడా నేనే భరిస్తాను. పొరపాటున అలా జరిగింది. దయచేసి పోలీసుల దాకా వెళ్లొద్దండీ" మా చేతులు పట్టుకుని బతిమాలాడు. సత్తికొండ, గిరిజల ముందు విచారం వెలిబుచ్చాడు. సరే నన్నాం.

సత్తికొండ ఇంటికి మొగదిక్కు పైడితల్లి. గాయాలతో మంచమెక్కిన ఆ అమాయకుడిని వదిలిరావాలంటే మనసొప్పలేదు. సాయంత్రం పైడితల్లిని ఇంటికి తీసుకొచ్చాం. బాండేజి కట్లు ఉన్నా మనిషి మామూలుగానే ఉన్నాడు. డ్యూటీకి మూడ్రోజుల సెలవు చీటీ రాయించి, సిద్ధయ్య స్వయంగా ఇచ్చివచ్చాడు. పైడితల్లికి కొత్తసైకిల్ వచ్చేసింది.

రాత్రి గది సమావేశములో గిరిజ ఆక్సిడెంటు పూర్వాపరాలు అందరిముందు ఏకరువు పెట్టి "అదెంత పెద్ద ఆక్సిడెంటోనని



**ఇక్కడే చావనీయండి**

కొన్నిదశాబ్దాల క్రితం నాటిమాట. నవగ్రహ కూటమి ఏర్పడి ప్రపంచమంతా జలప్రళయం వస్తుందని పుకార్లు షికార్లు చేస్తున్న రోజులవి..

అరుణాచలంలో రమణమహర్షి ఆశ్రమంలో ఉన్న చలం- 'జలప్రళయం వచ్చేస్తోంది.. అంతా చచ్చిపోవడం ఖాయం. నువ్విక్కడికి వచ్చేయ్.. హాయిగా బతకొచ్చు..' అంటూ శ్రీశ్రీకి ఉత్తరం రాశారు. దానికి శ్రీశ్రీ జవాబిది.

"నాపై మీ వాత్సల్యానికి కృతజ్ఞతలు.. ప్రళయంలో జనమంతాపోతారని మీరన్నారు. అంతా పోయాక నేను బతికుండి మాత్రం ఏం ప్రయోజనం? చావైనా బతుకైనా నన్ను జనంతోనే చావనీయండి."

హడలిచచ్చాను. ప్రైప్రాణాలు పైననే ఎగిరిపో యాయంటే నమ్మండి" చెప్పుకుపోయింది.

"నాకైతే కాళ్లూ చేతులాడలేదు" సత్తికొండ కళ్లు పెద్దవి చేసి గుండెలమీద చెయ్యేసు కుంది. "మీ క్లాసుదాకా ఎట్లా వచ్చానో, ఎలా పరుగెత్తుకొచ్చానో ఏమో"

"ఇద్దరన్నయ్యలు వెంటనే వచ్చేశారండి ఆస్పత్రికి" వివరాలన్నీ నలుగురు మిత్రులకు చెప్పేసింది గిరిజ.

"వాళ్లిద్దరే నీ కన్నయ్యలా, మేముకామా? " ఆనందం సూటిగా అడిగాడు. అలాంటి ప్రశ్న దూసుకొస్తుందని గిరిజ ఊహించి ఉండదు. ఓ నిమిషం అయోమయంగా అందర్నీ చూసి "మీరారుగురూ నా కన్నయ్యలే కానీ అదే మిటో, ఈ ఇద్దరన్నయ్యలకు మా సంగతు లన్నీ తెలుసు" అంటూ సత్తికొండ వైపు చూసింది. లైటు వెలుతురుకు ముక్కుపుడుక తళుక్కుమంటోంది. చిన్నపిల్లలా పెదాలు తిప్పి "అయినా ఈ ఇద్దరన్నయ్యల విషయమే వేరు" అనేసింది.

మోకాళ్లు కౌగలించుకుని ఓ మూలన గోడకొరిగి కూచున్న పైడితల్లి "ఏవిటోనండి. ఎక్కడెక్కడి నుండో ఎందరో వచ్చి మా రూముల్లో ఆర్నెల్లు ఉండిపోతున్నారు గాని ఈ బ్యాచిలో ఏదో విశేషముందండీ" మనసు లోని అభిప్రాయం మర్యాదగా వెలిబుచ్చాడు.

కాస్సేపు చర్చ కొనసాగింది.

మనిషి మనసనేది స్క్రాచ్ కార్డులాంటిది. ఎంతసేపు చూసినా ఎదుటివారి కర్థంగాదు. రాపిడికి గురైనప్పుడే అసలు విషయం బయ టపడుతుంది. ఇప్పటిదాకా మేమారుగురం ఒకరి దృష్టిలో మరొకరం మంచి మను షులం. ఆ అభిప్రాయములో మార్పు రాకూ డదని మనసులోనే దేవునికి మొక్కుకున్నాను.

"అవునూ ఫైనల్ పరీక్షలకు హాజరవాలి గదా ఎవరికెలాంటి డౌట్స్ ఉన్నా చర్చించి తీర్చుకుందాం" అంటూ సందర్భము మార్చే శాను. ఆడవాళ్లు గదుల్లోకెళ్లి పోయారు. మేము అనుమానాల నివృత్తిలోకి దిగాం.

అందరి గుండె దడను, ఆటుపోట్లను గుటుక్కున మింగేస్తూ ఫైనల్ పరీక్షలైపో యినై. ఫలితాలు మూడు నాలుగు రోజుల్లో ప్రకటించి పాసైన వాళ్లందరినీ మూడు నెలల ప్రాక్టికల్ ట్రెయినింగ్ కోసం ఏదో ఓ పెద్ద టెలిగ్రాఫ్ సెంటర్‌కు పంపిస్తారు. సామాన్యంగా అందరూ పాసవుతుంటారు. కాని నూటికి ఒక్కరో ఇద్దరో ఫెయిలవుతుం టారట. అలా ఫెయిలయిన వారి పరిస్థితి ఘోరంగా ఉంటుంది. అందరినీ అదే భయం, దెయ్యంలా పట్టుకు పీడిస్తోంది.

నెలరోజుల ముందే ఇంటికి తిరుగు ప్రయాణానికి గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో సీట్లు రిజర్వ్ చేయించుకున్నాం. ఒకవేళ ఫెయిలైతే మరో నెలనో, రెండు నెలలో కాకినాడలోనే ఉంచేస్తారు. కానీ... పాసై తీరుతామనే మా ఇద్దరి ఆత్మవిశ్వాసం రిజర్వేషన్‌కు ప్రోత్సహిం చింది.

మూడు రోజులలో రెండు సినిమా షూటింగ్‌లు కాకినాడ పరిసర ప్రాంతాల్లో చూసేసరికి షూటింగుల మీద మొహం మొత్తినట్టయింది. మొదట థ్రిల్లు, రానురాను ఉత్సాహం నిల్లు.

ప్రాక్టికల్ ట్రెయినింగ్ కోసం నేనడిగిన సికిందరాబాదు సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసుకే నన్ను అలాట్‌చేశారు. కాని సత్యనారాయ ణను గూడా సికింద్రాబాద్‌కే అలాట్ చేశారు. ఠార్ మన్నాడతడు.

"అమ్మనాయనోయ్! ఎక్కడి మా అనకా పల్లి, ఎక్కడి ఆ సికిందరాబాద్. నేనక్కడికి రాలేను. దీనికేదన్నా ఉపాయమాలోచించండి గురూగారూ!" అంటూ బేజారయ్యాడు. అయిన వారిందరికీ దూరంగా వెళ్లాలంటే మనసు ఎంత క్షోభపడుతుందో నాకు బాగా తెలుసు. పాపం! సత్యనారాయణ సంసా

ఇతరులకు మంచి చేయడం అన్నది కర్తవ్యం కాదు. మంచి చేయడం అన్నది మీ ఆరోగ్యాన్ని ఆనందాన్ని పెంపొందించి సుఖాన్ని ఇస్తుంది. – జొరాస్టర్

రంలో, ఇంటివద్ద ఎన్ని ఆటుపోట్లున్నాయో! ఓ ప్రయత్నంచేసి చూస్తే!

పోస్టుమాస్టర్ జనరల్ ఆఫీసు (హైదరాబాద్)లో నాకొక పాతమిత్రుడున్నాడు. అతనితో ఫోన్‌లో మాట్లాడుతూ, ఏ ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజ్ ఏ ఫ్రెండ్ ఇండీడ్ సామెతతో ప్రారంభించాను. సత్యనారాయణ విశాఖపట్టణానికి అలాట్ అయ్యేలా అర్జంట్‌గా ప్రయత్నించుమన్నాను.

ఆశ్చర్యం. సత్యనారాయణ అదృష్టమో, మా మిత్రుని పలుకుబడి ప్రాబల్యమో మర్నాడే టెలిగ్రామొచ్చింది - సత్యనారాయణ సికిందరాబాదు బదులుగా విశాఖపట్టణములో జాయినవాలని. ఆ రోజు రాత్రి గృహసమావేశంలో సత్యనారాయణ రోహిణిలు నాకు ధన్యవాదాలు చెప్పారు. "మీ సాయం మరువలేను" అన్నాడతడు ఎంతో మురిసిపోతూ. అలవోకగా జరిగిన సహాయానికి అన్ని ప్రశంసలా!

కౌంట్‌డౌన్‌లో చివరి రోజు. మా క్లాసు ట్రెయినీలందరి ఆశల్నీ, ఆశయాలనూ అగ్నిపరీక్షకు నిలబెట్టేరోజు.

అందరం పాసయ్యామని అప్పటికే అనధికార సమాచార మందింది. తలా కొంత డబ్బువేసి వీడ్కోలు సమావేశం నిర్వహించాలని నిర్ణయించాం. అనధికార సమాచారాన్ని అధికారికంగా, అత్యుత్సాహంగా అందించారు. అందరమూ సంతోషించాం.

ఆరునెలలపాటు కాయకష్టం చేస్తూ కంటికి రెప్పలా కాపాడుకున్న పంట అనుకున్నంత దిగుబడి పొందిన రైతులా - మనసు ఆనందడోలికలూగింది.

ప్రిన్స్‌పాల్, అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్, టెక్నికల్ ఆఫీసర్, మా ఇన్‌స్ట్రక్టర్ అందరి సమక్షంలో వీడ్కోలు సమావేశం ఏర్పాటైంది. ప్రతి బ్యాచులో ఫస్ట్, సెకండ్ రాంకు సాధించిన వారికి బహుమతి, మెరిట్ సర్టిఫికెట్ ఇచ్చి సత్కరిస్తారని అప్పుడు తెలిసింది. మా బ్యాచులో నాకు సెకండ్ రాంకు వచ్చిందని తెలీగానే సిద్ధయ్య ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. నా చేతులందుకుని భక్తితో కళ్లకద్దుకున్నాడు. అందరికంటే ముందు అతడే అభినందించాడు. మరోపక్క సత్యనారాయణ అభినందనలందచేసి 'అసలు మాకే ఫస్టు ర్యాంకు రావాలట. కాని స్థానికులకే ఆ గౌరవం దక్కాలనే ఉద్దేశంతో ఇలా తీశారట గురూగారు" చెవిలో గుసగుస చెప్పాడు. ప్రతిభకు గుర్తింపు... పనిచేసి చూపిస్తే లభిస్తుంది గాని పైరవీలతో వచ్చిన గుర్తింపునకు విలువుంటుందా? దాన్ని నేనేమీ పట్టించుకోలేదు. ఏదో అనబోతున్న సిద్ధయ్యా నాకనుసైగనందుకుని కింనాస్తి అయిపోయాడు. శ్రీరామచంద్రుని ఆజ్ఞను తలదాల్చిన లక్ష్మణుడిలా నా పక్కన కూచున్నాడు. వీడ్కోలు సభలో పెద్దలంతా సందేశాలిచ్చారు.

అనుకోని, ఆశించని మర్యాద, బహుమతితోపాటు సర్టిఫికెట్ లభించింది. గురువుగారైన ఇన్‌స్ట్రక్టర్‌ను శాలువా, బంగారు ఉంగరముతో సత్కరించాం. ఆయన కళ్లల్లో ఆనందజ్యోతులు వెలిగాయి. మమ్మల్ని మనసారా ఆశీర్వదించారు. ఆరడుగులు కలిసి నడిస్తే వారు వీరవుతారన్నారు. మరిమేమో... ఆరు నెలలు కలిసి ఒకే క్లాసులో ఉన్నాంగదా! భావాలు పంచుకున్నాంగదా! విడిపోయే ముందు - తియ్యని బాధతో మనసులు మూల్గాయి. మమతలు పలుకరించి మౌనాన్నాశ్రయించాయి.

అదేరోజు సాయంత్రం తిరుగు ప్రయాణం కావాలి. ఆరేండ్లు అరబ్‌దేశాల్లో పనిచేసి తిరిగి సొంత ఊరు వెళ్తున్నట్టు హృదయాకాశంనిండా ఖుషీ మెరుపులు మెరిశాయి.

ఒంటిగంటలోపలే రిలీవింగ్ ఆర్డర్స్ అందుకున్నాం. ఆరు నెలల క్రితం అద్దెగది కోసం తిరిగిన అనుభవాలను నెమరేసుకుంటూ ఆరుగురము కలిసి ఇంటికొచ్చాం. ఆరు నెలల కాలము చరిత్రలో శూన్యమే కావచ్చు గాని మా బతుకు పుస్తకంలో ఒక అధ్యాయం.

"అయిందా! అయిపోయిందా! ఇక్కడి మీ



### విదేశీ వస్తుదహనం

విదేశీ వస్తుదనహనం జరుగుతున్న రోజులవి. ఒకాయన శ్రీశ్రీ విదేశీ సిగరెట్లు కాల్చడం చూసి, 'అయ్యా.. ఇదేంపని? అంతా విదేశీ వస్తుదహన కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొంటుంటే మీరేంటిలా? ..' అన్నాడు కొంచెం మందలింపు ధోరణిలో.

'నేను చేస్తున్నదీ అదేగా' అంటూ రయ్యిన వచ్చింది శ్రీశ్రీనుంచి సమాధానం. అడిగినాయనకు ఏమనాలో తోచలేదు.

ట్రెయినింగ్ అయిపోయిందా అన్నయ్యలూ!" అంటూ గిరిజ ఎదురొచ్చింది.

అంతకుముందు రోజే గిరిజ - పైడితల్లి సత్తికొండమ్మతోనే, ఆవిడింట్లోనే ఉండిపోవాలని నిర్ణయించాము. ఆ నిర్ణయం ఆరోజు నుండే అమల్లోకొచ్చింది.

"ఐపోయింది గానీ... మీ వారుఏరీ" అడిగాను.

"వారిప్పుడే బజారుకెళ్లారు. ఐదునిమిషాల్లో వస్తారన్నయ్యా" అంటూ తమ గదిలోకెళ్లింది గిరిజ. ఏదో పోగొట్టుకున్నట్టు ఎలాగో ఉంది గిరిజ వాలకం.

అటు మాట్లాడుతూ ఇటు హాంగర్లకు వేళ్లాడుతున్న డ్రెస్సులను మడతపెట్టి సూటుకేసుల్లో సర్దుకుంటున్నాం.

"గుడ్డలు సర్దుకుంటున్నారా! బాగానే ఉంది గాని ఆకలేయట్లేదా!" గిరిజ గుర్తుచేసింది తిరిగివచ్చి

నిజమే... ఇంటికెళ్తున్నామనే ఆనందం ఆకలిని మరిపింపచేసింది. గిరిజ గుర్తుచేయగానే కడుపులోని పేగుల్లో కలకలం స్ఫురించింది. ఇద్దరము కడుపులు పుణుక్కున్నాము.

"అవును గాని ముందు హోటల్ కెళ్లి భోంచేసొద్దాం పదన్నా!" సిద్దయ్య మరోసారి కడుపు పుణుక్కున్నాడు. అన్నంతిని ఎన్నిరోజులైందో - అన్నట్టుగా చూస్తున్నాడు.

"ఏపాటు తప్పినా సాపాటు తప్పదు గదా. పదా" నేను తయారయ్యాను. ఇద్దరమూ కలిసి గదినుండి బయటికెళ్లబోతున్నాము. గిరిజ వచ్చి గుమ్మానికడ్డంగా నుంచుంది.

"మీరిప్పుడు బయటికెళ్లడానికి వీల్లేదన్నయ్యా" బుంగమూతి పెట్టింది. చిన్నపిల్లలా రెండు చేతులు గుమ్మానికడ్డంగా సాచింది. ఆకలిని గుర్తుచేసి అన్నానికొద్దంటే ఎలా?

"అంటే... ఉపవాసం చెయ్యాలా తల్లీ!" సిద్దయ్య చురచుర చూస్తున్నాడు. ఆకలి నకనకలాడుతుంటే అంతకంటే ఇంకేంజేస్తాడు... పాపం.

"అమ్మోయ్. కనీసం ఈ రోజన్నా మా ఇంట్లో భోజనం పెట్టకపోతే మా వదినలు తిట్టిపోయరా! ప్లీజ్ అన్నయ్యా!" మూడురాళ్ల ముక్కుపుడక త్రివర్ణ పతాకంలా మెరుస్తోంది.

"అంటే వామ్మోయ్!" సిద్దయ్య చిన్నపిల్లాడిలా హడలిపోయాడు. "ఇప్పటికిప్పుడు వంట ప్రారంభిస్తావా! వంట పూర్తయ్యేసరికి తాతలు గుర్తుకొస్తారు తల్లీ!"

"వంట రెడీగా ఉంది లెవయ్యా మొనగాడా!" సత్తికొండ ప్రత్యక్షమైంది. 'ఈ పూట నా చేతివంట తినవయ్యా అందగాడా!' సత్తికొండ చేతులు నడుమ్మీదున్నాయి. కొంగు బొడ్లో ఉంది. గిరిజ పక్కకు జరిగింది. అదే సత్తికొండ... ఆరునెలల కిందట సత్తికొండనే.

నలుగురి మధ్య నలభై సెకండ్లపాటు

మౌనం చోటుచేసుకుంది. మేమెవరము, వీరెవరు? మనిషికీ మనిషికీ మధ్య పెనవేసుకున్న తాత్కాలిక బంధాలు అనుబంధాలై బలం పుంజుకున్నాయన్నమాట. వచ్చిన పని అయిపోయింది. ఇప్పుడు తిరిగి వెళ్తున్నాము. బతుకు బాటలో ఇదొక మజిలీ. మజిలీ నివాస కాలములో మనసులో నిలిచిపోయే మనుషులు... సిద్దయ్యను తదేకంగా చూస్తున్నాను.

"అదేవిటి క్రిష్ణమూర్తీ. అలాగైపోయావు. నా చేతి వంట బాగుండదా. లేక" సత్తికొండ గొంతులో వింత ప్రకంపనలు. అరెరే... మరో రకంగా భావిస్తుందేమో!

"ఛఛా. అలాకాదు. నీ చేతివంట రుచుల పంట. అమృతంలాగుంటుంది." గుండె కరిగి కళ్ళల్లోకొచ్చి సత్తికొండ నా పాదమస్తకం తడుముతోంది. ఆవిడ... కన్నతల్లిలా అమృత వర్షిణిలా కనబడుతోంది. కాని అమ్మా అంటే ఆమెకు నచ్చదు. కాదంటే మా మనసుకు తృప్తిలేదు.

"మేము ఋణగ్రస్తులమైపోతున్నాము. ఈ ఋణమెట్లా" అంతరాళాలలో అనిర్వచనీయమైన అలజడి...

"అద్గదో ఆమాటే అనొద్దన్నాను. ఇది ఋణం కాదయ్యా. మా అదృష్టం బాబు!" గొంతులో విషాదఛాయలు. అప్పుడే వచ్చాడు పైడితల్లి.

"ఇదో... స్వీట్లు తెచ్చానండీ" స్వీటుపాకెట్టు చూపించాడు. "లేవండి బావగారలూ... అంతా కలిసి భోంచేద్దాం. మనమంతా మా గదిలో భోంచెయ్యాలీపూట"

"అరెరే మాకోసం మీరు ఇంతవరదాకా భోంచెయ్యకుండా ఉన్నారా?" సిద్దయ్య గొంతుగోడలకేదో పాకుతున్నట్టుంది.

"మా అన్నయ్యలతో ఇది చివరి భోజనం" గొణుక్కుంటూ గదిలోకెళ్ళింది. "మళ్ళీ ఎప్పుడో"

ఐదుగురి మధ్య పదార్థాలు. తలా ఒక పదార్థము అందరికీ వడ్డించాము. భోజనం ప్రారంభమైంది.

"ఏయ్ సిద్దులూ! ఇంటికెళ్తున్నానని సంతోషంగా ఉంది గందా!" సిద్దయ్యను అదోలా చూస్తూ మరికొంచెం గోంగూర పచ్చడి వడ్డించింది సత్తికొండ. సిద్దయ్య తలపైకి లేచింది.

"ఇర్వై నాలుగు గంటల్లో ఇంటిదగ్గరుంటానని ఆనందంగా ఉందిగదా పెద్దన్నయ్యా" మరోసారి నెయ్యి వడ్డిస్తూ బేలగా చూసింది గిరిజ.

నిజమే. ముందు ఇంటికెళ్ళి రెండ్రోజులుండి ఆ తర్వాత భార్యా పిల్లలతో హైదరాబాద్ కెళ్లాలనుకున్నాను.

"అదేమిటి గిరిజా! ఇన్నిరోజులు ఇంటికి దూరంగా ఉన్నారాయె. సంతోషం. సహజమే గందా!" పైడితల్లి పళ్ళికిలించాడు.

ఇంకా ఏవేవో కబుర్లు. మేము పెరుగన్నం తింటున్నాము. సత్తికొండ వేళ్లు పచ్చడి మెతుకుల్ని కెలుకుతున్నాయి. నేల వాలిన చూపులు, గాలికొదలిన ముంగురులు, జారిపోతున్న కొంగు ఏలోకంలో ఉందో.

"ఏమైంది సత్తికొండా! మా భోజనం పూర్తవుతుంది. నువ్వింకా పచ్చడి మెతుకులే ప్రారంభించలేదు..." పక్కనే కూచున్న సిద్దయ్య ఎడమచెయ్యి ఆవిడ గదవబట్టి పైకి లేపింది. మొహం వాడిపోయిన బంతిపూవులాగుంది.

అతని దృష్టి నావైపు మళ్ళింది. ఈవిడనెట్లా సముదాయించాలని అడుగుతున్నాయతని చూపులు. రెండు ముద్దలు నువ్వే తినిపించమని సైగచేశాను. పచ్చడి అన్నాన్ని ముద్దచేసి ఆవిడనోటికందిస్తూ "అబ్బా! సత్తికొండ చేతి పచ్చడి భేషుగ్గా ఉంది. నీ మాటల లెక్క వంటకాలు కూడా చానా కమ్మగున్నై. అప్పుడెప్పుడో నలభీమపాకాలన్నారుగాని ఇప్పట్నుంచి సత్తికొండ పాకమనాలే" కాకా పడుతూంటే అతని గొంతులో వణుకు ధ్వనించింది.

కళ్లు మిటకరిస్తూ గబగబా ముద్దనమిలి

మింగేసి సిద్దయ్య చేతిని కళ్లకద్దుకుంది. మొహమ్మీద జీవంలేని మెరుపుతో మిగతా భోజనం పూర్తయింది.

గిరిజ- పైడితల్లి ప్రేక్షకుల్లా చూస్తున్నారు.

ఆరు నెలల మజిలీ అవసరం తీరిపోయింది గదా... సత్యనారాయణ సామానులు బయటపెడుతున్నాడు.

"మేమెళ్తున్నామన్నయ్యా" రోహిణి మాముందుకొచ్చి చెప్పింది. "మంచిది చెల్లెమ్మా" అన్నాను. రామారావును దగ్గరకు తీసుకుని చెంపల్ని మృదువుగా స్పర్శించి వదిలేశాను.

"వెళ్తాం గురూగారూ! మూడు నాలుగు గంటల్లో మా ఊళ్లో ఉంటాము. మీరు గోదావరికెళ్తున్నారుగదూ! ఉత్తరాలు రాస్తుంటారుగా" అంటూ సత్యనారాయణ షేక్‌హేండిచ్చాడు. సిద్దయ్యకు గూడా చెప్పేశాడు.

"టాటా మావయ్యలూ" చిన్నారి రామారావు నవ్వాడు.

సత్తికొండతో చెప్పేసి వాళ్లు ముగ్గురూ సామానులతో బయటికెళ్లారు.

సాయంత్రం ఆరింటికి గోదావరి బయలుదేరుతుంది. ఐదింటికల్లా సామానులు సర్దడమైపోయింది. సర్దడంలో సత్తికొండ గూడా సహాయపడింది. గలగలా మాట్లాడింది.

"సత్తికొండా! గిరిజకు కొడుకు పుట్టంగనే మాకో ఉత్తరం రాస్తావా లేక మనవడి మోజులో మమ్మల్ని మరిచి పోతావా? " సిద్దయ్య చలాకీగా అడిగాడు.

అక్కడే ఒకపక్కన కూచున్న గిరిజ బుగ్గలు సిగ్గుల పూబంతులైనాయి. సత్తికొండలో ఉత్సాహం ఉబికొచ్చినట్టుంది.

"చాల్లే బుల్లోడా! ఇంటిదగ్గరుండి నువ్వే మమ్మల్ని మరిచిపోతావేమో! మీరొచ్చి మేనల్లుడి మెడలో బంగారు గొలుసు వెయ్యందే ఆ ముద్దూ ముచ్చటలు పూర్తవుతాయా? " జవాబు ప్రశ్నగా మారింది.

అంతా కలిసి కోరస్‌గా నవ్వాం.

ఆ ఇంటినుండి కాకినాడపోర్టు రైలుస్టేషన్‌కు నడిచివెళ్లాల్సిందే. గోదావరి బోగీలు బయలుదేరేదక్కడినుండే. మాకంటే ముందే ముగ్గురు మిత్రులు లగేజీతో ఆటోల్లో బయలుదేరారు. మా ఐదుగురిని మోసుకెళ్లేది అదే గోదావరి.

మేము సూటుకేసుల్తో గది బయటికొచ్చాం. చెరో సూటుకేసు, చెరో ఎయిర్ బ్యాగు. ఇదీ మా లగేజీ. వంట సామానులు గిరిజకిచ్చేశాం. నా ఎయిర్‌బ్యాగును గిరిజ అందుకుంది. సిద్దయ్య బ్యాగును సత్తికొండ లాక్కుంది.

"ఇవి నా వంతు" అంటూ పైడితల్లి రెండు చేతుల్తో మా సూటుకేసులందుకున్నాడు.

"అయ్యయ్యో! నాకిదేమీ బాగాఅన్పించదు. మా బరువులన్నీ మీరే మోస్తారా? "

"ఫరవాలేదు క్రిష్ణమూర్తీ!" సత్తికొండ సమర్థించింది. "బతుక్కోదారి చూపించి మీరు అతని బరువు మోయలేదా! ఈ మాత్రం బరువా ఏవిటీ? "

"అవునన్నయ్యా! మాకీ తృప్తి ఉండనీయండన్నయ్యా" గిరిజ ప్రాధేయపడింది. ఆ మొహం చంద్రబింబంలాగుంది.

అత్తారింటికి మొదటిసారి వెళ్తున్న కొత్తపెళ్లికూతురులా అడుగులో అడుగేసి నడుస్తున్నాం. ఆర్నెల్లు అజ్ఞాతవాసమనుకుని... హంగామాగా గడిపి వెళ్తున్నాం గదా. మళ్లీ వీళ్లతో కలిసి కులాసాగా కబుర్లు చెప్పుకునే అవకాశం రావచ్చు రాకపోవచ్చు కూడా. కాని సంసార సాగరతరంగాల సరిగమల్లో ఆరునెలల జీవన రాగం మరుపుకు రాకుండా గుండె గూటిలో నిక్షిప్తమై ఉంటే ఏదోవిధంగా కలుసుకుంటాము. కులాసా కబుర్లలో తేలిపోతాము. కానీ... కాలం కౌగిట్లో ఎప్పుడేం జరుగుతుందో చెప్పలేము.

"ఇదేవిటన్నయ్యలూ! మూగదయ్యాల్లా నడుస్తున్నాము... ఇదేమీ బాలేదు సుమా!" పసిపాపలా గారాలు పోయింది గిరిజ. కానీ ఏమి మాట్లాడాలి? సంధి సమయములో ఎంతవరకు మాట్లాడొచ్చు? అంచనా కంద

డంలేదు. నిండుకుండ తొణకదని గూడా అంటారుకదా! అలాగే నిండు గుండె గూడాను.

"కాని ఏదో ఒకటి మాట్లాడాలి. విడిపోయే ముందు చివరి క్షణాలాయె. పైడితల్లి నా పక్కకొచ్చి

"మీకు మరో మూడు నెలల ట్రెయినింగ్ హైదరాబాద్‌లో నటగదా!"

ప్రస్తావించాడు.

"అవును. ఇద్దరమూ హైదరాబాద్‌లోనే ఉంటాం" సిద్దయ్య యథాలాపంగా జవాబి చ్చాడు. "రోజూ సత్తికొండ నా కలలోకొచ్చి గడ్బడ జేస్తుందేమో. భయమైతుంది పైడితల్లీ' ' కావాలనే అన్నట్టుంది.



"ఓహోహో!" ముడుచుకుపోయిందనుకున్న సత్తికొండ మొహం పూవులా విచ్చుకుంది. ఎదలో హుషారు ఊరకలేస్తుందేమో "దిగొ చ్చాడండీ ఇశ్వామిత్రులవారు నేను నీ కలలో



## సీక్రెట్ బ్యాలెట్ అంటే

"శ్రీశ్రీగారూ మీ కమ్యూనిస్ట్ ప్రభుత్వంవస్తే ఎన్నికలను ఎత్తేస్తారా? " ఒకాయన అడిగాడు.

"అబ్బే అలా ఎందుకు చేస్తాం? మేమూ ఎలక్షన్లు నిర్వహిస్తాం. రహస్యపద్ధతిలోనే కాకపోతే సీల్డ్ కవర్ బ్యాలెట్ అన్నారు" శ్రీశ్రీ.

అంటే?

"అంటే ఏముంది.. ప్రతిఓటర్‌కూ ఓ సీల్డ్ కవర్ ఇస్తాం.. వాళ్లు వాటిని తీసుకువెళ్లి బ్యాలెట్ బాక్స్‌లో వేస్తారు."

"మరి అందులో తాము ఎవరికి ఓటేస్తోందీ వారికి తెలియదుగదా? "

తెలియదు.. తెలిస్తే అది సీక్రెట్ బ్యాలెట్ ఎలా అవుతుంది అంటూ చమత్కరించారు శ్రీశ్రీ.

కొత్తాననుకొన్నవేమో! కాని ఇది కలియుగం నాయనా! కలలో కొచ్చి కలవరపెట్టేంత సీన్ లేదులే. నేనో ముసలి పీనుగను. నువ్వో కోర వయసుకు కుర్రోడివి. ఆసికాలిక చాల్లేవయ్యా

అసలు నిజం అమాంతం కక్కేసిందే మిటీ?

"మరైతే ఈ విషయం ఇప్పుడు గుర్తుకొచ్చిందా?

"గుర్తుకు రావాల. వచ్చి తీరాలయ్యా" క్షణంలో సత్తికొండ గొంతు గంభీరంగా మారింది. "మూడు ముళ్లేసిన మొగుడితో ముద్దూ మురిపెం మూడేళ్ల ముచ్చటై పాయె. ఆపై వాడికి కనికరం లేక పాయె. నీ మొకంలల మా ఆయన పోలికలున్నాయి బాబూ. అదేవిటో.. ఎంత ఆపుదామనుకున్నా మనసు ఆగి చావదు. నిజానికి నువు నా కొడుకు లాంటి వాడివే కాని ఏదో దుగ్ధ నోటి దురద. సరదాగా మాట్లాడే మనిషి ముందు ఈ కొద్దిరోజులన్నా మన సారా మాట్లాడాను. దెబ్బలాడాను. హుషారుగా గంతులేశాను. తృప్తిగా నవ్వుకున్నాను. ఇదేం బుద్ధో నాకే అర్థ మవట్లా...

పాపం! అకాల వైధవ్యంతో ఆసాంతం తీరని కోరికలు. మనసులో మారాము చేస్తుంటే ఆరని ఆరాటము చేసే అల్లరి తప్ప... మరేమీ కాదని అందరికీ అర్థమైంది.

"కేవలం అది నా అదృష్టమే సుమా" అంటూ సిద్దయ్య సత్తికొండ పక్కన నడుస్తున్నాడు.

"ఓ నిజం చెప్పనా" అన్నాను సత్తి కొండ వైపు చూస్తూ

"చెప్పవయ్యా క్రిష్ణమూర్తీ!"

"ఇల్లాలిలో కొంత తల్లి తత్వముం టుందని ఇంతకు ముందే తెలుసు గాని, నీలాంటి తల్లిలో ఇసుమంత ఇల్లాలి తత్వం ఇమిడి ఉంటుందని ఇక్కడనే తెలుసుకున్నా"

సత్తికొండ, సిద్దయ్యలు తృప్తిగా నిట్టూర్చారు.

"ఏవిటో అన్నయ్యా! తలా తోకలేని మీ కబుర్లు చాలుగానీ స్టేషనొచ్చింది" అడుగుల వేగం పెంచి గిరిజ ముందుకొచ్చింది. "అదో గోదావరి రైలు బోగీలు గూడా కనబడుతు న్నాయమ్మా" అంది. భర్తనుద్దేశించి, "మీరు ముందు వెళ్లండి బెర్త్ నెంబర్లు చెప్పారు గదా

సుఖదుఃఖాల పైన ఆధిపత్యం సంపాదించిన వ్యక్తే జీవితంలో విజయానికి చేరువవుతాడు. – విశ్వేశ్వరయ్య

ఆ సూటుకేసుల్ని అన్నయ్యల బెర్త్‌ల మీదుం చండి" సాధికారికంగా ఆదేశించింది.

మా బెర్తుల నెంబర్లు ఐదారు రోజుల క్రితంనుండే చెబుతున్నాం కాబట్టి పైడితల్లి అంగలేస్తూ ముందుకెళ్లాడు ముసిముసినవ్వులతో.

కాకినాడు పోర్టు రైలుస్టేషన్ సమ్మక్క సారక్క జాతరలా - కళకళలాడ్తోంది. రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌కు అభిముఖంగా ఇంతమంది వెళ్తుంటారా! అందుకేనేమో హైదరాబాద్ జనాభా అంతుపొంతు లేకుండా పెరిగి పోతోంది. సిటీ విస్తరిస్తోంది.

కాఫీ కుర్రాళ్లు, పల్లీలమ్మే పడతులు, పత్రికలమ్మే పోటీదారులు ఎవరి లోకంలో వారు ఇట్నుంచి అటూ, అట్నుంచి ఇటూ తిరుగుతూనే ఉన్నారు. ఒకరిని ఒరుసుకుంటూ ఒకరు కంపార్ట్‌మెంట్స్‌లో దూరి బెర్త్‌లు, సీట్లు వెతుక్కుంటున్న ప్రయాణీకులు, వీడ్కోలు చెప్పేందుకొచ్చిన బంధుమిత్రులు... ఎవరి హడావుడి వారిది. సూటికేసులను బెర్త్‌ల మీదుంచి పైడితల్లి కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు.

"ఇదిగో... ఇక్కడ అటూ మా దృష్టిని తనవైపు తిప్పుకున్నాడు. అంతా కలిసి కంపార్టుమెంటు లోపలి కెళ్లాం. చంకలున్న ఎయిర్ బ్యాగులు సీట్లమీదికి చేరాయి.

"రైలు బయలుదేరేందుకింకా టైముంది గదా. బయట నిల్చుందామా" అన్నాను. ఆ మాటకోసమే ఎదిరి చూస్తున్నట్టు సత్తికొండ "అయ్ పదండి వెల్దాం" అంది.

"అన్నయ్య లొచ్చేదాకా మీరిక్కడే ఉండండి.' కాటుక కళ్లను చక్రాల్లా తిప్పుతూ భర్తతో చెప్పి మా వెంట బయటికొచ్చింది గిరిజ. జనప్రవాహాన్ని చీల్చుకుంటూ ప్లాటు ఫాంమీదికొచ్చాం. నేనూ, సిద్ధయ్య ఎదురెదురుగా, మా ఇద్దరి మధ్యన గిరిజ, సత్తికొండ ఎదురెదురుగా నుంచున్నాం.

"రేపీపాటికి అన్నయ్యలు వదినల ముందుంటారు" బలవంతపు చిరునవ్వు గిరిజ పెదాలమీదున్నా మొహమ్మీద వెలవెల ఛాయలు. "ఈ చెల్లినీ, అమ్మనూ మరిచిపోరుగదా!"

"గిరిజా..." అవ్యక్తమైన ఆవేదన నాలో చోటు చేసుకుంది. "రక్తం పంచుకుని పుట్టిన అక్కా చెల్లెళ్లు అక్కడున్నారు. ఆత్మీయత పంచుకున్న చెల్లివి ఇక్కడున్నావు. జన్మనిచ్చిన తల్లి అక్కడుంది. ఆరు నెలల్లో ఆరేడు జన్మలకు సరిపడేటంత ఆప్యాయత నందించిన తల్లి సత్తికొండ ఇక్కడుంది. మేమెక్కడున్నా, ఎలాగున్నా మిమ్మల్ని మరిచిపోలేమమ్మా"

అప్పుడే ప్లాటుఫాం నిండా పరుచుకున్న ట్యూబులైట్ల వెలుతురు తన ప్రతాపాన్ని చూపిస్తోంది. సత్తికొండ కళ్లల్లో మంచుతెరలు తళతళలాడుతున్నాయి. పెదాలు వణుకుతున్నాయి. గిరిజ నావైపు సూటిగా చూసింది.

"ఎంత తియ్యగా చెప్పావన్నయ్యా. అసలూ మీ ఇద్దరు నా సొంత అన్నయ్యలుగా ఎందుకు పుట్టించలేదో ఆ దేవుణ్ణి అడగాలి" గొంతు పొంగులు మాటలకడ్డొచ్చాయి.

"బాబూ క్రిష్ణమూర్తీ" బావురుమంటూ సత్తికొండ ముందుకు జరిగి నా ఛాతీమీద ఒరిగిపోయింది. అంతరాళాల నుండి వాత్సల్యం కట్టలు తెంచుకొచ్చిందేమో నా భుజాలు పట్టుకుని తనయుడి పరిష్వంగంలో తల్లిలా వాటేసుకుంది.

"అమ్మా అమ్మా" నా గుండె చప్పుళ్లు బయటికొచ్చేశాయి. ఆమె భుజాలు పట్టుకుని కుదిపాను.

"బాబూ! నేను కొడుకులు లేని దాన్నయ్యా. పుత్రప్రేమ ఎలాగుంటుందో మీరే రుచి చూపారయ్యా" పొగిలి పొగిలి కదిలిపోతోంది. కంటిధారలు నా ఛాతిని తడిపేస్తున్నాయి. "అయ్యా' ఇప్పుడే ఇలాగే పేణాలు పోతే ఎంత బావుండేదో కాని ఈ జన్మ అంతకు నోచుకోలేదయ్యా' గొంతు పూడుకుపోయింది.

ఓహో నా కళ్లు చెమర్చినట్టున్నాయి. అశ్రు బిందువులు చెంపలను ఒరుసుకుంటూ సత్తి కొండ వీపుమీద వాలుతున్నాయి.

సప్త సముద్రాల కవతల అష్టమ సముద్ర మున్నది. మనసున్న ప్రతి మనిషిలో అష్టమ సముద్రం పాయలున్నాయి. దాని ఉనికి గుండెపొంగుల్లోనే కనబడుతుంది. అష్టమ సముద్ర తరంగాలు మా నలుగురి కళ్లల్లో కదలాడుతున్నాయి.

"ఊరుకోమ్మా!" వీపు నిమురుతూ అనగలి గాను. మెల్లగా నన్నొదిలేసి "నాయనా సిద్దులూ" అంటూ సిద్దయ్య మొహాన్ని అరచే తుల్లోకి తీసుకుని గుండెలమధ్య చేర్చుకుంది. 'నిన్నిడిచి ఉండేలేనేమో కాని మొండి జన్మ గందా ఉండి తీరాల, వెక్కివెక్కి ఏడుస్తోంది.

"అమ్మా... సత్తికొండమ్మా!" సిద్దయ్య గుండెలను చీల్చుకుంటూ వచ్చిందా అరుపు. ఆప్యాయతానందాల గుర్తుగా సిద్దయ్య చేతులు సత్తికొండ భుజాల మీదున్నాయి. సిద్దయ్య నరాల్లో ఏవో స్వరాలు. కాని ఆ స్వరఝురిని మాకందరికీ వినిపించేందుకు అతనికి భాష అందడము లేదని... ఆ హావ భావాలే చెబుతున్నాయి.

గిరిజ నా చేతులందుకుని ప్రేమగా కళ్లక ద్దుకుంది. మంచుపూలైన ఆమె కళ్లను చేతిగు డ్డతో అద్దాను. "మనం మళ్లీ కలుసుకుంటాం గిరిజా" అంతరంగ తరంగాలను అదుపు చేసుకుంటున్నాను.

"యావండోయ్" అరుస్తూ పైడితల్లి పరుగె త్తుకొచ్చాడు. "బండి కదలబోతుంది. ఎక్కె య్యండిహ" తొందరపెడుతున్నాడు.

అష్టమ సముద్రం నుండి అసలులోకానికొ చ్చాము. ప్లాటు ఫారమ్మీది జనాలు బోగీలో కూచున్న వాళ్లకు టాటా, బాయ్ బాయ్ చెబు తున్నారు. బోగీలోని ప్రయాణికులు కిటికీ ల్లోంచి చూస్తూ చేతులూపుతూ అలాగే చెబు తున్నారు. అటు సిద్దయ్య చేతిగుడ్డ సత్తికొండ కళ్లు అద్దుతూంటే, సత్తికొండ కొన కొంగు సిద్దయ్య కంటిధారల్ని తుడుస్తోంది.

ఆ బంధాల్లోంచి బలవంతంగా విడి పోయాం. బరువెక్కిన గుండెలతో బోగీలోకెక్కాం.

గోదావరి కూతవేసి ప్లాటుఫారం జనాలకు టాటా చెప్పేసింది. కిటికీలోంచి మేమిద్ద రమూ, బయటినుండి వాళ్లు ముగ్గురూ చేతు లూపుతూనే ఉన్నాం. రైలు కాకినాడ టౌన్ స్టేషన్‌కొచ్చి ఆగింది. ఊపిరి పీల్చుకుని వెంటనే బయలుదేరింది.

మనుషుల మధ్య దూరం కంటికి కానరా నంత దూరం పెరిగిపోతోంది. రైలు వేగం పుంజుకుంది. గుండెపొరల్లో గూడుకట్టుకున్న వ్యక్తులనందులోనే ఉంచేసి వర్తమానం తలు పులు బిగించాలనే ప్రయత్నం తప్పదు గదా. అదే ప్రయత్నంలో ఉన్నాను.

ఇద్దరి బాహ్యదృష్టి కిటికీ ఊచల్లోంచి బయ టికి లంఘించింది. ట్రాకు పక్కన దూరంగా వరుసగా నుంచున్న తరుతరుణుల కొమ్మలు, రెమ్మలు పచ్చజండాలూపుతున్నాయి. ధర్మా త్ముని దానగుణములా పెరిగిన పొడగాటి చెట్లు, కూడబెట్టడమే పరమావధిగా ఎంచు కున్న కుత్సితుని ప్రవృత్తిలా భూమికి జానెడు, మూరెడు ఎత్తులో ముదిరిన చెట్లు కొమ్మల్ని రెమ్మల్ని అనుకున్నంత ఆడించలేక వెనక్కు పరుగెడుతున్నాయి. శుక్లపక్షం కాబోలు ప్రచార పటాటోపం లేని నిష్కల్మష రాజ కీయ నాయకుని కీర్తిలా సన్నని వెన్నెల విద్యుద్దీప కాంతులతో పోటీపడలేకపోతోంది.

"మన ముగ్గురు వీరులు ఏ బోగీలో ఉన్నారో తెలుసా అన్నా!" సిద్దయ్య గుర్తుచే శాడు.

"అవును. ఆనందం, రాజయ్య, కాశీనాథ్‌లు కూడా ఫ్యామిలీస్‌తో ఇదే గోదావరిలో వస్తు న్నారు గదా! వాళ్లు ముగ్గురూ ముందు బోగీల్లో ఉన్నట్టుంది"

అటు మాటల కోటల్ని స్పృశించామో లేదో ఇటు సామర్లకోట స్టేషనొచ్చేసింది. మేమున్న బోగీలు విశాఖ నుండి బయలుదే రొచ్చిన మెయిన్ గోదావరి ట్రెయిన్ కౌగిట్లో

ఒదిగిపోయాయి. భోజనం పాకెట్లు కొనేశాం. గోదావరి రైలు తన పనిలో తానుంది. గోదావరి, రాజమండ్రి స్టేషన్లను పలుకరిస్తూ పట్టాల మీద పరుగులు తీస్తూనే ఉంది. కాకినాడ గతాన్ని, హైద్రాబాదు ఆగతాన్ని, సత్తికొండ స్వభావాన్ని ప్రస్తావిస్తూ మా కబుర్లు సాగిపోతున్నాయి. వాటికితోడు మరెన్నో విషయాలు వచ్చి పోతున్నాయి. సిద్దయ్య విజయవాడలో విడిపోయాడు.

కాకినాడ నుండి తిరిగొచ్చాక కాలచక్రం వేగంగా పరుగెత్తింది. తాను వెనక్కు తిరగకుండా సమస్యల వలయంలోంచి నేను వెనక్కు తిరిగి చూడకుండా చేసింది. కాకపోతే అంతలోనే పాతిక సంవత్సరాలు మించి కాలం ఎలా గడిచిపోతుంది? సత్తికొండ నుండి మొదట చాలా ఉత్తరాలొచ్చాయి. నేనూ రాశాను. గిరిజ కూడా ఉత్తరాలతో పలుకరించింది. కాని కాలం కౌగిట్లో, మతిమరుపు మబ్బుల మాటున చాలా సంఘటనలు జరిగిపోతున్నాయి. పలుకరింతలు, పులకింతలు మరుగున పడిపోతున్నాయి.

బతుకు పురాణంలో భద్రంగా నిక్షిప్తమైన కాకినాడ అధ్యాయం పేజీలను వెనక్కు తిప్పి చూపించిన గిరిజాసుతుడు కృష్ణమూర్తి శుక్రవారం సాయంత్రమే కాకినాడకు బయలుదేరి వెళ్లాడు. రిటైరైన తర్వాత తేదీలను వారాలను గుర్తుంచుకునే అవసరం, అగత్యం తక్కువైపోయింది.

ఈ రోజు వారం కోసం చేతులోని వార్తాపత్రిక మొదటిపేజీ తిప్పాను. సోమవారం. ఈరోజు సోమవారం. సరేలే .ఏదో ఒక వారం. అయినా జీవన సంధ్యాసమయంలో కూడా అన్నీ గుర్తుంచుకుని ఏం సాధించాలనీ! అలా అనుకుంటుంటే అమ్మాయి పెళ్లి సంగతి గుర్తుకొచ్చింది. అమ్మోయ్! శైలజ పెళ్లయి అత్తారింటికెళ్లేదాకా అన్నీ గుర్తుంచుకోవాలి. అయినా ఆ తర్వాత గూడా గుర్తుంచుకుని సమాజ పరమేశ్వరునికి చేతనైన సేవ చేస్తే మంచిదే గదా! ఆత్మతృప్తి గదా!

ఏమిటో ఆరింటికి నిద్రలేవడం, ఏడింటి కల్లా కాలకృత్యాలు తీర్చుకుని పడక్కుర్చీ నాశ్రయించడం, అర్థాంగి రుక్మిణి అందించిన అమృతకలశం చాయ గ్లాసును పెదాలకానించుకుని వేడి చాయను చప్పరిస్తూ రంగుల ప్రపంచం హంగుల్ని మోసుకొచ్చిన పత్రికావిహంగం రెక్కలు విప్పి తాపీగా అవలోకించడం, ఆలోగా ఆవహించిన బద్ధకాన్ని పారదోలుతూ ఒళ్లువిరిచి స్నానానికి లేవడం, పూజాదులు కొద్దిరోజుల్లోనే అలవాటైంది.

"ఏమయ్యోయ్! మీరు కొంచెం బయటి ప్రపంచానికి రావాలె!" రుక్మిణి ఎదురుగా దర్శనమిచ్చింది.

పేపరు చివరిపేజీ చదువలేదు. ఇప్పుడే ఏం ముంచుకొచ్చిందో పడక్కుర్చీకి పూర్తిగా అంటుకుపోయిన నా దేహము చైతన్యం పుంజుకుంది.

"ఎందుకటా? " నిటారుగా కూచుని పేపరు మడిచి టీపాయ్ మీదుంచాను.

అర్థశతాబ్దం దాటిన అనుభవాలను, అరకొర సుఖాలను జీర్ణించుకున్న రుక్మిణి మొహం ముద్దమందారంలాగుంది. నుదుటి మీద తమ ఉనికి తెలుపుకోవాలని ఉబలాటపడుతున్న ముడతల మధ్య అర్థరూపాయి బిళ్లంత కుంకుమ బొట్టు... తెలుపు వైపు మళ్లుతున్న కొన్ని నల్లని వెంట్రుకలు చెంపల మీదాడుకుంటున్నాయి.. నా దృష్టి అక్కడే తచ్చాడుతోంది. నేనో చిత్రకారుడినైతే, ఆ అపురూప దృశ్యాన్ని కాగితమ్మీద చూపించేవాడినే.

"ఏందీ? ఎన్నడూ చూడనట్టు ఆ చూపు లేందీ? " చెంపలమీది ముంగురులను మునివేళ్లతో సవరించుకుంటూ వచ్చి ఎదురు కుర్చీలో కూచుంది.

మనం గతాన్ని మార్చలేము - కానీ భవిష్యత్తుకు సంబంధించిన దిగులు బంగారం లాంటి మన వర్తమానాన్ని పాడుచేస్తుంది. - పార్కర్

"ఆఁ" సర్దుకూచున్నాను. "నువ్వీరోజు కొత్తగా కనబడుతున్నావు రుక్కూ!" నవ్వబోయాను.

"ఆహాఁ!" పెదాలమీద సన్నని చిరునవ్వు అలా మెరిసి ఇలా మాయమైంది. "చాయ దాగి చాలాసేపు కాలేదుగదా! గట్లనే కనబడ్తది. ఎందుకైనా మంచిది ఆ కంటద్దాలు పరీక్ష చేయించుకుంటే బాగుంటుంది"

"కాదు రుక్కూ!" కుర్చీతోసహా ముందుకు జరిగి చెయ్యందుకున్నాను. వెనక్కు లాగేసుకుంది.

"చాల్లేవయ్యా సంబడం" సీరియస్‌గా మారింది. లేచినుంచుంది. "రోజూ నాకు వంటింట్ల సాయం చేసే మీ గారాల కూతురు శైలజ ఈరోజు మొకం ముడుచుకుని కూచుంది ఎందుకూ? " నిలదీసింది. నేనేమన్నా మందలించానేమోనని ఆవిడ అనుమానం.

"ఏమో! నాకేం తెల్సూ!" నేనూ గంభీరంగా మారాను.

"పదండి. వెళ్లి అడుగుదాం"

ఒక్క క్షణంలో ఇద్దరం శైలజ గదిలో ఉన్నాం. అప్పటికే అక్కడ నా కోడలుంది.

"ఏందమ్మా శైలా, గట్లా కూచున్నవేందీ? " అడిగాను అనునయంగా. శైలజ బెదురుచూపులు కోడలువైపు మళ్లాయి.

"నేనూ అదే అడిగిన మావయ్యా!"

"ఏమంటుందమ్మా? "

"కాకినాడ కృష్ణమూర్తి వెళ్లి మూడ్రోజులాయె. ఇంకా రాలేదెందుకో? " అని అడగడంలో కోడలు అంతరార్థమేమిటో అర్థమయి కానట్టుంది.

ఎప్పుడూ అరవిరిసిన కళకళలాడే శైలజ కళ్లు కాంతిహీనంగా గోచరిస్తున్నాయి. మంచమ్మీద కూచున్నదల్లా కాళ్లు నేలకు వేళ్లాడి దీసి, మలచిన అరచేతిలో కుడిమోచెయ్యి ఉంచి, కుడిమోచేతిని గదవకానించి విచారంగా కూచుంది.

"అతని కోసం నీకెందుకే ఎదిరిచూపులు? " ఆశ్చర్యంగా అడుగుతూ గదవబట్టి పైకి లేపింది తల్లి. కళ్లల్లో మెరుపు లేదు. బుంగమూతి వింతగా ఉంది.

"అదికాదమ్మా కాకినాడ చాలా దూరం గదా. పైగా రైలు ప్రయాణమాయె. ఈ రోజుల్లో రైలు ప్రమాదాలు మామూలైపోయినై గదా". కొనకొంగును ఎడమబొటనవేలికి చుడుతోంది.

"అయితే!" కనుబొమలు పీటముడేసుకున్నై.

"ఎక్కడో ఒకచోట రైలు ప్రమాదాలు మామూలే" ఎప్పుడొచ్చాడో నా సుపుత్రుడు అర్జున్ అంతా వింటున్నట్టు అన్నాడు.

"అయితే? " నా భార్య మళ్లీ నోరు దెరిచింది.

"అబ్బా! ఏందే శైలూ!" చెల్లిముందుకొచ్చాడు అర్జున్. "లే... మొహం కడుక్కో!"

శైలజ కదలలేదు. బేలచూపులు వదినవైపు మళ్లాయి. వదిన అంటే శైలజకెంతో ప్రేమ.

"సంగతేమిటో నువ్వైనా కనుక్కోవమ్మా!" కోడలిని పురమాయించాను. కోడలి మొహం గమ్మత్తుగా విచ్చుకుంది.

"ఐతే నా అనుమానం నిజమేనా మరదలా? " అని చెవిలో ఏదో అడిగింది.

"ఫో వదినా!" శైలజ మొహం చమక్కుమంది. బుగ్గలమీంచి జారిపోతున్న సిగ్గులు తళుక్కుమన్నాయి. గబుక్కున లేచి బయటికి తుర్రుమంది.

"ఇదేం విచిత్రమే తల్లీ!" నా భార్య బుగ్గలు నొక్కుకుంది. మేమిద్దరం విస్తుబోయి మొహాలు చూసుకున్నాం. మొహాలు వేలాడేసుకుని కోడలి వెంట బయటికొచ్చాం.

"అన్నయ్యా!" ఆత్మీయమైన పిలుపు చెవులకింపుగా వినబడింది. ఆ పిలుపు త్రివేణి సంగమ ప్రవాహం సవ్వడిని మరిపించింది. నా జీవన పార్శ్వంలో సుందర స్వప్నములా గడిచిన రోజులలో గుండెలమీద చెరగని

ముద్రవేసిన గిరిజ ప్రత్యక్షమైంది. ముఖార విందం మాణిక్యంలా వెలిగిపోతోంది. చిరునవ్వుతో ముందుకొస్తూ "అయ్య బాబోయ్! చాలా మారిపోయావన్నయ్యా. ఆరోగ్యం బాగుందా? " ముందుకొచ్చి చేతులు జోడించింది.

గిరిజ అదే గిరిజాల జుట్టుతో సంధ్యాస మయాన చందమామ లేని నిర్మలాకాశంలా గుంది. వయోభారం బలవంతంగా రుద్దిన మార్పులతో కాస్త ఒళ్లు చేసినట్టుంది. ఆవిడ బొట్టు తుడిచేసిన పైవాడి మీద కోపమొచ్చింది.

"అమ్మా... గిరిజా!" ఆనంద సంద్రం కెరటాలు నా నరాలనిండా పొంగుకొచ్చాయి. "బాగున్నానమ్మా" గొంతులో ఊహించిన తడబాటు "ఇన్నాళ్లకు ...మ్మ...మళ్లీ... చాలా సంతోషం చెల్లెమ్మా" ఉత్తేజంతో చేతులందుకుని నుదురుకద్దుకున్నాను.

"మా అబ్బాయి కిక్కడే ఉద్యోగం. మనమిలా కలుసుకోవడం నా అ... అదృష్టమన్నయ్యా". చెమ్మగిల్లిన కళ్లల్లోంచి అశ్రుబిందువులు కపోలాలను స్పర్శిస్తూ నేలమీద రాలి మెరుస్తున్నాయి.

గిరిజ గురించి ఎన్నోసార్లు ఎంతో చెప్పాను కాబట్టి రుక్మిణి వెంటనే గ్రహించింది.

"అట్లెందుకనుకోవాలి. గిరిజమ్మా! నేను మీ వదినను". అంటూ గిరిజను ఒళ్లోకి లాక్కుంది రుక్మిణి". మీ అన్నయ్య నీ గురించి ఎప్పుడూ ఏదో చెప్తూనే ఉంటారు. ఆయనకు సొంత చెల్లెలిలాంటి దానివని మరీమరీ చెప్తారనుకో... ఆс... ఆ సిద్దయ్య తమ్ముడిలాంటి వాడటా".

"వదినా!" రుక్మిణి గాఢపరిష్వంగములో ఒదిగిపోయింది. "నీ గురించి మా అన్నయ్య ఏమీ చెప్పలేదు. గాని ఇప్పుడు కళ్లారా చూస్తున్నాను. లక్ష్మీదేవిలాగున్నావు వదినా!" కళ్లు జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి.

నా కొడుకునూ, కోడల్ని, మనవడిని పరిచయం చెయ్యాలి గదా!

"శైలూ!" నాలుగువైపులా దృష్టి సారించాను. ఏదీ... ఎక్కడా?

"కృష్ణా!" గిరిజ తన కొడుకును పిలిచింది. "ఏడీ... ఎక్కడా? వీడెక్కడా? " అటూఇటూ చూస్తోంది.

"ఆమె నా కోడలు... అదిగో మనవడు. వాడు అర్జున్. నా కొడుకును పరిచయం చేశాను. అంతా నమస్కారాలు చేసుకున్నారు.

"మీ మురిపాల కొడుకు, మా ముద్దుల మరదలు తోడుదొంగలు. ఇక్కడెందుకుంటారు పిన్నీ..." నా కోడలు ముసిముసి నవ్వులు.

"అంటే... పైన మా గదిలో కెళ్లాడా మావాడు? " గిరిజ సందిగ్ధంగా అడిగింది. పైన గది ఇచ్చామని అక్కడే ఆమెకు చెప్పుంటాడు కొడుకు.

"మరీ శైలజ ఏదమ్మా" నా భార్య అడిగింది కోడల్ని.

"అమ్మోయ్! మీ కూతురు సామాన్యురాలా అత్తయ్యా? "

"అదేమిటమ్మా? "

"అదంతేనత్తయ్యా. వాళ్లిద్దరూ తోడుదొంగలని చెప్పానా! ఈ ఊరి తుంగబుర్ర, ఆ ఊరి నంగనాచి... పైన ఊసులాడుకుంటున్నారో, దోబూచులాడుకుంటున్నారో. నాకేం దెల్సు!"

"ఆహాс... అదా సంగతీ!" నా కొడుకు నోరెళ్లబెట్టాడు.

"మా అబ్బాయి తన మనసులోని మాట నాతో చెప్పాడన్నయ్యా" గిరిజ నా మొహంలోకి చూసింది.

"ఐతే మా శైలజ అదృష్టవంతురాలే" రుక్మిణి సంతోషంగా అనేసింది.

ఇంటినిండా నవ్వుల పువ్వుల వాన కురిసింది.

○

చతుర ఫీచర్

# చరిత్రకు మౌనసాక్ష్యాలు.. క్రైస్తవ ఆరాధన కేంద్రాలు

క్రిస్మస్ అనగానే శాంతిదూత.. ఏసుక్రీస్తు ఆయనతోపాటు చర్చిలో జరిగే ప్రార్థనలు మదిలో మెదులుతాయి. మనదేశంలోని చాలా చర్చ్‌లు.. కేవలం ప్రార్థనా మందిరాలుగానేకాక అలనాటి అద్భుత వాస్తు నిర్మాణశైలికి, గడచిన చరిత్రకు ఆనవాళ్లుగా నిలబడుతున్నాయి. ఆంధ్రుల రాజధాని హైదరాబాద్‌నే తీసుకుంటే అలనాటి స్మృతులకు సాక్ష్యాలుగా ఎన్నెన్నో చారిత్రాత్మక చర్చ్‌లు కన్పిస్తాయి.. వాటిలో కొన్నింటి విశేషాలు తెలుసుకుందాం..


సెయింట్ మెథడిస్ట్ చర్చి

హైదరాబాద్ ఒక చారిత్రక నగరం.. ఇక్కడి ఏ ఇటుకనడిగినా ఎన్నో ముచ్చట్లు చెబుతుంది. అలాగే ఇక్కడి క్రైస్తవ ప్రార్థనా మందిరాలకూ ఎంతో చరిత్ర ఉంది. రాజభవనాలను తలపించేలా నిర్మించిన ఈ చర్చ్‌లు సందర్శకులను విశేషంగా ఆకట్టుకుంటాయి. కేవలం ఆరాధనలకే కాక విద్యాపరంగా, సామాజికసేవా కార్యక్రమాల పరంగా ఇవి నిర్వహించిన పాత్ర.. ఇప్పటికీ నిర్వహిస్తున్న పాత్ర అవిస్మరణీయం. వీటిలో కొన్ని 'హెరిటేజ్' భవనాలుగా కూడా గుర్తింపుపొందడం విశేషం..

మిషనరీల ఆరాధనల కోసం వెలసిన కేంద్రం...

## సెయింట్ మెథడిస్ట్ చర్చి

సుమారు నూటపాతికేళ్ల క్రితం..

నిజాం ప్రభువులు అప్రతిహతంగా ఏలుబడి సాగిస్తున్న రోజులవి..

ఆ రోజుల్లో సామాజికసేవా కార్యక్రమాలే లక్ష్యంగా పెట్టుకుని విదేశాల నుంచి మిషనరీలు అధిక సంఖ్యలో నగరానికి వచ్చేవారు. ఆబిడ్స్, చాపెల్‌రోడ్డు, పబ్లిక్ గార్డెన్స్, గన్‌ఫౌండ్రి తదితర ప్రాంతాలలో వీరు తమ నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. ఆధ్యాత్మికతకు పెద్ద పీట వేసే ఈ క్రైస్తవులంతా తమకు ప్రత్యేక ప్రార్థనా మందిరాలు లేకపోవడంతో పలు ఇబ్బందులను ఎదుర్కొనేవారు. తాము ఎదుర్కొంటున్న ఇబ్బందులను మిషనరీలు నిజాం నవాబుకు తెలియచేయడంతో ఆయన ఉదారంగా చర్చ్ నిర్మాణానికి విశాలమైన స్థలం

కేటాయించారు. అలా 1887లో ఆబిడ్స్ చాపెల్ రోడ్డులో మెథడిస్ట్ చర్చి నిర్మాణం మొదలై పూర్తిచేసుకుంది.

## బ్రిటిష్ వాస్తుశిల్పం

రాజభవనాన్ని తలపించేలా నిర్మించిన ఈ చర్చ్ అచ్చంగా బ్రిటిష్ కట్టడాలను పోలి ఉంటుంది. చర్చ్‌లోని ఇటాలియన్ గ్లాసులు, టవర్ల అందచందాలు, పనితనం చూపరులను విశేషంగా ఆకట్టుకుంటాయి. క్రమక్రమంగా చర్చ్‌కి ప్రార్థనలకోసం వచ్చే భక్తుల సంఖ్య పెరగడంతో స్థలం సరిపోలేదు. దీంతో స్వాతంత్ర్యం అనంతరం 1959లో పురాతన చర్చిని ఆనుకుని మరో ఆరాధనకేంద్రాన్ని నిర్మించారు. ఇదీ బ్రిటిష్ వాస్తుశైలినే పోలి ఉండటం గమనార్హం. ఇందులోనూ ఎన్నెన్నో ప్రత్యేకతలు.. ఈ చర్చ్ కేంద్రంగా స్టాన్లీ, మెథడిస్టు విద్యాలయాలు ఏర్పాటుచేశారు. కె.జి. నుంచి పి.జి. తరగతులతోపాటు కంప్యూటర్ కోర్సులలో శిక్షణ కూడ నిర్వహిస్తున్నారు. ఈ ఆరాధన కేంద్రం ఆధ్వర్యంలో పలు సేవాకార్యక్రమాలు కూడా చేపడుతున్నారు. చిన్నారులు, యువతీ యువకులు, మహిళలు, వృద్ధులు, మేధావుల కోసం వారం రోజులపాటు ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఈ చర్చ్‌కి ప్రతి క్రిస్మస్ రోజు మంత్రులు, పార్లమెంటు సభ్యులు, ఎమ్మెల్యేలు, ఐ.పి.ఎస్., ఐ.ఎ.ఎస్., అధికారులు ప్రత్యేక ప్రార్థనలలో పాల్గొంటుంటారు. ఈ భవనం 'హెరిటేజ్ బిల్డింగ్'గా గుర్తింపు పొందింది.

ఈస్టిండియా ఉద్యోగుల కోసం ఆవిర్భవించిన చర్చి..

## సెయింట్ జోసెఫ్‌చర్చ్

గోల్కొండ నవాబుల పాలనా కాలమది.. అప్పటికే ఈస్టిండియా కంపెనీకి చెందిన కార్యాలయాలు కొన్ని నగరంలో ఉండేవి. వాటిలో ఉద్యోగంచేసే సిబ్బంది దాదాపు ఆంగ్లేయులే. ఇంగ్లండ్ నుంచి నగరానికి వచ్చిన వీరంతా కింగ్‌కోఠి, గన్‌ఫౌండ్రి, బొగ్గులకుంట, రాంకోఠి తదితర ప్రాంతాలలో నివసిస్తుండేవారు. వీరంతా కలిసి తాము ప్రార్థనలు చేసుకోవడానికి ఓ ఆరాధనాకేంద్రాన్ని ఏర్పాటు చేసుకోవాలనుకున్నారు. ఈ మేరకు 1850లో సమావేశమై ఓ తీర్మానం చేసుకున్నారు. తమ కంపెనీ ఉద్యోగుల నుంచే విరాళాలు పోగుచేసి చర్చ్ నిర్మించుకోవాలని నిర్ణయించుకున్నారు. కానీ ఆ తర్వాత ఇరవయ్యేళ్లకుగానీ సెయింట్ జోసెఫ్ కాథడ్రల్ చర్చి నిర్మాణానికి (1870 మార్చి 18న) పునాది రాయిపడలేదు. అయినా మళ్లీ అవాంతరాలు.. తిరిగి 1875 డిసెంబరు 25న పనులను ప్రారంభించారు. సుమారు ఆరేళ్లపాటు కొనసాగిన ఆపనులు 1891లో పూర్తయ్యాయి. నిర్మాణంలో అత్యధిక జాప్యం జరిగినా అత్యద్భుతమైన కట్టడం తయారైంది. సందర్శకులను మంత్రముగ్ధులను చేసే రీతిలో కళాత్మక దృష్టితో దీన్ని నిర్మించారు. బ్రిటిష్ కోటను తలపించే రీతిలో కన్పించే ఈ ప్రార్థనా మందిరం ఇప్పటికీ సందర్శకులను విశేషంగా ఆకర్షిస్తోంది. అప్పట్లో ఈ చర్చ్ తెలంగాణలోని పలుజిల్లాలకు ప్రధాన ఆధ్యాత్మిక కేంద్రంగా విరాజిల్లేది. దీనికి అనుబంధంగా జంటనగరాలతోపాటు వికారాబాదు, మహబూబ్‌నగర్, తిరుమలగిరి, నల్గొండ ప్రాంతాలలో మరిన్ని చర్చ్‌లు, విద్యాలయాలు



వెస్లీచర్చ్

కూడ ప్రారంభమయ్యాయి. ఈ చర్చ్‌పట్ల నిజాం నవాబులు కూడా ఎక్కువ మక్కువ చూపేవారని స్థానికుల కథనం. ఏటా క్రిస్మస్ నాడు వారు చర్చ్‌కి వచ్చి ప్రత్యేక ప్రార్థనలు చేసేవారని వారంటారు. చర్చ్‌లో కనిపించే గోడ గడియారం, మేరీమాత పెయింటింగ్, దీపాల గుత్తులు నిజాంరాజులు బహూకరించినవేనని కొందరు అంటున్నారు. ఈ కట్టడాన్ని వీక్షించడానికి నేటికీ వివిధ ప్రాంతాల నుంచి భక్తులు, సందర్శకులు తరలివస్తుంటారు.

సైనికుల కోసం వెలిసిన ఆరాధన కేంద్రాలే...

### సెయింట్ జార్జి, వెస్లీ చర్చ్‌లు

ఆబిడ్స్‌లో సెయింట్ జార్జి చర్చ్ నిర్మాణాన్ని 1865లో ప్రారంభించి 1867 నాటికి పూర్తిచేశారు. కింగ్‌కోఠి, గన్‌ఫౌండ్రి, రాంకోఠి తదితర ప్రాంతాలలో రాజభవనాలు, ఉన్నతాధికారుల నివాసగృహాలు ఉండేవి. మిలిటరీ అధికారుల నివాసాలూ అక్కడే ఉండేవి. ఆరోజుల్లో బ్రిటిష్ అధికారుల గృహాలలో సేవకులుగా పనిచేసేందుకు కూడా ఇంగ్లాండ్ నుంచి సైనికులను రప్పించేవారు. వీరంతా అదే ప్రాంతాలలో ఉండేవారు. వీరిలో అత్యధికులు క్రైస్తవులు కావడంతో వారికోసం దీన్ని నిర్మించారు. బ్రిటిష్ దేశాలలో ఉండే 'ఆంగ్లికన్ చర్చ్' మాదిరిగా దీన్ని రూపుదిద్దారు. నిర్మాణం పూర్తిచేసుకుని నిర్మించి 130 ఏళ్లు గడిచినా ఈ కట్టడం ఇప్పటికీ చెక్కు చెదరలేదు. కేవలం ఆరాధనలకే కాకుండా విద్యాసేవలందించడానికి కూడా ఇది ఎంతో కృషి చేసింది. నగరంలో ప్రఖ్యాతిగాంచిన గ్రామర్ స్కూల్ దీని ఆధ్వర్యంలోనే నడుస్తోంది. ఈ స్కూల్‌లో చదువుకున్న వారిలో ఎందరో అత్యున్నత స్థానాలను పొందారు. బ్రిటిష్ సైనికుల కోసం రాంకోఠిలో మరో చర్చ్ వెలిసింది. అదే వెస్లీచర్చ్. గన్‌ఫౌండ్రిలో నివసించే క్రిస్టియన్ల సౌలభ్యం కోసం దీన్ని అప్పట్లో నిర్మించారని చెబుతున్నారు. 1972లో నూతన భవనాన్ని సమకూర్చుకున్న ఈ చర్చ్ ఆధ్వర్యంలో 20కి పైగా విద్యాసంస్థలు పని చేస్తున్నాయి.



సెయింట్ జార్జి చర్చ్

### మెదక్ డయాసిస్‌కు అనుబంధంగా...

దక్షిణాది రాష్ట్రాలకు చెందిన క్రైస్తవ మతపరమైన కార్యకలాపాలకు చర్చ్ ఆఫ్ సౌత్ ఇండియా, మెదక్ డయాసిస్ కేంద్ర బిందువు. దానికి అనుబంధంగా సికింద్రాబాదు క్లాక్‌టవర్ వద్ద వెలిసిన వెస్లీ చర్చ్‌కూడా ఖండాంతర ఖ్యాతిని ఆర్జించింది. సి.ఎస్.ఐ.కు అనుబంధంగా సువిశాలమైన ప్రాంగణంలో దీన్ని నిర్మించారు. ఓ చిన్న ప్రార్థనా మందిరంగా ఏర్పాటైన ఈ చర్చ్ 1845లో సుప్రసిద్ధ క్రైస్తవ మతప్రచారకుడు విలియం బర్గీస్ ప్రత్యేక చొరవతో రూపుదిద్దుకుంది. ప్రాచీన భారతీయ, బ్రిటన్ శిల్పకళా నైపుణ్యాన్ని సంతరించుకున్న ఈ చర్చి

ప్రాంగణం విశేషంగా ఆకట్టుకుంటుంది. మేరీమాత ఒడిలో వెలిగే బాలఏసు ప్రతిమ.. చర్చ్ ప్రాంగణంలోని భారీ అద్దాలకిటికీ అప్పటి వాస్తుశిల్ప నైపుణ్యానికి తార్కాణాలని చెప్పకతప్పదు. క్రైస్తవ ప్రముఖులు ఎందరో ఈ చర్చ్‌ని సందర్శించారు.



సెయింట్ జోసెఫ్ చర్చ్

### ప్రత్యేకతల ఆటపట్టు సెయింట్ మేరీస్ చర్చ్

హైదరాబాద్ ఆర్చి డయాసిస్‌కు అనుబంధంగా కొనసాగుతున్న సికింద్రాబాదులోని సెయింట్ మేరీస్ చర్చికి నగర చరిత్రతో సుదీర్ఘ అనుబంధముంది. 1840వ సంవత్సరానికి ముందు నగర శివారు ప్రాంతాలలో విడిదిచేసిన బ్రిటీష పాలకుల ప్రతినిధులు, వైస్రాయి వంటి అత్యున్నత హోదాల్లోని ప్రముఖులు, బ్రిటీష రాణి ప్రతినిధులు తమ పరివారం ప్రార్థనలు చేసుకోవడానికి ఓ చర్చ్‌ని నిర్మించాలనుకున్నారు. వారి సంకల్పం సెయింట్ మేరీస్‌చర్చ్ నిర్మాణంతో 1847 నాటికి సాకారమైంది. సువిశాలమైన పరిసరాల్లో అత్యద్భుతమైన 'గోతిక్ కల్చర్'ను ప్రతిబింబించే శిల్పకళా నైపుణ్యంతో దీనిని నిర్మించారు. నగరంలోని వివిధ ప్రాంతాల వారికి సైతం దూరం నుంచే దర్శనం లభించే రీతిలో నిర్మించిన 'క్రూసిఫికేషన్ టవర్' సెయింట్ మేరీస్ చర్చ్‌లో ప్రత్యేక ఆకర్షణ. ఏసుక్రీస్తు జననం మొదలుకుని శిలువకు బలిదానమైన ఉదంతం వరకూ అన్ని ఇతివృత్తాలను ప్రజల కళ్లకు కట్టేలా స్థూపాలపై చెక్కడం ఇక్కడి మరో ఆకర్షణ.

### బాప్టిజం వ్యాప్తికి కేంద్ర బిందువుగా...

హైదరాబాద్ నగరం నిజాం సంస్థానంలో భాగం. అంతా ఇస్లాం సంప్రదాయం.. ఆ రోజుల్లో బాప్టిజానికి నగరంలో అంకురార్పణ చేసేందుకు 1875వ సంవత్సరానికి ముందు బోస్టన్ నుంచి రెవరెండ్ క్యాంప్‌బెల్ వచ్చారు. అమెరికాకు చెందిన ఫారెన్ మిషన్ బోర్డు ద్వారా లభించిన సహకారంతో బాప్టిస్ట్ చర్చ్‌ను నిర్మించారు. ఈ చర్చ్ నిర్మాణంలో బ్రిటన్, అమెరికా శిల్పకళా నైపుణ్యం ద్యోతకమౌతుంది.

### బొల్లారం హోలీ ట్రినిటీ చర్చ్

బొల్లారంలోని హోలీ ట్రినిటీ చర్చ్ 1846లో నిర్మితమైంది. విక్టోరియా మహారాణి తన సొంత నిధులతో దీనిని నిర్మించింది. అలనాటి నిజాం ప్రభుత్వంలోని బ్రిటిష్ రెసిడెంట్ జనరల్ ఫ్రేజర్ దీనికి భూవసతి సమకూర్చాడు. రెండో ఎలిజబెత్ మహారాణి,



బాప్టిస్ట్ చర్చ్

ఆమె భర్త కూడా వచ్చి దీన్ని సందర్శించారు.

## హెరిటేజ్ ప్రాంగణంగా గుర్తింపు...

నగరంలోని హెరిటేజి ప్రాంగణాల్లో ఒకటిగా గుర్తింపు పొందిన తిరుమలగిరిలోని ఆల్ సెయింట్స్ చర్చి 1850లోనే నిర్మాణమైంది. చెన్నైకు చెందిన బిషప్ రెవరెండ్ ఫ్రెడ్రిక్‌గిల్ ఆధ్వర్యంలో దీని నిర్మాణం జరిగింది. ఇందులో ఆద్యంతం 'గోథిక్' ఆర్కిటెక్చర్ కళ్లకు కడుతుంది. సికింద్రాబాదులోని ఎస్.పి.జి. చర్చ్ మిలీనియం మెథడిస్ట్ చర్చ్ హోలిఫెయిత్ చర్చ్ వంటివి సైతం శతాబ్దాల చరిత్రతతో అనుబంధాన్ని ఏర్పరచుకుని తమ ఉనికిని పదిలం చేసుకున్నాయి.

## బాక్స్ ఐటెమ్

కరవునుంచి పుట్టిన మెదక్ కాథడ్రెల్ చర్చ్

దేశంలోనే పెద్దదిగా, ఆసియాలో రెండో పెద్ద చర్చ్‌గా పేరెన్నికగన్న మెదక్ కాథడ్రెల్ చర్చ్ సుమారు ఎనిమిది దశాబ్దాల క్రితం మొదటి ప్రపంచ యుద్ధకాలంలో నిర్మితమైంది. తీవ్రకరవు, దుర్భిక్షం నెలకొన్న ఆ కాలంలో మెదక్ పరిసరాలలోని ప్రజలు.. ముఖ్యంగా పేదలు ఆకలికి నకనకలాడిపోయారు. వారంతా ఆ సమయంలో మెదక్ రెవరెండ్ ఉన్న చార్లెస్ వాకర్ ప్రాస్నెట్‌ను ఆశ్రయించారు. దేవుడి దయకోసం మనం చర్చ్‌ని నిర్మిద్దాం.. మన సమస్యలన్నీ పరిష్కారం అవుతాయని ఆయన చెప్పడంతో అంతా సరేనన్నారు. సాధారణ రైతులెందరో శ్రమదానం చేసి చర్చ్ నిర్మాణానికి ఉపక్రమించారు. అలా 1914లో ప్రారంభమైన చర్చ్ నిర్మాణం దాదాపు పదేళ్లపాటు కొనసాగి 1924లో పూర్తయింది. 175 అడుగుల ఎత్తున చర్చ్‌గంట ఏర్పాటుచేయడం కోసం నిర్మించిన టవర్ చూపరులను ఇప్పటికీ కట్టిపడేస్తుంది. గోథిక్ శైలిలో గ్రానైట్‌రాళ్లతో నిర్మితమైన ఈ చర్చ్ అద్భుతమైన అద్దాలు. కిటికీలతో ఇప్పటికీ అలరారుతోంది. క్రీస్తుజన్మ వృత్తాంతానికి సంబంధించి చిత్రించిన రంగురంగుల బొమ్మలు సైతం సందర్శకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

– దేశపాకస్వామి, లింగాల విజయకుమార్

ఫొటోలు: కుమారస్వామి, జయకృష్ణ

✦

# మినీ కథలు

## టిక్కెట్ ప్లీజ్!!!

రైలు కదిలింది!!!

సుందరం మాష్టారి గుండె బితుకుబితుకుమంటోంది.

ఖర్చుల భారాన్ని భరించలేక, జేబు ఖాళీ అయ్యి, మొదటిసారిగా... తన జీవితంలో టికెట్ కొనకుండా రైల్లో ప్రయాణిస్తున్నందుకు ఆయన ఆవేదన పడుతున్నాడు.

"టిక్కెట్ ప్లీజ్!" ఒక్కో ప్రయాణీకుడిని చాలా సౌమ్యంగా అడుగుతున్నాడు టి.సి.

'ఇతను సాత్వికుడిలాగున్నాడే! నన్ను క్షమించి వదిలేయొచ్చు!' అనుకుని మనసులోనే ఆనందించారు మాష్టారు. ఆయన ఆనందం అరక్షణం కూడా నిలువలేదు.

"రా..స్కెల్! టికెట్ తీస్కోకుండా రైలెక్కావా!! ఇది నీ అబ్బ సొమ్మనుకుంటున్నావా! వందరూపాయలు తియ్యి." కరకుగా మారింది టి.సి. కంఠం, ఓ ప్రయాణీకుడిని ఉద్దేశించి.

సుందరం మాష్టారి శరీరంలో నెమ్మదిగా వణుకు ప్రారంభమైంది.

"సా...ర్! సా...ర్!! ఈ యాభై తీస్కుని నన్నొదిలెయ్యండి" అర్థించాడు ప్రయాణీకుడు.

"కుదరదు. నువ్వెళ్తున్న దూరానికి కనీసం వంద రూపాయలు చలాన్ రాయాల్సుంటుంది. యాభై రాస్తే... నేను తిట్లు తినాల్సుంటుంది. వంద రూపాయలు తియ్యి" గొంతులో కరుకుదనం ఏమాత్రం తగ్గకుండా అడిగాడు టి.సి.



"సా...ర్! ఇవి... చలాన్ రాయడానికి కాదు. మీరు తీసుకుని... జేబులో వేస్కొని నన్నొదిలెయ్యండి" అర్థించాడతను.

"దొంగ రాస్కెల్...!! నాకు లంచం ఇస్తావ్‌రా...!! నీలాంటి వాళ్ళేరా ప్రభుత్వ ఉద్యోగులకు లంచం రుచి చూపించి, వాళ్ళను అవినీతి పరులుగా మారుస్తున్నారు. నోర్మూసుకుని వంద తియ్యి. లేకపోతే... బొక్కలో

తొయ్యిస్తాను" కసిరాడు టి.సి. నిజాయితీగా.

ప్రయాణీకుడు మారు మాట్లాడకుండా పచ్చనోటు తీసి టి.సి. చేతికిచ్చాడు. టి.సి. చలాన్‌పుస్తకంలో రాసి, ప్రయాణీకునితో సంతకం చేయించుకుని రసీదు అతనికిచ్చి ముందుకు నడిచాడు.

సుందరం తలలో నుంచి చెమట ధారా పాతంగా కారుతోంది. టి.సి. సుందరం దగ్గరకి వచ్చాడు.

'ఛ! ఇప్పుడే రైలు పట్టాలు తప్పి... నేనొక్కడినీ చచ్చిపోతే బావుండును' తర్కించకుండానే మనసులో రోదించారు మాష్టారు.

టి.సి. మాష్టార్ని టికెట్ అడగలేదు!!

"సా...ర్!! మీరా...!!" అంటూ టి.సి. క్రిందికి వంగి మాష్టారి పాదాలకు నమస్కరించాడు.

సుందరం మాష్టారు అతనివైపు విచిత్రంగా చూశారు. "ఏంట్సార్... అలా చూస్తున్నారు. నేన్సార్... సతీష్‌కుమార్‌ను. 1990... పదవ తరగతి బ్యాచ్!!" చెప్పాడు టి.సి.

"స... స... సతీష్!! నువ్వా... మీరూ... సార్..." మేష్టారి మాటలు తడబడ్డాయి.

"అదేంటి మాష్టారూ...!! మీరు నన్ను బహువచనంతో పిలుస్తున్నారు" అన్నాడు టి.సి. చిరునవ్వు నవ్వుతూ.

ఒక విద్యార్థి సులభంగా తన మాష్టార్ని గుర్తుపడతాడు. కానీ... ఒక విద్యార్థిని మాష్టారు గుర్తించడం అంత సులభం కాదు.

"మాష్టారూ!! మీరింకా నన్ను గుర్తించలేదనుకుంటాను. ఎనిమిదవ తరగతిలో ఉన్నప్పుడు... నేను అల్లరిచిల్లరగా తిరిగేవాణ్ణి! అబద్ధాలు చెప్పేవాడిని!! తోటిపిల్లల వద్ద పెన్నులూ, డబ్బులూ దొంగిలించేవాడిని. అలా చేయొద్దని నన్ను చాలా మంది మాష్టర్లు... బడితె పుచ్చుకుని బాదినప్పటికీ... నేను మానలేదు. కానీ... మీరు చెప్పిన మన జాతీయ నాయకుల కథలూ... చరిత్ర పురుషుల గాథలూ... నన్ను మార్చేశాయి. నైతిక విలువల గురించి మీరు చెప్పిన మాటలు... ఇంకా నా చెవిలో మోగుతూనే ఉన్నాయి." ఆనందంగా చెప్పాడు టి.సి.మేష్టారి మొహంలో చిరునవ్వు కదలాడింది.

"నువ్వు తొమ్మిదో తరగతిలో ఉన్నప్పుడు... నీకు రాష్ట్ర స్థాయి వ్యాసరచన పోటీలలో ప్రథమ బహుమతి వచ్చింది కదూ!!" అన్నాడు మేష్టారు.

"హమ్మయ్య! ఇప్పటికైనా గుర్తించారన్నమాట. అప్పుడు వ్యాసరచనకై ఇచ్చిన అంశం 'న్యాయపరిరక్షణ'!! మీరు... నన్ను ప్రోత్సహించి, ముఖ్యమైన పాయింట్లు నాకు చెప్పి... నన్ను పోటీలలో పాల్గొనేట్లు చేశారు. మీ మాట కాదనలేక... నా మీద నాకు నమ్మకం లేకపోయినప్పటికీ... ఆ వ్యాసరచన పోటీలో నేను పాల్గొన్నాను. నాకు ప్రథమ భహుమతి వచ్చింది. ఆ బహుమతి నాలో అచంచలమైన ఆత్మవిశ్వాసాన్ని నింపింది. న్యాయం పట్ల కొన్ని కోట్లరెట్లు గౌరవాన్ని పెంచింది. సార్...! నేను వరుసగా... గత అయిదేండ్ల నుండీ... దక్షిణ మధ్య రైల్వే విభాగంలో ఉత్తమ టికెట్ కలెక్టర్‌గా రివార్డులందుకుంటున్నాను. దానికి కారణం మీరే మాష్టారూ!!" చెప్పాడు టి.సి.

ప్రయాణికులందరూ... వీరిద్దరి వైపు విచిత్రంగా చూస్తున్నారు.

మేష్టారికి, తను టికెట్ కొనలేదనే విషయం చెప్పాలనిపించింది.

"బాబూ... టికెట్..."

మేష్టారి వాక్యం పూర్తి కాకముందే, "మాష్టారూ! మీ దగ్గర టికెట్ చెక్ చేయడమంటే... న్యాయదేవతపై బ్రోతల్ కేసు మోపినంత పాపం!!" అనేసి టి.సి. ముందుకు నడిచాడు.

మేష్టారి కళ్లలో నుండి నీళ్ళు జలజలా రాలాయి.

ఎన్నో సంవత్సరాల తర్వాత, నన్ను చూసి నందుకు... ఆనందభాష్పాలు రాలాయి కాబోలు ననుకున్నాడు టి.సి. ఆయన వైపే చూస్తూ.

నైతిక విలువల్ని పరిరక్షించమని బోధించిన తనకు ఈ రోజు... తన శిష్యుని ప్రవర్తన, మాటలు... బాకుల్లా గుచ్చుకున్నాయేమో! అందుకే కంట్లోనుండి నీళ్ళురాలాయేమో!'

– కె. శరత్‌చంద్ర

## ప్రేమలేఖ

చక్రవర్తి శ్రావణి సీటు దగ్గరికి వచ్చాడు.

"గుడ్ మార్నింగ్ శ్రావణీ" అన్నాడు.

"గుడ్ మార్నింగ్" అన్నది శ్రావణి.

చక్రవర్తి స్టూలు లాగి ఆమెకు దగ్గరగా కూర్చున్నాడు.

"ఏమిటి సంగతి?" అన్నాడు.

"ఏముంటాయి? మామూలే" అని నవ్వింది శ్రావణి.

చక్రవర్తి రోజూ శ్రావణి సీటు దగ్గరకు



రావడం, కూర్చుని హస్కు కొట్టడం మామూలే. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోబోతున్నారనీ, బంధువులేననీ అంతా అనుకుంటున్నారు.

"ఆ నవల చదివావా?" అడిగాడు చక్రవర్తి

"ఏ నవల?"

"లవ్‌స్టోరీ"

ఓ... అదా! నేను చదివాను. నా ఫ్రెండ్ చదువుతానంటే ఇచ్చాను. అందుకే లేటయింది. సారీ! లెండింగ్ లైబ్రరీలో రెంట్ ఎక్కువ అవుతుందేమో గదా?" అన్నది శ్రావణి.

"ఇట్సాల్ రైట్" అన్నాడు చక్రవర్తి

శ్రావణి అతనికి లవ్‌స్టోరీ నవల ఇచ్చింది. చక్రవర్తి అటెండర్ని పిలిచి రెండు కాఫీ ఆర్డర్ చేశాడు. ఇద్దరూ కాఫీ తాగారు. తర్వాత తన సీట్లోకి వెళ్ళిపోయాడు చక్రవర్తి.

"నీకేమే రోజూ కాఫీ తెప్పించే వాడు దొరికాడు" అని జోక్ చేసింది పక్కసీట్లో వనజ.

శ్రావణి నవ్వి ఊరుకుంది.

చక్రవర్తి తన సీట్లో కూర్చుని శ్రావణివైపు

చూస్తూ ఆమె అందాన్ని కళ్ళతో ఆస్వాదిస్తు న్నాడు. శ్రావణి చదివి ఇచ్చిన లవ్‌స్టోరీ నవల పేజీలు తిరగేశాడు. గులాబీ రంగు కవరు జారి కింద పడింది. అది తీసి చూశాడు. కవరుపైన శ్రావణికి అని వుంది. కుతూహలంతో కవరు విప్పి చూశాడు. లోపల గులాబీరంగు కాగితం వుంది. చద వసాగాడు చక్రవర్తి.

డియర్ శ్రావణి!

ఐయామ్ వెరీ వెరీ సారీ! జరిగినదానికి నేను చాలా ఫీలవుతున్నాను. ఇలా జరుగు తుందని నేను కలలోగూడా అనుకోలేదు. నువ్వు మా చెల్లికోసం రావడం, అది ఇంట్లో లేకపోవడం, మనం కబుర్లలోపడిపోవడం, ఇంతలో కరెంట్ పోవడం, నేను కేండిల్ ముట్టిస్తానంటూ లేచి నీ మీద పడడం, ఇద్దరం కౌగలించుకుని మైమరచిపోవడం అంతా యాదృచ్ఛికంగా జరిగిపోయింది. ఏదో బలహీనమైన క్షణాలలో మనం శారీర కంగా కలవడం విధి విపరీతం. ఏమం టావు? నిన్ను చూడాలంటే నాకు సిగ్గుగా వుంది. ఇప్పుడు ఏం చేయాలో నాకు అర్థం కావడం లేదు. జరిగినదంతా మా సిస్టర్‌కి చెప్పి సలహా అడుగు. అది ఎలా చెప్తే అలా చేద్దాం.

శ్రీకాంత్

అది చదివిన చక్రవర్తి గుండె భగభగ మండింది. ఐతే శ్రావణికి ఎవడో శ్రీకాం త్‌తో సంబంధం ఏర్పడిందన్నమాట అని పళ్ళు కొరుక్కున్నాడు. ఈ లెటర్ శ్రావణి చదివిందో లేదో? అనుకుంటూ చక్రవర్తి ఆ కవరు తీసుకెళ్ళి శ్రావణికిచ్చాడు.

"ఇందులో నీకేదో కవరు ఉంది. లవ్ లెటరేమో? " వ్యంగ్యంగా అన్నాడు.

"థ్యాంక్స్" అన్నది శ్రావణి నవ్వుతూ.

చక్రవర్తి ముఖం మాడ్చుకుని వెళ్ళిపోయి తన సీట్లో కూర్చున్నాడు. శ్రావణితో పెళ్ళి జరుగుతుందన్న ఆశ పేకమేడలా కుప్పకూలి పోయింది. చెడిపోయిన దాన్ని తనెలా పెళ్ళి చేసుకోగలడు? అనుకుంటూ నిరాశపడ్డాడు.

"ఏమిటే లవ్ లెటరా? " అన్నది వనజ.

"చదువు" అంటూ అందించింది శ్రావణి.

"రోజూ నీ దగ్గరకు వస్తూనే ఉన్నాడుగా. ఇంకా లవ్ లెటరెందుకు రాశాడు చక్రవర్తి? " అంటూ కవరు తీసుకుంది వనజ.

"నోర్మూసుకుని చదువు" అన్నది శ్రావణి

వనజ కవరు విప్పి చదవసాగింది.

వనజ అంతా చదివి ఆశ్చర్యపోయింది.

"ఏమిటే ఇదంతా? ఆ శ్రీకాంత్ ఎవరూ? " అన్నది వనజ బిత్తరపోతూ.

"ఎవడూ లేడు" నవ్వింది శ్రావణి.

"అంటే"

"అంటే ఏముంది? ఈ చక్రవర్తిగాడి పీడ విరగడ చేసుకునేందుకు నాకు నేనే రాసుకు న్నాను. ఇదంతా చదివి నేను చెడిపోయిన దాన్నని ఫీలైపోతున్నాడు గురుడు. అటు చూడు వాడి ముఖం పెనం మీద మాడిన పెసరట్టులా ఎలా మాడిపోయిందో!" అన్నది శ్రావణి.

" ఓర్నీ... భలేదానివే" అన్నది వనజ.

"వాడి గురించి తెలియంది ఏముంది? మొదటి పెళ్ళాన్ని రాచి రంపాన పెట్టాడు అనుమానం పిశాచి. వీడి తల్లొక బ్రహ్మారా క్షసి. అదంతా భరించలేక వీడి పెళ్ళాం కిర సనాయిలు పోసి తగలబెట్టుకుంది. వీడేమో అదంతా కప్పిపుచ్చి దానికేవేవో అక్రమ సంబంధాలున్నాయని ప్రచారం చేశాడు. మంచి ఉద్యోగం వుంది గదా అని మా ఇంట్లో వాళ్లు వీడిని చేసుకోమని నన్ను పోరుతున్నారు. బంధువులు గూడా కావడం పెద్ద తలనెప్పిగా మారింది. వీడిని ఎట్లా వదిలించుకోవాలో ఆలోచించి ఈ పనిచే శాను" నవ్వుతూ అన్నది శ్రావణి.

"వెల్ డన్" మెచ్చుకుంది వనజ

– వాణిశ్రీ

✦

# 'ఎటో వెళ్లిపోతోంది... మనసు' పై సమీక్షలు

జనవరి 2005 'చతుర'లో ప్రచురితమైన రావినూతల సువర్ణాకన్నన్ నవల 'ఎటో వెళ్లిపోతోంది... మనసు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ఏవీ ఆ రోజులు...?!

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

తీయటి జ్ఞాపకాల తరంగాలపై తేలియాడిస్తూ పచ్చటి పల్లె వాతావరణంలో నులివెచ్చటి మానవ సంబంధాల తరగలలో హృద్యమంగా సాగిన అపురూపమైన నవల ఇది. ఇందలి బంధుత్వాలు, స్నేహబాంధవ్యాలూ, పరిచయాలూ అనురాగ సుధలను చిలికిస్తాయి. గుమ్మపాలవంటి మనస్తత్వాలు, మీగడ తరగలలాంటి మానవత్వాలు ఆప్యాయంగా పలుకరిస్తాయి. మనసులకు హత్తుకుంటాయి. పల్లెలోని ఆకతాయి, అల్లరి పిల్లల చిలిపి చేష్టలు... గడుగ్గాయి, గడుసుపిల్ల యమున కొంటె పనులు... బొమ్మలకు బదులు మనుషులకే 'బొమ్మల పెళ్ళిళ్ళు' చేసే వారి అమాయత్వమూ... మదికి హాయి గొలుపుతాయి.

తెలిసీ తెలియని వయసులో యమున పలుకులను మనసులో గాఢంగా నాటించుకున్న మృత్యుంజయ- ఆమెపైన ప్రేమ పెంచుకుని, అది సాధ్యం కాదని తెలియడంతో ఆమె జీవితంలోంచి క్వయెట్‌గా తప్పుకుని, ఆమెను మరిచిపోలేక అవివాహితుడిగా మిగిలిపోవడం ఊహించని మలుపు. తన ఆసుపత్రికి యమున పేరు పెట్టడం ఆమెపైన అతనికి గల ప్రగాఢ ప్రేమాభిమానాలకు నిదర్శనమవుతుంది.

ఆకతాయితనమూ, అమాయకత్వమూ, గడుసుతనమూ మిళాయించుకున్న అల్లరి యమున పాఠకుల మనసులలో నిలిచిపోతుంది. అందరి హృదయాలూ దోచుకుని, ఆహ్లాదం కలిగించిన ఆ 'పిల్ల', చివరికి గుండె జబ్బుతో కన్నుమూస్తోందన్న సత్యం గుండెల్ని బరువెక్కించక మానదు... కిరీటి ఇక లేడన్న చేదునిజమూ మనసుల్ని తాకుతుంది.

అవసాన దశలో అనుకోకుండా యమున, మృత్యుంజయను కలుసుకోవడం, అతని సమక్షంలో తుదిశ్వాస వదలడమూ అంతరాంతరాళాల్లో వారిరువురికీ ఒకరిపై మరొకరికి నిగూఢమైయున్న ప్రేమ యొక్క బలమేననిపిస్తుంది.

యమున బామ్మ, తల్లిదండ్రులు, కిరీటి, అతని తల్లిదండ్రులతోపాటు- అప్పుడప్పుడు మెరుపులా మెరిసి మాయమయ్యే మృత్యుంజయ తల్లిదండ్రులు, పూజారి తాతయ్య, సత్యం మాస్టారుల పాత్రలు సైతం పాఠకుల మనసులకు హత్తుకుంటాయి.

*- సత్యనారాయణ, సికింద్రాబాద్.*

## ఓ కళాఖండం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఇప్పుడొచ్చే కథలకు భిన్నంగా ఎటువంటి ట్విస్ట్‌లకూ తావీయకుండా, కమర్షియల్ హంగులకు దూరంగా సాగిన ఈ నవల ఎంతో కళాత్మకమైనది. చక్కటి పదజాలంతో సాగిన ఈ నవల మనకెంతో ప్రశాంతతను చేకూర్చి, మనల్ని ఒక కొత్తలోకం

లోకి తీసుకెళ్తుంది. సహజసిద్ధమైన కోనేటి నీటిలా నిర్మలమైనదీ నవల. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఓ కళాఖండంలా... ఉందీ నవల.

అన్ని సంఘటనలూ ఎంతో సహజాతిసహజంగా జరుగుతూ మనల్ని ఆకట్టుకుంటాయి. పవిత్రమైన స్నేహబంధానికి పెద్ద పీట వేస్తూ అడుగడుగునా హృదయాన్ని మీటుతూ సాగిన ఈ నవల ప్రతి ఒక్కరి మనసుల్లోకి చొచ్చుకొని పోతుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

యమున జయ, కిరీటీ ఇద్దరినీ ప్రేమించినప్పటికీ, బావ అయిన కారణంగా పెళ్లి చేసుకొనేందుకు కిరీటి వైపే మొగ్గు చూపింది. కానీ ఆమెని మనస్ఫూర్తిగా ప్రేమించిన జయ ఆమెనే ఆరాధిస్తూ పూజిస్తూ ఆమె జ్ఞాపకాలనే పెట్టుబడిగా, ఎంతో ఉన్నతస్థాయి డాక్టర్‌గా ఎదిగి, పేదల సేవలో నిమగ్నమయ్యాడు. ప్రేమ త్యాగాన్ని కోరుతుందంటారు. ఆ త్యాగం చేసిన జయ ఎంతో ఉన్నతుడయ్యాడు. తనకు దక్కని పిల్ల ఇంకెవరికీ దక్కకూడదనే మగాళ్ళున్న ఈరోజుల్లో జయలాంటి ఉత్తమ ప్రేమికులు చాలా అరుదుగా ఉంటారు.

తన మధురమైన బాల్య జ్ఞాపకాల్ని ఆకర్షించి తన ప్రియనేస్తానికందించి అతని ఒడిలోనే కన్నుమూసిన యమున ఎంతో అదృష్టవంతురాలు. ప్రతి మనిషి మనసులోనూ ఒకరికి స్థానం ఉంటుంది. ఆ స్థానంలో ఉన్న వారు మనకు దక్కనపుడు వారిని మరచిపోయి, ఇంకొకసారి ఆ స్థానాన్ని కేటాయించడం ప్రేమనిపించుకోదు, సర్దుబాటు అనిపించుకుంటుంది. అటువంటివారు నిజమైన ప్రేమికులు కారు. ఎప్పుడో చిన్ననాడు దూరమైనవారు జీవితపు చివరిరోజుల్లో కలుసుకోవడం అప్పుడు కూడా ఒకరిపై ఒకరు అవిభాజ్యమైన అనురాగాన్ని ప్రదర్శించడం వారి పవిత్రస్నేహానికి తార్కాణం.

ప్రేమకు పరిధిలేదని, దానికి వయసుతో సంబంధం లేదని రచయిత చక్కగా చెప్పారు. నిజమైన స్నేహానికి స్వచ్ఛమైన ప్రేమకు ప్రతీక ఈ నవల.

– పి.కిశోర్‌కుమార్
బుచ్చిరెడ్డి పాలెం

## అద్భుతం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**బా**ల్యంలో ఉన్న దుడుకుతనం, చిలిపిదనం పెళ్ళయినా తగ్గకపోవటం పరిపక్వత చెందని, ఆమె వయసు రాహిత్యాన్ని తెలియజేస్తున్నది. ఏది ఇష్టమో ఏది కష్టమో తెలుసుకోలేని వయసులో పెళ్ళి చేసినా ఒక విధంగా ఆమెకు మేలే జరిగింది. మనసులో ఎక్కడో అట్టడుగు పొరల్లో దాచుకున్న మృత్యుంజయ పటాన్ని, అప్పుడప్పుడూ దర్శించుకుంటూ స్నేహ మధురిమను రెట్టింపు చేసుకుని, కడ వరకూ ఆ స్నేహాన్ని పదిలపర్చుకోవటం ఎంతమందికి సాధ్యం అవుతుంది. మృత్యుంజయను యమున స్నేహితునిగానే ప్రేమించింది తప్ప, మరే దురుద్దేశ్యం ఆమెకు లేదు. ఆ విషయం ఆమె భర్త కిరీటికీ తెల్సు.

ఈ కథలో మృత్యుంజయది ముఖ్యమైన పాత్ర. అతను తన త్యాగంతో పాఠకుల మనసుకు మరింత దగ్గరై అందరి దృష్టిలో గొప్పవాడయ్యాడు. మృత్యు యమునతో చేసిన స్నేహాన్ని ప్రేమగా మార్చుకుని, ఆ సంగతి బయటపడనివ్వకుండా అత్యంత జాగ్రత్తగా వ్యవహరించినా, చివరకు ఆమెకు తెల్సిపోతుంది. అట్టడుగు పొరల్లో మృత్యుంజయపై ఉన్న అభిప్రాయం, బలపడి అతని చేతుల్లో తృప్తిగా కన్ను మూసింది వృద్ధ స్నేహమయి యమున.

రచయిత్రి బాల్య స్నేహ మాధుర్యాన్ని,

పల్లె జీవితాల అనుభవాన్ని చవిచూపించిన తీరు అద్భుతంగాను ఆనందంగాను ఉంది.

– విజయలక్ష్మి,
మిర్యాలగూడ.

## విందు

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఈ నవల చదువుచున్నంత సేపూ, నా మనసు నా బాల్యంలోకి పోయి, ఆ మధుర మైన అనుభవాలను మరొక్కసారి స్మృతిపథంలో తళుక్కుమనిపించింది. చదవడం ముగించిన చాలా సేపటి వరకూ, నా మనసు కూడా ఎటో వెళ్లిపోయింది. స్పందించే మనసున్న ప్రతి ఒక్క పాఠకుడికీ ఇదే అనుభూతి కల్గి ఉంటుందని నా ప్రగాఢ విశ్వాసం.

మహా భారతంలో సంజయుడికి శ్రీ కృష్ణ పరమాత్మ వరం వల్ల దూరదర్శనా శక్తి కల్గి, ధృతరాష్ట్రునికి చూపించినట్లే, రచయిత్రి తన కథాగమనంలోని గమక, చమకాలతో మన మనోనేత్రాలను తెరిపించి, విలువలు కోల్పోయి నిస్సారమైన మన జీవన ప్రాంగణంలోకి బాల్యస్మృతులనే మధురవీచికలు పంపి పులకింపచేశారు.

శైలిలో మరొక 'ముప్పాళ'ని, వాడుక భాషలో మరొక 'ముళ్ళపూడి'ని, సున్నితమైన హాస్యపు చురకలలో మరొక 'భానుమతీ రామకృష్ణ'ను తనదైన ప్రత్యేక వంటలో చేర్చి షడ్రసోపేతమైన విందుని అందించారు. స్నేహానికి, ప్రేమ-త్యాగాలకు కొత్త నిర్వచనాన్నిచ్చి, 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్న నానుడికి ప్రతీకలుగా యమున (మున్నీ), మృత్యు(జయ), కిరీటి(సీనియర్ అండ్ జూనియర్) పాత్రల్ని చిరంజీవులుగా మలిచారు.

– వి.యస్.మంగళంపల్లి
భువనేశ్వర్-751017

## నేను సైతం...

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

బోర్ సీరియల్స్‌తోను, ప్రేమ, ఫ్యాక్షన్ సినిమాలతోను విసుగు చెందిన జనానికి ఎడారిలో 'ఒయాసిస్సు' లాంటిది యీ నవల అని చెప్పక తప్పదు. రచయిత్రి సువర్ణాకన్నన్ ఎటో వెళ్ళిపోతోంది... మనసు నవలలో ఓ సాంప్రదాయ కుటుంబానికి వారి ఆచార వ్యవహారాలకి అక్షర రూపమిచ్చి మన కళ్ళెదుట సాక్షాత్కరింప చేశారు; కంగ్రాట్స్! ఇందులో కథాకథనం ముఖ్యంగా యమున కిరీటి, మృత్యుంజయ పాత్రల చుట్టూ తిరుగుతుంది. ఆయా పాత్రల అమాయకపు అల్లరి చిల్లరి చేష్టలు, గిల్లికజ్జాలు, ప్రేమలు, పెళ్ళిళ్ళు, మానసిక సంఘర్షణలు కలిసి వెరసి నవలగా తయారైందని చెప్పవచ్చును.

ఈ నవలలో మృత్యుంజయ పాత్ర అత్యుత్తమంగా తీర్చిదిద్దారు రచయిత్రి. తనది కాని, ప్రేమికురాలు, స్నేహితురాలు అయిన యమునని మర్చిపోలేక ఆ జన్మబ్రహ్మచారిగా నిల్చిపోవడం, ఆమె పేర ఓ హాస్పటల్‌ని నిర్మించడం ద్వారా మృత్యుంజయ ప్రేమపూజారిగా పాఠకుల హృదయాలలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్నాడు. తన మనసుని చంపుకొని మేనమామ కూతురు వైదేహితో పెళ్ళి చేసుకొని సర్దుకుపోయి జీవించాలని కూడా అనుకోలేదు. వృద్ధాప్యంలో యమున మనస్సును అర్థం చేసుకొని గుండె జబ్బుతో తనకు చేరువైన ఆమె మనః శరీరాలకు ఊరట చేకూర్చాడు కూడా!

ఈ నవల సాంతం చదివాక నా బాల్య స్మృతులను బంధుమిత్రులతో గడిపిన ఆనాటి తీపి చేదు అనుభవాలను నెమరేసుకోకుండా ఉండలేకపోయాను.

– ఊకోటి శ్రీనివాసులు, తలుపూరు.



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2005

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.



రాణీ రుద్రమ ఝాన్సీలక్ష్మిల ప్రేరణ!
చిన్ననాటి ఆటల్లో అశ్వారోహణ!!

ఫొటో: వి. నర్సయ్యా

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78